# ఎ. గ్రీన్

## ఎర్ర తెరచాపలు

*

## పాము

*

## అతని తండ్రి ఆగ్రహం

*

## పోర్ట్ కమాండెంట్

అనువాదం: ఆర్వియార్
చిత్రాలు: ఎమ్. దోరొఖొవ్

**АЛЕКСАНДР ГРИН**

АЛЫЕ ПАРУСА

*на языке телугу*

**A. GRIN**

CRIMSON SAILS

*In Telugu*


సోవియట్ యూనియన్‌లో ముద్రింపబడింది

$\Gamma \frac{4803010102—263}{031(01)—84} 369—84$

# అలెగ్జాండర్ గ్రీన్ జీవితం

అలెగ్జాండర్ గ్రీన్ అనే కలంపేరుతో రచనలు చేసిన అలెగ్జాండర్ స్తెపానొవిచ్ గ్రినేవ్స్కీ 1932 జూలైలో స్తారీక్రిమ్‌లో మరణించాడు. ఆ చిన్న పట్టణం వందల యేళ్ల వయసున్న హేజెల్ చెట్లకి ప్రసిద్ధి.

ఆయన కష్టజీవి. ఆయన్ని ఒక నేరస్తుడిగానో, చేదుకసితో నిండిన సంస్కారహీనుడిగానో చెయ్యడానికి ప్రతీదీ కుట్ర పన్నినట్లయింది. అయినా యెన్ని ప్రతికూల పరిస్థితులు వున్నా యీ విషణ్ణ మానవుడు తన వ్యధాకులిత జీవితమంతా కూడా శక్తిగల భావనా పటిమనీ, అనుభూతి స్వచ్ఛతనీ, జంకుగా వుండే మందహాసాన్నీ అమలినంగా కాపాడుకున్నాడు.

విప్లవాత్పూర్వం వున్న మానవ సంబంధాలమీద గ్రీన్ జీవితం నిర్దాక్షిణ్యమైన ఖండన. పాత రష్యా ఆయనని కర్కశంగా చూసింది, తొలి బాల్యంలో వాస్తవం పట్ల ప్రేమని ఆయనకి లేకుండా చేసింది. ఆయన స్థితిగతులు భయంకరంగా వుండేవి, జీవించడం వృథా అనిపించేది. ఆ జీవితం కాలుకి కాలూ చెయ్యికి చెయ్యా విరుచుకుని తినే ఆటవిక విందులా వుండేది. గ్రీన్ నిభాయించుకుని వచ్చాడు, కాని వాస్తవంపట్ల ఆయన అవిశ్వాసం మాత్రం ఆయన జీవితాంతం వుండిపోయింది. ''చలజ్జీవన దైనందిన కోలాహల పాంశుపరాగం''లో కంటే, ''కలల పట్టుకుచ్చు లూగుతున్న కిరీటం'' ధరించి జీవించడమే మేలని భావించి యెప్పుడూ ''అన్నీ మరిచి యెగిరిపోదామని'' ప్రయత్నిస్తూనే వున్నాడు.

గ్రీన్ రచయిత అయాడు. తన పుస్తకాలల్లో ఉల్లాసపూరితమైన, సాహసభరితమైన మనుషులనీ, సుగంధ పరిమళాల వనాలూ, ఆహ్లాదకరమైన సూర్యకాంతీ వుండేనేలని, — భూగోళపటంమీద కనిపించని నేలని — సృష్టిస్తూ, ఘాటైన మధువు సేవించినట్టు తలని తిప్పే అత్యద్భుత సంఘటనలని వర్ణిస్తూ గ్రీన్ రచయిత అయాడు.

''ప్రతి చోటా నాకు అదే కనిపించింది: కథలు, యెంత ఆసక్తికరంగా వున్నవైనా సరే, ప్రజల్ని తమ దౌర్భాగ్యమైన, అయినా అలవాటు పడిపోయిన, జీవితంనుంచి ఓ గంటసేపు మరపింప చేసేవి కాబట్టే ఆస్వాద యోగ్యం అయేవి'' అని మక్సీమ్ గోర్కీ ''నా విశ్వవిద్యాలయాలు'' అన్న పుస్తకంలో రాశాడు.

యిది గ్రీన్ విషయంలో నూటికి నూరు పాళ్లూ నిజం.

ఆయనకి సంబంధించి రష్యను జీవితం, సంస్కారహీన వ్యాత్కా పట్టణానికీ, చెత్త వృత్తిశిక్షణా పాఠశాలకీ, వసతి గృహాలకీ, నడుములు విరిచే పనికీ, ఖైదుకీ, నిరంతర క్షుద్బాధకీ కుంచించుకుని పోయింది. యేమైనా యెక్కణ్ణో దిఙ్మండల పలితరేఖ కవతల ధగద్ధగాయమానంగా ప్రకాశించే ఖండాలు, సముద్ర మారుతాలు, పుష్పించే గరికలు వున్నాయి. ఆతపస్పృశిత మానవులు అక్కడ వున్నారు: బంగారు అన్వేషకులు, కుచ్చుకోసం అడవి జంతువులని వేటాడేవాళ్లు, కళాకారులు, ధైర్యసాహసులైన పథికులు, పిల్లలమాదిరీ ఉల్లాసంగా మృదువుగా వుండే ఆడవాళ్లు, అందరినీ మించి నౌకా యాత్రికులు వున్నారు.

యెక్కడో దూరంగా మహాసముద్రపు ద్వీపాల్లో అలాంటి క్షేత్రాలు పుష్పించి మర్మర ధ్వనులు చేస్తాయనే విశ్వాసం గ్రీన్‌ని నిలబెట్టింది. అవి లేకుండా జీవించడం అసహ్యం అనిపించింది గ్రీన్‌కి.

6 విప్లవం వచ్చింది. గ్రీన్‌ని పీడించిన చాలా దాని అంతానికి అది నాంది: పాత మానవ సంబంధాల పాశవిక నిర్మాణం, దోపిడి, బహిష్కరణ — జీవితంనుంచి ఆయన పారిపోయి స్వప్న మరీచికల, కాల్పనిక ప్రపంచంలోకి పోయేటట్టు చేసిన ప్రతిదాని అంతానికీ అది నాంది పలికింది.

విప్లవంతోటే గ్రీన్ మనస్ఫూర్తిగా పరవశించిపోయాడు. కాని విప్లవం ఆవిష్కరించిన నూతన భవిష్యత్తుకి సంబంధించిన సౌందర్య దృశ్యం యింకా మసగ్గానే గోచరమవుతోంది, దాంతోటే గ్రీన్ దీర్ఘ వ్యాథిలాంటి అసహనంతో పీడితులయే వాళ్లల్లో ఒకడయాడు.

విప్లవం వచ్చినప్పుడు పండగ తిరణాళ్లలాగా రాలేదు, రక్తసిక్తమైన సైనికుడు లాగా లేకపోతే శస్త్రవైద్యుని లాగా వచ్చింది. శతాబ్దాలుగా పేరుకు పోయిన మకిలినీ, కుళ్లునీ అది దున్నేసింది.

తేజోవంతమైన భవిష్యత్తు చాలా దూరంలో వున్నట్టు కనిపించింది గ్రీన్‌కి. ఆయన దాన్ని అక్కడే అప్పుడే అనుభవించాలనుకున్నాడు. భవిష్యత్ నగరాల స్వచ్ఛమైన వాయువులని పీల్చాలనీ, వృక్షసంతతి మర్మర ధ్వనుల తోటీ పిల్లల కిలకిలారావాలతోటీ స్నపతుడవాలనీ కాంక్షించాడు. అక్కడ ప్రజల యిళ్లల్లో ప్రవేశించి, పులక లెత్తించే పరిశోధనల్లో వాళ్లతో కలిసి, వాళ్ల ప్రయోజనపుష్ట, ఆనందమయ జీవితాలని పంచుకోవాలని కాంక్షించాడు.

వాస్తవం దీన్నంతటినీ గ్రీన్ అరచేతిలో వెంటనే గోరు ముద్దలుపెట్టినట్టు పెట్టలేదు. అసాధారణ సంఘటనలు, అసాధారణ ప్రజలు వుండే ఆయన కాంక్షిత ప్రపంచానికి ఒక్క భావనా విహంగాలే ఆయన్ని తీసుకుని వెళ్లగలిగాయి.

చిన్న పిల్లాడిగా కూడా గ్రీన్‌కి సూటి భావనాపటిమ వుండేది. ఆయన రచయిత అయాక తన కథల కార్యరంగం అయిన అభావ దేశాలని మసకకమ్మిన ప్రకృతి దృశ్యాలలాగా కాకుండా తను సన్నిహితంగా పరి శీలించి, వందలాది సార్లు సంచరించిన స్థలాలుగానే దర్శించాడు.

ఆయన వాటి సవివరమైన పటాన్ని, రోడ్డులోని ప్రతి మలుపునీ, చెట్లూ చేమల రకాలనీ, నది ప్రతి వంపునీ, యిళ్ల తీరునీ గుర్తిస్తూ గియ్యగలిగి వుండేవాడు. కడగా ఆయన అభావమైన ఓడరేవుల్లోని ఓడలన్నిటినీ సకల నౌకా వివరాలతోటీ, వాటిల్లో వుండే నిర్విచార, జీవితేచ్ఛగల సిబ్బందితోటీ వర్ణించగలిగి వుండేవాడు.

యిక్కడ అలాంటి అభావ ప్రకృతి దృశ్యం ఒకటి వుంది. తన చిన్న కథ ''లాన్‌ఫియేర్ కాలనీ''లో గ్రీన్ రాస్తాడు:

''ఉత్తరాన శ్యామలంగా నిశ్చలంగా ఆకుపచ్చ మందలాగా అడవి దిఙ్మండలందాకా విస్తరించుకుంది. సుద్ద కొండల వరస అక్కడా అక్కడా సందులతోటీ, యెండిపోయిన దుబ్బులతోటీ ఖాళీ జాగాలు కనిపించేటట్టు వుంది.

''తూర్పున, సరస్సుకి ఆవల, పట్టణంలోంచి బయటికి పోయే బాట తెల్లని రిబ్బను లాగా మెలిదిరిగింది. దాని అంచుల్లో అక్కడా అక్కడా తోట కూరకాడలంత చిన్నగా కనిపించిన చెట్లు వున్నాయి.

''పడమటన గుట్టలతోటీ గొందులతోటీ నిండిన మైదానాన్ని చుట్టి విస్తరించుకుని వుంది గాఢనీలపు, తళతళ మెరిసే అద్దంలాంటి మహాసముద్రపు ఉపరితలం.

''దక్షిణాన అటూ యిటూ అంచుల్లో వర్ణశోభిత గృహాలతోటీ, యథాలాపంగా నాటిన చెట్లూ చేమలూ చుట్టూ వున్న క్షేత్రాలతోటీ నిండిన మిట్టలా వున్న జ్వాలా బిలం మధ్యనుంచి లాన్‌ఫియేర్ కాలనీ యేటవాలు నలు చదరపు తోటలూ, దున్నిన భూములూ విస్తరించుకున్నాయి.''

మన యుగానికి అలాంటి ఉధృత స్వాప్నికులు అవసరమా లేదా అనే విషయాన్ని మనల్నే నిర్ణయించు కొమ్మని వదిలేసి గ్రీన్ చనిపోయాడు.

అవును, మనకి వాళ్ళు అవసరమే. ''స్వాప్నికుడు'' అనే పదాన్ని ఒక హేళనాత్మక పదంగా వాడడం మానాలి. చాలామందికి యెలా కలలు కనాలో కూడా తెలీదు, అందుకనే బహుశా వాళ్ళు తమ కాలంతోబాటుగా సాగలేరు.

మానవుడి కలలు కనే శక్తిని హరించివేస్తే సంస్కృతిలో, కళలో, శాస్త్రంలో, అందమైన భవిష్యత్తు కోసం జరిపే పోరాటంలో తోడ్పడే యెంతో శక్తివంతమైన ప్రోత్సాహకాలలో ఒకదాన్ని నష్టపరుస్తున్నాం. అలా అని కలల్ని వాస్తవాలనుంచి వేరు చెయ్యకూడదు. అవి భవిష్యత్తుని గురించి జోస్యం చెప్పాలి. మనం యిప్పటికే ఆ భవిష్యత్తులో వున్నామనీ, మనమే మారిపోతున్నామనీ తెలియచెప్పాలి.

గ్రిన్ కలలు జీవితంతో సంబంధం లేకుండా విడాకులు యిచ్చినవనీ, మనను పిచ్చిగా అర్థరహితంగా చేసిన క్రీడలనీ మామూలుగా అనుకుంటారు. గ్రిన్ సాహసకృత్యాల కథలు రాసిన రచయిత అని — అంటే యితివృత్త నిర్మాణంలో సిద్ధహస్తుడే, కాని ఆయన రచనలకి సామాజిక ప్రాముఖ్యం లోపించిందని, మామూలుగా అనుకుంటూ వుంటారు.

మనమీద కలిగే ప్రభావాన్ని బట్టి, అనుభూతులని బట్టి, ఆయన పుస్తకాలు ప్రేరేపించే ఆలోచనలనీ ప్రవర్తననీ బట్టి, అవి మన జ్ఞాన పరిధిని పెంచుతున్నాయా వూరికే కాలక్షేపం బఠానీ సరుకా అన్నదాన్ని బట్టీ ఒక రచయిత ప్రాముఖ్యం నిర్ణయం అవుతుంది.

గ్రిన్ పుస్తకాలలోని పాత్రలు పసిపిల్లల అమాయకత్వంతో వుండే సగర్వ, నిస్వార్థ, దయా హృదయులు.

యీ ఆకర్షణీయ, పూర్ణ ప్రజ గ్రిన్ ప్రకృతి సహజ దృశ్యాల తాజా, సుగంధ వాయువుల్ని పీలుస్తారు. ఆ దృశ్యం పరమసత్యం, హృదయాన్ని నిరోధించలేని రామణీయకతతో ఆకట్టుకుంటుంది. గ్రిన్ పాత్రలు వసించే ప్రపంచం ఆత్మిక సంపదలేని వాళ్ళకే అవాస్తవికంగా కనబడుతుంది. సముద్రతీరపు లవణభరితమైన, వెచ్చని గాలిని తొలిసారి గుండెలనిండా పీల్చి ఆ సున్నితమైన తిమ్మిరిని అనుభవించిన వాళ్ళు తక్షణం గ్రిన్ సృష్టించిన దృశ్యపు ప్రామాణికతని ఒప్పుకుంటారు.

అన్వేషకులకీ, నౌకా యాత్రీకులకీ, ప్రయాణీకులకీ ప్రత్యేకమైన ''ఔద్ధత్య భావాన్నీ,'' ప్రమాదం, సాహసం నిండిన ఉత్తేజకర జీవితాన్నీ తీవ్రంగా వాంఛించేటట్లు ప్రేరేపిస్తాయి గ్రిన్ రచనలు. గ్రిన్ కథలు చదివింతర్వాత పాఠకుడు మొత్తం ప్రపంచాన్ని దర్శించాలనుకుంటాడు — రచయిత భావనలోని లోకాలని కాదు, నిజమైన, అసలైన ప్రపంచాన్ని వెలుతురుతో అడవులతో, విభిన్న భాషల అట్టహాసం నిండి వుండే ఓడ రేవులతో, మానవ కామనతో ప్రేమతో నిండి వుండే లోకాల్ని.

''యీ ప్రపంచం నన్ను గజిబిజి చేసేస్తుంది. దీని మహాసముద్రాలు అపరిమితమైనవి, దీని దీవులు అసంఖ్యాకమైనవి, యెన్ని అద్భుత, ఎన్ని పరమ సమ్మోహకర దిశలూ మూలలూ వున్నాయో చెప్పనే అక్కర్లేదు'' అని రాశాడు గ్రిన్.

పిల్లలూ పెద్దలూ సమంగానే అద్భుత కథలంటే యిష్టపడతారు. అద్భుత కథలు ఉన్నతమైన, మానవీయ కాంక్షలకి మూలమైన ఉత్సుకతని ప్రేరేపిస్తాయి. అవి మనల్ని ఉదాసీనంగా తయారవనివ్వవు. నిత్య నూతనంగా, తళుకులీనే దిఙ్మండలాలని అవి మనకి ఆవిష్కరిస్తాయి. అవి మనకి మరొక తరహా జీవితాన్ని చూపిస్తాయి. అవి మనని కలిచేసి తీవ్రంగా ఆ జీవితాన్ని కాంక్షించేటట్టు చేస్తాయి. యిదీ వాటిల్లో వుండే సుగుణం, యిదే గ్రిన్ కథానికల్లోని బలీయమైన రామణీయకతలోని సద్గుణం, దాన్ని అస్తమానూ మాటల్లో చెప్పలేకపోయినా.

గ్రిన్ యితివృత్తాల్లో వుండే సాహసికాంశాన్ని దృష్టికి తెస్తూ వుంటారు. సాహసం అయితే నిస్సందేహంగా వుంది, కాని, వస్తువు గాఢతకి యిది పై కవచం మాత్రమే. గ్రిన్ పుస్తకాల్లో వుండే మానవత్వంపట్ల ప్రేమని అంధులే చూడలేరు.

గ్రిన్ అద్భుతమైన ప్రకృతి దృశ్య చిత్రకారుడూ, కథకుడూ మాత్రమే కాదు, సూక్ష్మమైన మానసిక తత్వశాస్త్రవేత్త కూడా. అతి సామాన్య జనంలో వుండే ఆత్మత్యాగాన్ని గురించి, సాహసాన్ని గురించి, వీరత్వాన్ని గురించి ఆయన రాశాడు. శ్రమపట్ల, తన వృత్తిపట్ల ప్రేమని గురించీ, ప్రకృతి అగాధ రహస్యాల్ని గురించీ ప్రకృతి శక్తిని గురించీ ఆయన రాశాడు. స్త్రీలమీద ప్రేమని గురించి గ్రిన్ అంత స్వచ్ఛంగా, సున్నితంగా, భావబంధురంగా యెవరూ రాయలేదు.

సౌందర్యంపట్ల చలించే శక్తిని పోగొట్టుకోని యెవరినైనా కదిలించగల భాగాల్ని గ్రిన్ పుస్తకాలనుంచి వందల కొద్దీ ఉల్లేఖించగలను. కాని పాఠకుడు వాటిని తనే చూడగలడు.

''యీ భూమి అంతా, దానిమీద వున్న సమస్తమూ, జీవితంకోసం, యెక్కడ మనుతూ వున్నా ఆ జీవితాన్ని గుర్తించడంకోసం మనకి దక్కింది'' అన్నాడు గ్రిన్.

గ్రిన్ మన కాలానికి అవసరమైన రచయిత. యేవి లేకపోతే సోషలిస్టు సమాజం సంపూర్తికాదో ఆ ఉన్నత అనుభూతుల అభివృద్ధికి ఆయన తన వంతు అందించాడు.

కె. పౌస్తోవ్‌స్కీ

# తెలుగు వాళ్లకి తెలియని గ్రీన్

సామాన్య తెలుగు పాఠకులకి అలెగ్జాండర్ గ్రీన్ పేరు కొత్త. ఒకవేళ విన్నా యింగ్లీషు రచయిత యేమో ననుకుంటారు. ఆయన రచనలు చదివినా యింగ్లీషు వాతావరణం వున్నట్టే భాసిస్తుంది. కాని గ్రీన్ సోవియట్ రచయిత. ఆయన అసలు పేరు అలెగ్జాండర్ స్తెపానొవిచ్ గ్రినేవ్‌స్కీ. టాల్‌స్టాయ్ నుంచి షోలొహోవ్ దాకా చాలా మంది రష్యన్, సోవియట్ రచయితలు ప్రపంచ పాఠకులకీ, సామాన్య తెలుగు పాఠకులకీ పరిచయమే. యింకా చెప్తే యిటీవలి సోవియట్ రచయితల పేర్లూ, కవుల పేర్లూ కూడా తెలుగు పాఠకులకి పరిచయం అవుతూనే వున్నాయి. కాని యీయన, గ్రీన్ కలంపేరున్న గ్రినేవ్‌స్కీ, యెవరు? యీయన కృషి యేమిటి? యీనాడు ఆయనకి వున్న ప్రాముఖ్యం యేమిటి?

అలెగ్జాండర్ స్తెపానొవిచ్ గ్రినేవ్‌స్కీ వ్యాత్కా రాష్ట్రంలోని స్లబోద్‌స్కోయె పట్టణంలో 1880 ఆగస్టు 11(23)న పుట్టాడు. ఆయన తండ్రి స్తెపాన్ గ్రినేవ్‌స్కీ పోలిష్ విప్లవకారుడు. 1863 వార్సా తిరుగుబాటులో పాల్గొన్నందుకు దేశ బహిష్కార శిక్షకి గురయాడు. టెక్నికల్ స్కూల్‌లో సెకండ్ ఫారం చదివేటప్పుడు ఉపాధ్యాయుల మీద వ్యంగ్య గేయాలు రాసినందుకు గ్రీన్‌ని వెళ్లగొట్టేశారు. పదహారవ యేటనే జీవితాన్వేషణ ఆరంభమైంది. యెన్ని ఉద్యోగాలో చేశాడు. యెంతో తిరిగాడు. నావికుడుగా సముద్రంమీద సంచారం చేశాడు. 1902లో సోషలిస్టు రివల్యూషనరీ పార్టీలో చేరాడు. 1903 – 1910 మధ్య యెన్ని సార్లో అరెస్టయాడు. ప్రవాసంలో బతికాడు. దొంగ పాస్‌పోర్టులమీద జీవించాడు. జారిస్టు రహస్య పోలీసులు ఆయన తొలి కథని స్వాధీనం చేసుకున్నారు. ఎ. ఎస్. గ్రీన్ అనే దస్కత్తు మొదటి సారిగా 1908లో కనిపించింది. "గోర్వంకల రెక్కల"తో అన్నీ మరిచి యెగిరిపోయాడు. మనిషి హృదయంలోని కోరికలకీ, కామనలకీ మంచి చెయ్యాలనే కాంక్షలకీ వాస్తవం వైముఖ్యం కనబర్చినప్పుడు, సాంఘిక పోరాట మార్గాలు తెలియనప్పుడు రచయిత అనేవాడు తన ఆత్మ సంపదని వెల్లడించుకోడానికి వూహలనీ, కల్పనలనీ ఆలింగనం చేసుకుంటాడు.

తన సమకాలికుడైన మక్సీమ్ గోర్కీ గడిపిన లాంటి జీవితాన్నే రచయిత కాకముందు రష్యన్ పట్టణం వ్యాత్కాలో గ్రీన్ కూడా అనుభవించాడు. ఆ జీవితం నిరాశా నిస్పృహల కూడలి. కష్టాల, కన్నీళ్ల కడలి. గ్రీన్ బాల్య జీవితమూ ఆయన అప్పుడు చదివిన పుస్తకాలూ రచయితగా ఆయన రూపుదిద్దుకోవడంలో ప్రముఖ పాత్ర వహించాయి.

గ్రీన్ రచయిత అయాడు. "నా లోపల నా బాధలు నా వెలుపల క్షతజగత్తు ఆక్రోశించిన కరుణ బీభత్స రవాలు నిరంతర పరిణామ పరిణాహ జగత్కటాహంలో సలసల కాగే మానవాశ్రుజలాలు," అయినా "అంతర్గత సంగీతం, అనుపమ సుందర గీతం" వినబడుతూ వుంటే యీయన ప్రవాసంలో "అద్భుత సౌధాల మణికవాటాలు" తెరుచుకోవడం మానలేదు. తనని "కికురించిన కల" కోసం వెదికేవాడు. "ఉషఃకాంతి వంటి ఊహతో" "భవిష్యదభిముఖంగా సాగి" పోయాడు. యీయన భావనా పటిమ ఘనమైంది. యీయన కల్పనా శక్తి కమనీయమైంది. యీయన "ఇంద్రధనస్సుల్ని, అదృశ్య స్వర్గాల్ని, అశ్రుత గాంధర్వాన్ని" అన్వేషించు

కుంటూ పోవడంలోనే యీాయన కల్పనా రామణీయకత వెలుగు చూసింది. యీాయన కలగన్నాడు. యీాయన భావనా విహంగాలు యీాయన్ని మోసుకుపోయిన నేలకి "గ్రీన్‌లేండ్" అని పేరు కూడా వచ్చింది.

ఆ "గ్రీన్‌లేండ్" "ఆశాచంద్రశాలలో కాలం కరిగి వెన్నెల" అవుతుంది. ఆయన పాత్రలు జీవిత పూర్ణత్వంతో వుంటాయి. స్వప్నాలూ సాహసం కలిసిపోయి వుంటాయి. భవిష్యత్తు మీద అనంతమైన ఆశని రేకెత్తిస్తాయి. 1920లో శైశవ సోవియట్ రిపబ్లిక్‌ని కష్టాలూ, కన్నీళ్లూ ముంచెత్తుతూ వుంటే, ఆకలితో అలమటిస్తూ, చలికి కొంకర్లు పోతూ వున్న పెట్రోగ్రాడ్ (లెనిన్‌గ్రాడ్)కి ప్రఖ్యాత సోవియట్ సాహిత్య విమర్శకుడు విక్టర్ ష్క్లోవ్‌స్కీ అన్నట్టుగా గ్రీన్ "ఎర తెరచాపలు" "భవిష్యత్తుమీద బ్రహ్మాండమైన ఆశని రేకెత్తిస్తూ" వెలువడింది.

అలా కలలుగనడం యీాదార్థ్యంతో స్పర్థించడం అవదా అని శంకలు కలగవచ్చు, భయం తోచవచ్చు. నిజమే, యీా ప్రశ్నకి జవాబు కలలుగనే తీరుమీద వుంటుంది. వాస్తవంతో పొంతన చెందే కలలు కమ్మని కలలు. "కార్మిక స్వర్గాన్ని కలగన్న రష్యా" అని మహాకవి అనలేదా? అంచేత "కలని నిజపరచడం కాదు కవిత్వం, నిజాన్ని కలగనడం దాని తత్వం." నిజాన్ని కలగనేదంతా ఆశావహమైందే. వాస్తవానికి మనం అలాంటి దాన్ని నేర్వగలిగి వుండాలి. "గ్రీన్‌లేండ్" సుదూర ద్వీపాల్లోని ధవళకుడ్య సౌధాలున్న నగరాలు పచ్చటి లోయల్లోనూ, సూర్య కాంతితో వెలిగిపోయే మహాసముద్ర తీరంలోనూ వుంటాయి. కాని యీా కాల్పనిక లోకంలోని కాల్పనిక వ్యక్తులు వాస్తవ ప్రపంచపు అనుభూతులతోటే, కోరికలతోటే ప్రేరితులవుతారు. మహత్తర మానవీయత, ప్రేమ, మానవ సహజసిద్ధమైన మంచితనం, మానవుడికి గల సాహసం, శక్తి యీా పాత్రలకి జీవధాతువు.

"నాన్నా, మనమంటే వాళ్లకెందుకు యిష్టం లేదు? చెప్పవూ?"

"ఓ, చిట్టితల్లీ, వాళ్లకి యిష్టపడ్డమూ, ప్రేమించడమూ తెలీదు. ఎవళ్లేనా ప్రేమించగలిగి వుండాలి. అది వాళ్లు చెయ్యలేరు."

"గలిగి వుండటమంటే యేమిటి?"

"యిదీ."

అని అతను ఆ పిల్లని పైకి లాక్కుని ఆమె విచారభరిత నేత్రాలని అనురాగంతో చుంబించేవాడు. ఆమె మధురానుభూతితో కళ్లని గట్టిగా మూసుకునేది."

యీా పసి హృదయంతోబాటు మన హృదయమూ పులకరించదూ?

శిలువ మీద క్రీస్తు కాళ్లకీ, చేతులకీ మేకులు దిగబడి రక్తం స్రవించడం చూసిన గ్రే, ఆ బొమ్మకి రంగు పులిమేస్తే, మహా చిత్రకారుడి బొమ్మని పాడు చేశావేమని తండ్రి అడిగినప్పుడు:

"నాకు లెక్క లేదు, ఎవరి చేతుల్లోనూ మేకులు దిగబడ్డం రక్తం కారడం నేను సహించను, అలా వుండనివ్వను."

అని చెప్పిన సమాధానంలో మహత్తర మానవ ఆదర్శం గోచరించడం లేదూ?

"మనసు ఒక పారిజాత వృక్షంమీద ఆశ నిలుపుకుంటే, ఒక అద్భుతంమీద ఆశ పెట్టుకుంటే యీా అద్భుతాన్ని నిజ పరచు చెయ్యగలిగితే" అని కోరడంలో మానవ ప్రయత్నానికి ప్రేరణ యివ్వడం ద్యోతకం కాదూ?

గ్రీన్ కల అలాంటిది. గ్రీన్ తపన అలాంటిది. గ్రీన్ శైలి అలాంటిది.

గ్రీన్ కథల్లో అద్భుతమైన వూహా విహారం వుంది. యిక్కడ సామాన్య చింతనా ధోరణికి అందే వివరాలుండవు. మానవ హృదయ కవాటాన్ని తెరిచే విసురే యిక్కడ కనిపిస్తుంది. సముద్రంలో ఉవ్వెత్తుగా లేచే తరంగం హోరున ముంచేస్తూ తోసుకు వస్తూవుంటే కింద యేం వున్నదీ కనిపించదు. కెరటం వెనక్కి తగ్గుతూ

వున్నప్పుడు కనిపిస్తాయి, కింద మిలమిల మెరిసే యిసక, తళతళలాడే గులక రాళ్ళూనూ. గ్రిన్ కలం "సంవర్త ఝంఝలాగ ప్రభంజించుతూ" పోతూ వుంటే కర్త, కర్మ, క్రియలాంటి వాక్య నిర్మాణ విశేషం లాగా కథా సన్నివేశాల్ని అవగతం చేసుకునే స్థూల దృష్టికి దీప్తమానమైన మానవ హృదయం తటుక్కున స్ఫురించదు. ఒక్క క్షణం వూపిరి పీల్చుకుని నిలుస్తే ఆశ్వాసిస్తాయి మానవ మధురిమలు.

గ్రిన్ అత్యద్భుత ప్రకృతి దృశ్య చిత్రకారుడు. సూక్ష్మ మానసిక విశ్లేషణవేత్త. సామాన్య జీవితానికి అవతల వున్న కవితాత్మక పార్శ్వాన్ని వెల్లడించగల నిపుణుడు. మానవుడిమీద విశ్వాసం వుండి, యీ విశ్వంలో మంచి హసించడం శక్తివంతులైన, పరిశుద్ధులైన వాళ్ళమీద ఆధారపడి వుంటుందని నమ్మిన వాడు.

గ్రిన్ స్వాప్నికుడు, సాహసి. యీ రెండు లక్షణాలూ యువత మీద ప్రభుత నిర్వహిస్తూ వుంటాయి కాబట్టి మరి సహజంగానే గ్రిన్ యువ పాఠకులకి సమ్మోహకంగా వుంటాడు. యువకులకే కాక గ్రిన్ యిప్పుడు అందరికీ మాన్యుడైన రచయితే. "గ్రిన్ నాకు సాహసాన్నీ, జీవిత ఆనందాన్నీ నేర్పాడు" అని సోవియట్ కవి ఎడ్వర్డ్ బగ్రీట్‌స్కీ అన్నాడు. అలా అని యింకా యెంత మందో అనగలిగే వుంటారు.

గ్రిన్ దాదాపు నాలుగు వందల కథలు రాశాడు. "ఎర్ర తెరచాపల"ని 1942 లో బాలేగా రూపొందించారు. 1961లో ఫిల్ము తీశారు. "అలెగ్జాండర్ గ్రిన్ సాహిత్య స్మారక మ్యూజియం"ని ఫెయొదోసియాలో 1970లో నెలకొల్పారు.

యీ శతాబ్దపు యిరవైయవ దశకందాకా ఆయన ప్రధానంగా పెత్రోగ్రాడ్‌లోనే వున్నాడు. అక్కడనే ఆయన కథలు పత్రికల్లో ప్రచురితమయ్యాయి. తర్వాత ఆయనా, ఆయన భార్య నీనా నికొలాయెవ్నా క్రైమియాకి వెళ్ళారు. మొదట ఫెయొదోసియాలోనూ, తర్వాత స్తారీక్రిమ్‌లోనూ వున్నారు. గ్రిన్ స్తారీక్రిమ్‌లోనే 1932 జూలైలో కాన్సర్ వల్ల మరణించాడు.

రష్యన్ సాహిత్యానికి ఒక వారసత్వం నిలిచింది.

తిలక్ చెప్పినట్టు

"ఆగామి ఆశల వర్షాగగనంమీద ఆదిగో ఆనందం
అనే యింద్రధనుస్సు
అలమటించే లోకానికి అండగా నిలుస్తుంది
నవకవి వచస్సుధా సుమనస్సు."

మాస్కో
ఆగస్టు 1983

ఆర్వియార్

# ఎర్ర తెరచాపలు

## అద్భుత కల్పన

నీనా నికొలాయెవ్నా గ్రిన్‌కి

బహుమానం, అంకితం

రచయిత

నవంబరు 22, 1922, పెట్రోగ్రాడ్

# జోస్యం

లాంగ్‌రెన్ చివరికి సముద్ర జీవితాన్ని వదులుకోవాల్సి వచ్చింది. అతను ''ఓరియన్'' నౌకమీద నావికుడు. అది మోటుగా వుండే మూడు వందల టన్నుల, రెండు కొయ్యల నౌక. దానిమీద అతను పదేళ్లు పని చేశాడు, కొంతమంది పిల్లలు తమ తల్లులకి అంటిపెట్టుకుని పోయే దానికంటే యెక్కువగా అతను దానికి అంటిపెట్టుకు పోయాడు. అలాంటి జీవితాన్ని అతను వదులుకోవాల్సి వచ్చింది.

అందుకు పరిస్థితి యిలా వచ్చింది. అరుదుగా యింటికి వచ్చే అతనికి ఒకసారి, అలవాటుగా గుమ్మంలో నుంచుని, చేతులు చాచి అతనికేసి ఊపిరి బిగబట్టి పరిగెత్తుకుని వచ్చే అతని భార్య మేరీ దూరంనుంచి కనిపించలేదు. దానికి బదులుగా తన చిన్న యింట్లో కలవరపడ్డ పొరుగింటావిడ ఉయ్యాలా పక్కన కనిపించింది. అది కొత్తగా వచ్చిన సామాను.

''మూణ్ణెల్లు దీన్ని సాకాను, బాబూ'' అందావిడ. ''యిదిగో నీ బిడ్డ.''

వంగి, యెనిమిది వెల్ల పసిగుడ్డు తీక్ష్ణంగా తన గడ్డం కేసే పరకాయించడం చూసాడు. దుఃఖంతోటి లాంగ్‌రెన్ గుండె మొద్దుబారిపోయింది. అప్పుడతను కూచుని, నేల కేసి చూస్తూ మీసం మెలి తిప్పుకోవడం మొదలుపెట్టాడు. వానలో తడిసినట్టుగా అది తడిసిపోయింది.

''ఆమె యెప్పుడు పోయింది?'' అని అతను అడిగాడు.

ఆమె, మధ్యమధ్యన పిల్లకేసి చూసి లాలనగా ''చీ, చీ'' అంటూ, మేరీ స్వర్గానికే పోయి వుంటుందని అతనికి ధైర్యం చెప్తూ, ఆ విషాద గాథని వర్ణించింది. వివరాలు తెలుసుకున్నాక లాంగ్‌రెన్‌కి స్వర్గం తన కొయ్య కొంపకంటే మెరుగైందిగా కనిపించలేదు. తాము ముగ్గురూ కూర్చుని వుంటే ఆ సాదా దీపపు వెలుతురే అజ్ఞాత ప్రపంచానికి వెళ్లిపోయిన ఆ ఆడమనిషికి అవధిలేని ఆనందాన్ని యిచ్చి వుండేదని అతనికి అనిపించింది.

అంతకు ముందు మూడు నెలల్రకితం ఆ బాలెంతరాలి దగ్గర సొమ్ము నిండుకుంది. లాంగ్‌రెన్ ఆమెకిచ్చిన డబ్బులో కనీసం సగం, కష్టమైన కాన్పు సందర్భంగా డాక్టర్లకీ, ఆ పసిగుడ్డుని సాకడానికీ అయిపోయింది. కొంచెమే అయినా జీవనాధారం అయిన సొమ్ము నిండుకునేటప్పటికి మేరీ అప్పుకోసం మెన్నెర్స్‌ని ప్రాధేయపడాల్సి వచ్చింది. మెన్నెర్స్ అంగడీ, సారా దుకాణమూ నడిపేవాడు. వున్న వాడని అనుకొనేవాళ్లు.

మేరీ అతని దగ్గరికి సాయంత్రం ఆరు గంటలకి వెళ్లింది. పొరుగింటావిడ ఆమెని లిస్‌కి పోయే దారిలో కలుసుకునేటప్పటికి దగ్గరదగ్గర యేడు గంటలైంది. మేరీ యేడుస్తోంది, చాలా బెంబేలు పడిపోయి వుంది. తన పెళ్లి ఉంగరాన్ని తాకట్టు పెట్టడానికి పట్టణానికి వెడుతున్నానని అంది. మెన్నెర్స్ తనకి కొంత సొమ్ము అప్పిస్తానన్నాడనీ, కాని తనని కోరాడనీ చెప్పింది. తను అతన్ని కాదంది.

''యింట్లో ఒక్క గింజ లేదు'' అందామె పొరుగావిడతో. ''నేను బస్తీకి వెళ్లొస్తాను. మా ఆయన తిరిగి వచ్చే దాకా యెలాగో కాలక్షేపం చేసేస్తాం.''

ఆ సాయంత్రం చలిగా వుంది, యీదురు గాలిగా వుంది. చీకటి పడేటప్పుడు లిస్‌కి వెళ్లవద్దని పొరుగావిడ

 యెంతో చెప్పినా ప్రయోజనం లేకపోయింది. ''యిదిగో మేరీ, తడిసి పోతావ్. వాన కురిసేటట్టుగా వుంది. గాలి చూస్తే తుఫాను వచ్చేటట్టుగా వుంది'' అని పొరుగావిడ అంది.

సముద్రం ఒడ్డున వున్న ఆ వూరినుంచి బస్తీకి కనీసం మూడు గంటలు చురుకైన నడక, కాని మేరీ పొరుగావిడ చెప్పిన మాట వినలేదు. ''యిక మీకెవళ్లకీ కష్టం కలిగించ దలచుకోలేదు. యిప్పటికి నేను యేదో ఒకటి అప్పు తేకుండా వున్న యిల్లు ఒక్కటీ లేదు. నా ఉంగరం తాకట్టు పెట్టేస్తాను, సరిపోతుంది'' అందామె. ఆమె బస్తీకి వెళ్లి వచ్చింది. ఆ మర్నాడు జ్వరంతోటీ, జలుబుతోటీ మంచాన పడింది. పొరుగింటావిడ జాలి తలిచి డాక్టర్ని పిలిచింది. అతను ఆ సాయంత్రం వానా, మంచూ వల్ల తీవ్రమైన న్యూమోనియా ఆమెకి తగిలిందని అన్నాడు. ఓ వారం తర్వాత లాంగ్‌రెన్ పెద్ద మంచం కాళీ అయిపోయింది. ఆ బిడ్డని చూడ్డానికి పొరుగింటావిడ అక్కడ చేరింది. ఆమె వితంతువు. ప్రపంచంలో ఆమెకి ''నా'' అన్న వాళ్లెవ్వరూ లేరు, అంచేత యిది కష్టమైన పని కాదు. ''అదీ కాకుండా, పిల్ల నాకూ కాలక్షేపం'' అందామె.

లాంగ్‌రెన్ పట్టణానికి వెళ్లి ఉద్యోగానికీ మిత్రులకీ సలాం కొట్టేసి, అస్పాల్‌ని పెంచడానికి యింటికి తిరిగి వచ్చాడు. ఆ విధవావిడ ఆ పిల్లకి పెంపుడు తల్లిగా అతని యింటే పిల్లకి నడక బాగా వచ్చే దాకా వుండి పోయింది. కాని అస్పాల్‌కి తనంత తను పడకుండా గడపదాటి అడుగు వెయ్యడం రాగానే యిక అప్పట్నుంచీ తనే ఆ బిడ్డ సంరక్షణ చూడ సంకల్పించానని చాటి, ఆ ఆడమనిషి సాయానికీ, దయకీ కృతజ్ఞతలు చెప్పి, లాంగ్‌రెన్ తన ఆలోచనలు, ఆశలు, అభిమానాలు, స్మృతులు సర్వం ఆ చిన్నపిల్లమీదే లగ్నం చేసి ఒంటరి విధుర జీవితం ఆరంభించాడు.

పదేళ్లు సముద్రాలమీద తిరిగినా అతనికేమీ సంపద పోగు పడలేదు. అతను పని చెయ్యడం మొదలు పెట్టాడు. త్వరలోనే పట్టణంలోని దుకాణాల్లో అతను చేసిన ఆటబొమ్మలు అమ్ముడు పోతున్నాయి. చక్కగా చెక్కిన పడవల, లాంచీల, ఒకటి రెండు డెక్కుల ఓడల, పెద్ద ఓడల, ఆవిరి ఓడల నమూనా బొమ్మలన్నీ. అతనికి అది అంత బాగా తెలుసు. ఆటవస్తువులకి సంబంధించి అంతే కాబట్టి, సముద్ర జీవితంలోని ఉరుకులు పరుగులకీ, సాహసానికీ అలవాటు పడిన అతనికి ఒక మేరకి అవి భర్తీ చేశాయి. యీ రకంగా లాంగ్‌రెన్ సుఖంగా బతకడానికి చాలినంత సంపాదించాడు. అతను అంత కలివిడిగా వుండే మనిషి కాదు, కాని యిప్పుడు భార్య పోయింతర్వాత ఒక రకమైన ఒంటరిగాడైపోయాడు. అప్పుడప్పుడు పండగ రోజున సారాకొట్టు దగ్గర కనిపించే వాడు. కాని యెవరితోటీ కలిసేవాడు కాదు. అక్కడ ఓ గ్లాసు వోడ్కా తాగి, ముక్తసరిగా ''అవును,'' ''వుహుఁ,'' ''హల్లో,'' ''సెలవు'' లాంటి మాటలనే తనని పలకరించిన వాళ్లకి జవాబుగా చెప్పి వెళ్లిపోయేవాడు. ఎవళ్లేనా చూడ్డానికి వస్తే అతనికి సరిపడేది కాదు, బలవంతంగా కాకపోయినా గట్టిగానే, సూచనలు చేసీ సాకులు చెప్పీ వాళ్లని వదిలించుకునేవాడు. వాళ్లకేనా యిక చేసేదేమీ లేక అక్కడ వుండడానికి కుదరని పనేదో తమకి వుందని కల్పించి చెప్పాల్సి వచ్చేది. అతను తనకిగా యెవర్నీ చూడ్డానికి వెళ్లేవాడు కాదు. ఆ రకంగా అతనికీ అతనితోటి గ్రామస్థులకీ మధ్య ముభావపు యెడబాటు గోడ లేచింది. లాంగ్‌రెన్ పని, అతను చేసిన ఆటవస్తువులు యే రూపంలోనేనా గ్రామ వ్యవహారాలమీద ఆధారపడి వుంటే అలాంటి సంబంధాల ఫలితాలని అతను అనుభ వించి వుండేవాడు. అతను తన సామాన్లూ, పచారీ వస్తువులూ, అన్నీ బస్తీలోనే కొనేవాడు. లాంగ్‌రెన్‌కి తను ఒక అగ్గిపెట్టేనా అమ్మానని గొప్ప చెప్పకోడానికి లేకపోయింది మెన్నెర్స్‌కి. లాంగ్‌రెన్ ఓపిగ్గా యింటి పని అంతా చేసుకొనేవాడు. మగాళ్లకి అలవాటు వుండనే వుండని కష్టమైన పని, ఆడపిల్లని పెంచడం అనేదాన్ని, ఓర్పుగా నేర్చుకున్నాడు.

అస్పాల్‌కిప్పుడు అయిదో యేడు. ఆమె యిప్పుడు తన ఒళ్లో కూచుని బొత్తం పెట్టుకున్న తన లోపలి కోటు వింతకో, తను నావికుల లల్లాయి లుల్లాయి పదాలు పాడిన దానికో గజిబిజి అయిపోయి వుంటే ఆమె

సున్నిత, దయాన్విత వదనం కేసి చూస్తూ యింకా యెక్కువ మృదువుగా చిరునవ్వు నవ్వేవాడు ఆ తండ్రి. అక్కడా అక్కడా ముద్ద మాటలతోటి చిన్నపిల్ల ఆ పదాలు పాడితే, పాలిప నీలం రిబ్బను మెడ చుట్టూ కట్టుకుని నాట్యం చేసే యెలుగుబంటి గుర్తుకొచ్చేది యెవళ్లకేనా. ఆ సమయంలో ఒకటి జరిగింది. అది తండ్రిమీద నీడని పరుస్తూ, కూతుర్నీ కమ్మేసింది.

అది వసంతం. వసంతపు తొలి భాగం శీతాకాలం లాగానే కటువైంది, కాని దానిలా లేనిది. ఉత్తర తీరపు యెముకలు కొరికే గాలి మూడు వారాలు చలితో వణికే నేలని వూపేసింది.

చేపలు పట్టే పడవలు, ఒడ్డుకి లాగేసి నల్లని చుక్కానీల బారుగా ఒక శ్రేణి యేర్పడింది. అవి ఆ తెల్లని యిసకమీద యేదో విపరీతమైన చేప వీపుల్లా వున్నాయి. అలాంటి వాతావరణంలో యెవళ్లూ సముద్రం మీదకి వెళ్లే సాహసం చెయ్యలేకపోయారు. ఆ వూరి ఒక్క వీధీ నిర్మానుష్యమైపోయింది. తీరపు కొండలమీద నుంచి సుడిగాలి శూన్య దిఙ్మండలాన్ని దూసుకువచ్చి ఆరు బయలుని దుర్భర హింసాత్మకం చేసింది. కపేర్నా గ్రామపు యిళ్ల పొగగొట్టాలు ముప్పొద్దులా పొగలు చిమ్ముతూ, నిట్టపాటి కప్పులమీద ఆ పొగని వూపుతూనే వున్నాయి.

ఏమైనా తేటగా వున్న రోజున కపేర్నామీదా, సముద్రంమీదా బంగారు జరీ గొప్పెన కప్పే యెండ రోజుకంటే, యీ భయంకర ఉత్తరపు గాలి లాంగ్‌రెన్‌ని యింట్లోనుంచి యింకా యెక్కువగా బయటికి వచ్చేటట్టు ఆకర్షించింది. లాంగ్‌రెన్ సముద్రం ఒడ్డున కొయ్యకట్ట చివరకంటా పోయేవాడు. గాలి పొగని యెగరేసుకుపోతూ వుంటే చాలా సేపు పైపు కాలుస్తూ వుండేవాడు. "అలలు కదిసి మరలి చనగ" ఆ దొర్లుకుంటూ పోయే అలలతో వెనక్కి పోలేక వెలిబూది ఫేనంతో నిండి, నురగలు కక్కుతూ వెల్లడి అయిన సైకత స్థలాన్నీ, నల్లని కల్లోలిత దిఙ్మండలం కేసి అలల గర్జాఘోషోన్మిక గమనం, భయంకర, దీర్ఘకేశ భూయిష్ట భూతసంచయం తమ సుదూర స్వాస్థ్యగమ్యానికి పరమ విశృంఖల రీతిలో దౌడు తీస్తూ ఆ శూన్యాన్ని ఆవరింపచెయ్యడాన్నీ పరికిస్తూ వుండి పోయేవాడు. ఆ మౌనరోదనా, అలజడీ, తిరిగి తిరిగి ప్రళయ నాట్యం చేస్తూ వున్న ఆ జలధి తరంగ మృదంగ రావం, ఆ సమీప ప్రాంతాన్ని తాడనం చేస్తూ వున్నట్టు కనిపించే వాయువు దృశ్యమాన ప్రసరణ — అడ్డులేని దాని గతి అంత తీవ్రంగా వుంది — లాంగ్‌రెన్ వ్యధిత హృదయంమీద మాంద్య, బధిరపూరిత అనుభూతిని కలిగించాయి. విచారాన్ని మాటలకందని దుఃఖంగా మార్చి, ఫలితంలో, అది గాఢ సుషుప్తి సమమైందిగా తయారైంది.

అలాంటి ఒక రోజున మెన్నెర్స్ పన్నెండేళ్ల కొడుకు హిన్ వచ్చాడు అక్కడికి. తన తండ్రి పడవ కొయ్య కట్టకింద దుంగలకేసి గుద్దుకొంటోందనీ, దాని పక్కలు విడగొట్టుకుపోతున్నాయనీ చూసి తండ్రికి చెప్ప డానికి వెళ్లిపోయాడు. తుఫాను అంతకు ముందే మొదలైంది. మెన్నెర్స్ తన పడవని యిసక ఒడ్డుమీదకి లాగడం మరిచిపోయాడు. అతను హడావుడిగా తీరానికి వచ్చాడు. అక్కడ లాంగ్‌రెన్ కొయ్యకట్ట చివర పైపు కాలుస్తూ, వీపు వెనక్కి పెట్టి, నుంచుని వుండటం అతనికి కనిపించింది. కనుచూపు మేరలో మరో పిట్టలేదు. మెన్నెర్స్ కొయ్యకట్టమీద సగం దూరం వెళ్లి, విపరీతంగా యెగిసిపడే నీళ్లల్లోకి దిగి, తన పడవ కట్టుతాడు విప్పాడు. అప్పుడు దానిమీద నిటారుగా నిలబడి, గుంజ తర్వాత గుంజని ఆసరాగా పట్టుకుని తోసుకుంటూ అతను ఒడ్డుకి రావడం మొదలుపెట్టాడు. అతను తెడ్లని తెచ్చుకోవడం మరిచిపోయాడు. అతను తొట్రుపడి, తర్వాతి గుంజని అందుకోలేకపోవడంతోటే, వడిగా గాలి దెబ్బ అతని పడవ ముందరి తట్టుని కొయ్యకట్టనుంచి దూరంగా సముద్రంకేసి యీడ్చేసింది. యిప్పుడుమనిషి పొంతం వంగినా మెన్నెర్స్ దగ్గరి గుంజని కూడా అందుకో గలిగి వుండేవాడు కాదు. ఆ గాలీ, అలలూ పడవని వూపేస్తూ దాన్ని దూరానికీ, దుర్గతికీ యీడ్చుకుపోతు న్నాయి. మెన్నెర్స్ తన దుర్దశని గుర్తించాడు. నీళ్లల్లోకి దూకి, ఒడ్డుకు యీదుకు పోదామనుకున్నాడు.

 కాని ఆ నిర్ణయానికి కూడా వ్యవధి మించిపోయింది, యేమంటే పడవ అప్పటికే కొయ్యకట్ట చివర మళ్ళ తిరుగుతోంది, అక్కడున్న లోతూ, యెగిరి యెగిరి పడే అలలూ ఆసన్న మృత్యువుని సూచిస్తున్నాయి. నీళ్ళల్లో కొట్టుకుపోతూ వున్న మెన్నెర్స్‌కీ, లాంగ్‌రెన్‌కీ మధ్యన యిరవై మీటర్ల దూరం మాత్రమే వుంది, యింకా రక్షణకి అవకాశం వుంది, యేమంటే చుట్టచుట్టిన తాడు ఒకటి, చివర బరువైన గుండుతోటి, కొయ్యకట్టమీద లాంగ్‌రెన్ పక్కనే వుంది. యే తుఫానులోనేనా యేదేనా పడవ తీరం చేరడానికి విసిరి అందివ్వడంకోసం ఆ తాటిని అక్కడ వుంచారు.

''లాంగ్‌రెన్!'' మెన్నెర్స్ భయంతో కంపించిపోయి అరిచాడు. ''అక్కడ వూరికే నుంచో వద్దు! కని పించడం లేదూ నేను కొట్టుకుపోతున్నాను. ఆ తాడు యిలా విసురు'' అన్నాడు.

లాంగ్‌రెన్ యేమీ మాట్లాడలేదు, ఆ భయకంపితుడైన మనిషికేసి చూస్తూ. అతను యింకా గట్టిగా పైపు పీలుస్తూ వున్నా, యేం జరుగుతోందో చూడ్డానికని అప్పుడు పైపుని నోట్లోనుంచి తీశాడు.

''లాంగ్‌రెన్!'' మెన్నెర్స్ అర్థించాడు. ''నేను చెప్పేది నీకు వినిపిస్తోందని నాకు తెలుసు. నేను మునిగి పోతున్నాను! నన్ను రక్షించు!''

కాని లాంగ్‌రెన్ ఒక్క మాట అనలేదు. ఆ ఉన్మత్త రోదనని అతను విననట్టే వున్నాడు. ఆ పడవ బాగా సముద్రం లోపలికంటా పోయి, మెన్నెర్స్ అరిచే అరుపులు వినపడకుండా పోయేదాకా లాంగ్‌రెన్ పక్కకి ఒరిగిన శరీరపు బరువుని మార్చుకోను కూడా లేదు. మెన్నెర్స్ భయంతో వెక్కివెక్కి యేడ్చాడు, సహాయార్థం మత్స్యకారుల కోసం పరిగెత్తి వెళ్ళమని ఆ నావికుణ్ణి అర్థించాడు. అతనికి బహుమతి యిస్తానన్నాడు, బెదిరించాడు, శపించాడు. కాని గెంతుకుంటూ, సుళ్ళు తిరుగుతూ పోయే ఆ పడవ అప్పుడే కనిపించకుండా పోతుందేమోనని కొయ్యకట్ట చివరికంటా నడిచి వెళ్ళడమే లాంగ్‌రెన్ చేసిన పని అల్లా.

''లాంగ్‌రెన్, నన్ను రక్షించు!'' అనే మాటలు యెక్కణ్ణో నూతి అడుగునుండి పైనున్న వాడికి చేరే మాటల్లా అతన్ని చేరాయి.

అప్పుడు గాలి గట్టిగా పీల్చి, ఉగ్గబట్టుకుని, ఒక్క మాట కూడా గాలిలో వినిపించకుండా పోకూడదని లాంగ్‌రెన్ అరిచాడు: ''ఆమె అలాగే నిన్ను ప్రాధేయపడింది! యింకా బతికుండగానే ఆ విషయం గురించి అనుకో, మెన్నెర్స్, మర్చిపోకు!''

అప్పుడు అరుపులు ఆగిపోయాయి. లాంగ్‌రెన్ యింటికి వెళ్ళిపోయాడు. గుడ్డిగా వెలిగే దీపం వెలుతుర్లో ఆలోచనా మగ్నుడై వున్న తండ్రిని చూసింది మెలుకువ వచ్చిన అస్సోల్. పిల్ల తనని పిలవడం విని, అతను ఆమె దగ్గరికి వెళ్ళి ప్రేమగా ముద్దుపెట్టుకుని, జారిపోయిన దుప్పటీ సరిగా కప్పాడు.

''నిద్రపో, అమ్మా. యింకా తెల్లారడానికి చాలా పొద్దుంది'' అన్నాడు.

''నువ్వేం చేస్తున్నావు?''

''నేనో నల్ల బొమ్మని తయారుచేశాను, అస్సోల్. యిక, నిద్రపో.''

ఆ మర్నాడు వూరంతా మెన్నెర్స్ కనిపించకుండా పోయిన వార్తతోటి గుప్పుమంది. అయిదు రోజుల తర్వాత అతన్ని తీసుకువచ్చారు. మరణిస్తూ, కసితో నిండిపోయి వున్నాడు. అతని కథ త్వరలోనే చుట్టు పక్కల అన్ని వూళ్ళకీ పాకింది. మెన్నెర్స్ సాయంత్రందాకా సముద్రం పైన కనిపించాడు. విరుచుకు పడే అలలతోటి జరిగిన భయంకర యుద్ధంలో పడవ పక్క భాగాలూ, అడుగూ అతన్ని మోదేశాయి. అలలు ఉన్మత్త ప్రళ్ళ దుణ్ణి సముద్రంలోకి క్షణక్షణం దొర్లించే భయద వాతావరణం అప్పుడు వుండింది. కస్సెట్‌కేసి వస్తూ వుండే ''లుక్రేషియా'' నౌక అతన్ని పైకి తీసింది. శైత్యజ్వర పీడితుడుగావడమూ, పీడకలని అనుభవించడమూ మెన్నెర్స్ అంతాన్ని సూచించాయి. భూమిమీద తెలిసినవి, తన వూహల్లో వున్నవీ అన్ని రకాల తిట్లనీ శాపనా

ర్థాలనీ లాంగ్‌రెన్‌మీద కుమ్మరిస్తూ అతను నిండా నలభై ఎనిమిది గంటలు కూడా బతకలేదు. తన దుర్దశని చూస్తూ, సహాయం చెయ్యకుండా పోయిన ఆ నావికుణ్ణి గురించి మెస్నెర్స్ చెప్పిన వృత్తాంతం, ఆ మరణోన్ముఖుడైన మానవుడు నిండా వూపిరి పీల్చలేక మూలుగుతూ చెప్పడంతోటి యింకా విశ్వసనీయమై కపేర్నా వాసుల్ని దిగ్భ్రాంతుల్ని చేసింది. లాంగ్‌రెన్ భరించవలసి వచ్చిన అవమానం కంటే యెక్కువైందిగాని, లేదా తన జీవితాంతం మేరీకోసం అతను దుఃఖించేలాంటి దుఃఖంగాని వాళ్లల్లో ఒక్కళ్ళూ మనసున పెట్టుకోరన్న విషయం అలా వుంచితే — వాళ్ళు లాంగ్‌రెన్ మూకీభావంతోటి అసహ్యపడి, కలవరపడి, నిర్ఘాంతపడి పోయారు. లాంగ్‌రెన్ మెస్నెర్స్‌ని ఉద్దేశించి తను ఆఖరిగా ఆ మాటలు అరిచేదాకా, అక్కడ మూకీభావంతోనే నుంచుండి పోయాడు. అతను అక్కడ కదలకుండా కటువుగా, నిశ్శబ్దంగా మెస్నెర్స్‌పట్ల తన పరమ విద్వేషాన్ని వ్యక్తంచేస్తూ వుండే న్యాయనిర్ణేత లాగా నుంచుండి పోయాడు — అతని మూకీభావంలో విద్వేషం కంటే తీవ్రమైంది చాలా యెక్కువ వుంది, దాన్ని అందరూ గుర్తించారు. అతను అరిచి వుంటే, తన దుర్బుద్ధి పూర్వకమైన సంతోషాన్ని హావభావాల్లోనూ, గడబిడలోనూ వ్యక్తంచేసి వుంటే, లేదా మెస్నెర్స్ నిస్సహాయస్థితి దృశ్యంపట్ల తన విజయాన్ని వేరే యే రకంగానేవా ప్రదర్శించి వుంటే ఆ బెస్తవాళ్ళు అతన్ని అర్థం చేసుకొని వుండేవాళ్ళు. కాని అతను వాళ్ళు చేసే దానికంటే భిన్నంగా ప్రవర్తించాడు — అతను మనసుకు నాటుకొనేటట్టుగా, వింతగా ప్రవర్తించాడు, ఆ రకంగా తమకంటే అధిక స్థానంలోకి తను పోయాడు — ఒక్క ముక్కలో అతను క్షమించరానిది చేశాడు. యిక యెవ్వరూ కూడా అతనికి వీధిలో నమస్కారం పెట్టలేదు, కరచాలనం చెయ్యలేదు, లేదా దారిలో స్నేహపూర్వకంగా చూడ్డంగాని, పలకరించడంగాని చెయ్యలేదు. అప్పటినుంచి, చివరి దాకా అతను గ్రామ వ్యవహారాలకి సంబంధించి దూరంగా వుండిన వాడు అయిపోయాడు. దారిలో అతన్ని చూసిన పిల్లలు "లాంగ్‌రెన్ మెస్నెర్స్‌ని ముంచేశాడు" అని అరిచేవాళ్ళు. అతను పట్టించుకునేవాడు కాదు. అలాగే సారా దుకాణంలో గాని, తీరం దగ్గర పడవల మధ్యలో బెస్తవాళ్ళుగాని అతని ముందు మాట్లాడుకోవడం మానేసి, యేదో కుష్ఠు రోగిని చూసినట్టు తప్పించుకుపోవడం అతను గమనించినట్టు లేదు. అంతకు పూర్వం పాక్షికంగా వున్న యెడబాటు యీ మెస్నెర్స్ గొడవతో బలపడింది. అది పరిపూర్తి అయి, అచలమైన పరస్పర విద్వేషాన్ని సృష్టించింది. దాని నీడ అస్సోల్‌మీద కూడా పడింది.

ఆ చిన్నపిల్ల స్నేహితులు లేకుండానే పెరిగింది. నీళ్లని పీల్చుకుని స్పాంజ్ ముద్ద అయినట్టుగా తల్లిదండ్రుల తిరుగులేని అధికారం పునాదిగా, కుటుంబ పెత్తనపు ముతక నియమాలతో వుండే ఆ గ్రామంలో ఆ పిల్ల యీడున్న రెండు మూడు డజన్లమంది పిల్లలూ, ప్రపంచంలోని పిల్లలందరి లాగానే అనుకరణ పూర్వకంగా వుండి, అస్సోల్‌ని తమ రక్షణ, ఆసక్తుల పరిధినుంచి చిరస్థాయిగా బహిష్కరించేశారు. సహజంగానే యీ పరిస్థితి పెద్దలు కూకలెయ్యడంతోటే, నిందించడంతోటే క్రమేపీ వచ్చింది. ఉబుసుపోక అనుకునే మాటలద్వారా, పుకార్లద్వారా పెరిగిపోయి ఒక సాంఘికమైన వెలి రూపం ధరించి, ఆ నావికుడి యిల్లు అంటే భయం పుట్టేటట్టు పిల్లల మనసుల్లో పిలకలు వేసింది.

దీనికి తోడు యిప్పుడు లాంగ్‌రెన్ గడిపే యేకాంత జీవితం నరంలేని నాలుకల వదరుబోతుతనానికి పని కల్పించింది. ఆ నావికుడు యెక్కడో యెవణ్నో హత్యచేశాడనీ, తత్కారణంగా అతనికి యే ఓడమీదా యెవరూ ఉద్యోగం యివ్వలేదనీ, అతను అంత వ్యాకులంగా, యేకాకిగా వుంటున్నాడంటే "నేరస్థుడి అంతరాత్మక్షోభ" వల్లనేననీ అనడం మొదలుపెట్టారు. ఆడుకొనేటప్పుడు అస్సోల్ దగ్గరికొస్తే పిల్లలు ఆమెని తరిమేసేవాళ్ళు, ఆమెమీద బురద చల్లేవాళ్ళు, మీ నాన్న మనిషి మాంసం తిన్నాడనీ, మోసగాడనీ ఉడికించేవాళ్ళు. వాళ్ళతో స్నేహం చెయ్యాలని ఒకటి తర్వాత ఒకటిగా ఆ పిల్ల చేసిన ప్రయత్నాలన్నీ చేదుకన్నీళ్లల్లో,

 గాయాలల్లో, బరుకులలో తదితరమైన ప్రజాభిప్రాయ ప్రకటనల్లో అంతమయ్యాయి. ఆమె ఆఖరికి అవ మానపడ్డం మానుకుంది. కాని అప్పుడప్పుడు తండ్రిని యింకా అడుగుతూ వుండేది:

"నాన్నా, మనమంటే వాళ్ళకెందుకు యిష్టం లేదు? చెప్పవూ?"

"ఓ, చిట్టితల్లీ, వాళ్ళకి యిష్టపడ్డమూ, ప్రేమించడమూ తెలీదు. ఎవళ్ళేనా ప్రేమించగలిగి వుండాలి. అది వాళ్ళు చెయ్యలేరు."

"'గలిగి వుండటమంటే' యేమిటి?"

"యిదీ!"

అని అతను ఆ పిల్లని పైకి లాక్కుని ఆమె విచారభరిత నేత్రాలని అనురాగంతో చుంబించేవాడు. ఆమె మధురానుభూతితో కళ్ళని గట్టిగా మూసుకునేది.

అస్సోల్‌కి సరదా అయిన కాలక్షేపం యే సాయంత్రం వేళో, పండగ రోజునో తండ్రి ఒళ్ళో యెక్కి కూర్చోడం. అతను జిగురు సీసాలు పక్కన పెట్టేసి, పనిముట్లనీ అసంపూర్తిగా వున్న పనినీ పెట్టేసి, పని బట్టలు విప్పేసి విశ్రాంతిగా కూర్చుని పళ్ళ మధ్యన పైపు బిగించినప్పుడు అలా చేసేది. తండ్రి హస్తపు అభయ పరిధిలో మెలికలు తిరుగుతూ వంకర్లు పోతూ, ఆమె ఆటబొమ్మల అన్ని భాగాలనీ తడుముతూ వాటి వాటి ఉపయోగం యేమిటీ అని అడిగేది. ఆ రకంగా ఒక చిత్రమైన, విపరీత ఊహాత్మకమైన ఉపన్యాసం ప్రజలను గురించీ జీవితాన్ని గురించీ మొదలయేది. లాంగ్‌రెన్ పూర్వ జీవిత విధానంవల్ల, రకరకాల యాదృచ్ఛిక ఘటనలూ, సామాన్యంగా యదృచ్ఛికతా, వింత, ఆశ్చర్యజనక, అసాధారణ ఘటనలూ ఆ ఉపన్యాసంలో ప్రముఖం అయేవి. లాంగ్‌రెన్ ఆ పిల్లకి రకరకాల తాళ్ళపేర్లూ, తెరచాపల పేర్లూ, ఓడని సన్నద్ధం చెయ్యడమూ చెబుతూ వుంటే మైమరిచిపోయేవాడు. చిన్నచిన్న వివరణలనుంచి అనేక సంఘటనల్లోకి పోయేవాడు. ఓ బరువుని పైకి చేదే యంత్రం, ఓ చుక్కానీ, ఓ కొయ్య లేకపోతే యీ రకందో ఆ రకందో చిన్న పడవ యెలాంటి పాత్ర వహించాయో ఆ చెప్పడంలో వుండేది. యీ విడివిడి చిత్రణలనుంచి అతను నౌకాయానాలకి, ఆ మూఢ నమ్మకాలని వాస్తవంతోనూ, వాస్తవాలని తన ఊహల్లో కల్పించిన బొమ్మలతోనూ అల్లేస్తూ అవధిలేని వర్ణనలు చేస్తూ పోయేవాడు. నౌకాభంగాన్ని సూచించే శకునమైన పులిపిల్లి, యే ప్రమాదం ముంచుకొస్తుందోనవే భయంతోటి యెవరేనా ఒదిగి వుండాల్సిన మాట్లాడే ఎగురుడు చేప, ఓడ రూపపు భూతమూ దాని మందీ మార్బలం, దెయ్యాలు, మత్స్యకన్యలు సముద్రపు దొంగలు — ఒక్క ముక్కలో చెప్పాలంటే నావికుడికి ఖాళీగా వున్నప్పుడో, లేకపోతే యిష్టమైన కల్లు దుకాణంలో పొద్దు పోవడానికో పనికొచ్చే కథలన్నీ యిక్కడ ప్రత్యక్ష మయ్యేవి. నౌకాభంగం చెందిన సిబ్బందిని గురించి, ఆటవికులైన మనుషులని గురించి, మాట్లాడ్డం మరిచి పోయిన వాళ్ళని గురించి, మాయగా భూస్థాపితమైన నిధులని గురించి, బందీల తిరుగుబాట్లు గురించి, యింకా అలాంటి వాటిని గురించి చెప్పేవాడు. తన నూతన ఖండాన్ని గురించి కొలంబస్ చెప్పేటప్పుడు విన్న శ్రోతలకంటే కూడా యెక్కువగా చెవులప్పగించి ఆ చిన్న పిల్ల వాటిని వినేది. లాంగ్‌రెన్ ధ్యాన మగ్నుడై, నిశ్శబ్దంగా అయి పోయినప్పుడు ఆ పిల్ల "యింకా చెప్ప" అని బతిమాలేది. ఆమె బుర్ర చిత్రవిచిత్రమైన వూహలతో నిండి పోయి వుండగా అతని అక్కున అంటిపెట్టుకుని నిద్రపోయేది.

పట్టణంలో లాంగ్‌రెన్ చేసిన దేన్నేనా కొనే ఆటవస్తువుల దుకాణం గుమాస్తా ప్రత్యక్షమవడం ఆ పిల్లకి పెద్ద విందు లాగా, యెంతో పాదార్థిక ప్రాముఖ్యం కలదిగా వుండేది. తండ్రి అభిమానం సంపాదించి మంచి బేరం కుదుర్చుకోవడానికి అనుకూలంగా వుండేందుకని అతను ఓ జత ఆపిల్ పళ్ళో, ఒక బన్‌రొట్టో, ఓ గుప్పెడు వేరుశనగకాయలో ఆ పిల్ల కోసం పట్టుకొచ్చేవాడు. లాంగ్‌రెన్ యే ఆటవస్తువు బొమ్మకేనా గానీ అసలైన ధరే అడిగేవాడు, యెందుకంటే అతనికి బేరమాడ్డం అంటే అసహ్యం, కాని గుమాస్తా ధర

తగ్గించి చెప్పేవాడు. "అయ్యో, దాన్ని చెయ్యడానికి నాకు వారం పట్టింది. (ఆ పడవ తొమ్మిదంగుళాలు పొడుగు వుంది.) చూడండి యెంత దృఢంగా వొప్పుగా వుందో, తేలివుండటానికి అవసరమైన లోతు చూడండి. యింతెందుకు తుఫానులో పదిహేను మంది పడతారు యిందులో" అనేవాడు లాంగ్‌రెన్. ఆఖరికి ఆ చిన్నపిల్ల సన్నగా గొణగడమూ, ఆపిల్ పండుని అటూ యిటూ తిప్పడమూ లాంగ్‌రెన్ నిశ్చయాన్ని, వాదించే కోరికని నీరసపరచేవి. అతను ఒప్పేసుకునేవాడు, ఆ గుమాస్తా బాగా చేసిన, అద్భుతమైన ఆటబొమ్మలని బుట్టనిండా నింపుకుని తన మనసులో వున్నది నెగ్గించుకుని కులాసాగా నవ్వుకుంటూ వెళ్ళిపోయేవాడు.

యింటి పని అంతా లాంగ్‌రెన్ తనే చేసుకునేవాడు. కట్టెలు కొట్టేవాడు, నీళ్ల మోసుకొచ్చేవాడు, పొయ్యి రాజేసేవాడు, వండేవాడు, బట్టలు ఉతికేవాడు, యిస్త్రీ చేసేవాడు వీటన్నిటికీ తోడు సంపాదనకి వ్యవధి చూసుకునేవాడు. అస్సోల్‌కి యెనిమిదేళ్లప్పుడు అతను ఆమెకి చదువనూ రాయనూ నేర్పాడు. ఆమెని అడపా దడపా పట్టణానికి తీసుకెళ్లడం మొదలుపెట్టాడు. కొంతకాలం తర్వాత తను డబ్బు తేవాలన్నా, కొత్త ఆటవస్తువులు అక్కడ అందచెయ్యాలన్నా ఆమెని ఒక్కత్తినీ పంపేవాడు. లిస్స్ కపేర్నాకి నాలుగు మైళ్ల దూరమే వున్నా యిది తరుచుగా జరిగేది కాదు. యేమంటే ఆ దారి అడివి గుండా పోయేది. అడివిలో భౌతికమైన ప్రమాదం వుండేది. పట్టణానికి అంత దగ్గర్లో వుండటంవల్ల ఆ ప్రమాదం అంతగా లేక పోవచ్చును గాని, దృష్టిలో వుంచుకోవాల్సినదే. దానికి తోడుగా చిన్న పిల్లని భయపెట్టేది చాలా వుంటుంది, అందుకనే లాంగ్‌రెన్ ఆమెని వాతావరణం బాగా వుండే రోజుల్లో, ఉదయాలప్పుడు, అడివి దారి అంతా యెండతోటీ, పువ్వుల తోటీ, ప్రశాంతతతోటీ నిండివున్నప్పుడు పంపేవాడు. అప్పుడు, వూహల్లో లేచిన గడును దెయ్యాలు ఆ పసి హృదయంమీద భయముద్రని వెయ్యవని.

అలా బస్తీకి వెళ్లేటప్పుడు ఒకరోజున ఆ పిల్ల దారిలో తను తెచ్చుకున్న బన్‌రొట్టె తిండానికి కూర్చుంది. బన్‌రొట్టె కొరుకుతూ ఒకో ఆటవస్తువే తీసింది. వాటిల్లో రెండు మూడు ఆమెకి కొత్తవి. లాంగ్‌రెన్ వాటిని రాత్రి తయారుచేశాడు. ఆ కొత్త బొమ్మల్లో ఒకటి పందెపు వోడ నమూనా బొమ్మ. ఆ చిన్న తెల్లని ఓడకి సిల్కు ముక్కలతో చేసిన ఎరుపు తెరచాపలున్నాయి. ఆ సిల్కుని లాంగ్‌రెన్ ధనవంతులైన ఖాతాదార్ల కోసం చేసే బొమ్మల్లో ఓడగదుల గోడలను మూయిడానికి వాడేవాడు. యీ చిన్న పందెపు పడవని తయారు చేసింతర్వాత తెరచాపల కోసం అతనికి తగిన గుడ్డ దొరకలేదు. అందుబాటులో వున్న ఎర్ర సిల్కు ముక్కలు కొన్నిటిని వాడాడు. అస్సోల్ మురిసిపోయింది. ఆమె చేతిలో ఆ రగిలే, ఉల్లాసకరమైన రంగు యెంత నిగనిగలాడిందంటే ఆమె నిప్పుని చేత్తో పట్టుకున్నట్టు భావించుకుంది. సెలయేరు ఒకటి రోడ్డుకి అడ్డంగా పోతోంది. మేకులు దిగ్గొట్టిన గుంజల వంతెన ఒకటి అంగవేసినట్టు వారధికడుతోంది. అది కుడివేపునుంచి యెడంవేపుకి అడివిలోకి ప్రవహిస్తోంది. "కాసేపు దీన్ని నీళ్లల్లో పెడితే యిదేం తడిసిపోదు, అప్పుడు మళ్లీ తుడిచేస్తాను" అనుకొంది అస్సోల్. ఆమె అడివిలోకి యేటి దిగువగా వెళ్లి జాగ్రత్తగా తనకి మనస్సైన ఆ పడవని, నీళ్ల అంచున వదిలింది. తేటగా వున్న ఆ నీళ్లల్లో ఎర్రటి తెరచాపలు వెంటనే ప్రతిబింబించాయి. ఆ గుడ్డగుండా ప్రసరించే కాంతి, కింద వున్న తెల్లటి రాళ్లమీద కణకణలాడే ఎర్రటి మెరుపులా మెరిసింది. "ఎక్కడనుంచి వచ్చావు, కేప్టెన్?" అని అస్సోల్ చాలా గంభీరమైన స్వరంతోటి వూహాత్మక వ్యక్తిని అడిగి, తన ప్రశ్నకి తనే సమాధానం చెప్పుకుంటూ "నేను... నేను... వూఁ, చైనానుంచి వచ్చాను" అనుకొంది. "మరి నువ్వు యేమిటి తెచ్చావు?" "అది నేను చెప్పను." "ఓ, చెప్పవన్న మాట కేప్టెన్? సరే, మళ్లీ వెనక్కి బుట్టలోకి పో." కేప్టెన్ నాలిక కరుచుకుని, తను వూరికే ఆమెని ఆట పట్టిస్తున్నాననీ, ఆమెకి సంతోషంగా ఒక యేనుగుని చూపిస్తాననీ అనే లోపునే, ఒడ్డుని తాకిన అల మెత్తగా వెనక్కి పోతూ ఆ పడవ బొమ్మ ముందు భాగాన్ని సెలయేటికేసి లాక్కుంది, నిజమైన నౌకలాగా అది ఒడ్డునుంచి దూరంగా మంచి వేగంతో

 పడితోబాటుగా వెళ్లిపోయింది. ఆమె చుట్టు పక్కల వున్న ప్రతిదాని ప్రమాణం తక్షణం మారిపోయింది: ఆ పిల్లకి సెలయేరు మహా నదిలా కనిపించింది, ఆ పడవ పెద్ద నౌకలా దూరంగా వున్న దానిలా కనిపించింది. దానికేసి ఆమె, దాదాపు నీళ్లల్లో పడిపోతూ మూకభయంతో చేతులు చాచింది. "కెప్టెన్‌కి భయం పుట్టి వుంటుంది" అనుకొంది ఆమె. కను మరుగయ్యే ఆ ఆటబొమ్మ వెనక్కాలే పరిగెత్తింది, యింకా ముందు యెక్కడేనా అది ఒడ్డుకి కొట్టుకు వస్తుందన్న ఆశతో. అలా తొందరగా పోతూ, తేలిగ్గా వున్నా, బొంపలా వున్న బుట్టని మోస్తూ అస్సోల్ అనుకొంది: "అయ్యో! యెలా జరిగింది యిది? యేం ప్రమాదం..." ఎంతో వేగ్గా కొట్టుకుపోతూ వుండే ఆ అందమైన త్రికోణాకారపు తెరచాపలని కనుమరుగై పోకుండా చూసుకుంటూ, ఆమె తొట్రుపడింది, పడింది, మళ్లీ పరిగెత్తింది.

అంతకు ముందెన్నడూ అస్సోల్ అడివిలో అంత దూరం పోలేదు. ఆటబొమ్మని అందుకుందామనే తదేక ధ్యానలోనే మునిగిపోయి ఆమె పరిసరాల్ని గురించి పట్టించుకోలేదు. ఆమె గునగున పరిగెత్తుకు పోతూ వుంటే ఆమె దృష్టిని నిలపడానికి అంతరాయాలు దార్లో చాలానే వున్నాయి. పడిపోయిన చెట్ల నాచుపట్టిన కాండాలు, గోతులు, బారుగా వున్న ఫెరన్‌లు, గచ్చుతీగ గులాబీలు, మల్లెలు, హేజెల్ పొదలు ఆమె దారిని అడుగడుగునా అడ్డగించాయి. వాటిని దాటడంలో ఆమె క్రమేపీ అలిసిపోయింది, వూపిరి పీల్చుకోడానికో లేదా ముఖాన్ని తగులుకున్న బూజుని తుడుచుకోడానికో యింకా యెక్కువ సార్లు ఆగింది. పెద్ద బయళ్లలో తుంగ, రెల్లు దుబ్బులు వుంటే అస్సోల్‌కి మెరిసే ఎర్రటి తెరచాపలు కనిపించేవే కాదు, కాని మళ్లీ వంపుదాటి గబగబా పోయి, గాలి వాటంలో ఠీవిగా, రాజసంగా పోయే వాటిని మళ్లీ చూసేది. ఒకసారి ఆమె వెనక్కి చూసింది. నానా వర్ణ శోభితమై, పత్రాల లేత మసక స్తంభాకృతులనుంచి, దట్టమైన మబ్బులాంటి ముదురు జమిలి రంగుకి మారుతూ అడివి ఆమెని దిగ్భ్రమపరిచింది. ఒక క్షణం ఆమె భయపడింది, కాని మళ్లీ ఆటవస్తువుని గుర్తుకు తెచ్చుకుంది, "ప్ఫ్, ప్ఫ్" అని కొన్ని సార్లు అనుకుని తనకి చేతనైనంత వేగంగా పరిగెత్తింది.

యీ నిష్ఫలమైన, వెర్రి వేటలో ఓ గంట దగ్గరదగ్గర గడిచింది. అప్పుడు అస్సోల్ తన యెదర చెట్లు చాలా ఎడం ఎడం అయిపోవడం చూసి ఆశ్చర్యపోయి హమ్మయ్య అనుకుంది. ఆ ఖాళీ జాగాలోనుంచి విస్తారంగా పరుచుకున్న సముద్రమూ, మేఘాలూ, పసుప్పచ్చగా యిసక వున్న నిట్రపాటి స్థలమూ కనిపించాయి. ఆమె పరిగెట్టుకుంటూ, అలసటతోటి దాదాపు తూలిపోతూ, అక్కడికి చేరుకుంది. అది ఆ చిన్న నది ముఖద్వారం. అది యిక్కడ పరుచుకుని, వెడల్పుగా కాకపోయినా లోతు తక్కువగా, అడుగునున్న రాళ్ల నీలపు తళుకు కనిపించేటట్టుగా, చొచ్చుకు వచ్చే సముద్రపు అలలలో కలిసిపోయింది. పల్లంగా, అడుగున ఎగుడుదిగుడుగా వున్న నిట్రపాటి కొండ ముందు భాగం అంచున నుంచుని అస్సోల్ ఒక మనిషిని చూసింది. అతని వీపు ఆమెకేసి వుంది. యేటివార వున్న పెద్ద బండరాతిమీద కూర్చుని, అతను ఆ కొట్టుకువచ్చిన పడవని పట్టుకుని దాన్ని చేతుల్లో, సీతాకోక చిలకని పట్టుకున్న ఏనుగుకి వుండే కుతూహలంతోటి, తిప్పుతున్నాడు. అలా ఆటబొమ్మని జారిపోకుండా కాపాడ్డం ఆ పిల్లకి వూరట యిచ్చింది. అస్సోల్ ఏటవాలుమీదనుంచి జారి ఆ పరాయి మనిషి పక్కన చేరి అతను తల యెత్తుతాడా అని నిరీక్షిస్తూ శ్రద్ధగా పరిశీలించింది. ఏమైనా అడివి ఆశ్చర్యకరంగా తెచ్చిన ఆ వస్తువుని చూడ్డంలో ఆ వ్యక్తి యెంత నిమగ్నమైపోయాడంటే, ఆ పిల్లకి అతన్ని ఆపాదమస్తకం పరీక్షించే అవకాశం కలిగింది, అంతకు ముందెన్నడూ అలాంటి మనిషిని చూసి యెరగనని అనుకొంది.

ఆ మనిషి వాస్తవానికి యెవరో కాదు, పాటలూ, కథలూ అద్భుత కథలూ సేకరించే ప్రఖ్యాతుడైన ఎగెల్. ఆయన సంచారయాత్రలో వున్నాడు. ఆయన నెరిసిన కురులు అలల్లాగా గడ్డి టోపీలోనుంచి కిందికి జారుతున్నాయి. ఆయన బూడిద రంగు చొక్కాని నీలం రంగు లాగులో టక్‌చేసుకోవడమూ ఎత్తు బూట్లు తొడుక్కుని వుండటమూ అతన్ని వేటగాడి లాగా కనిపింపచేశాయి. ఆయన తెల్ల కాలరూ, టై, రజిత ఖచితమైన బెల్టూ,

చేతిక్ర్రా, నిగనిగ లాడుతూ నికిలు కోటింగు బకుల్ వున్న తోలు నంచీ అతను నగరవాసి అని తెలియజేస్తున్నాయి. గుబురుగా, కూచిమొన తేలిన గడ్డం మధ్యనుంచీ పుష్కలంగా భయం కొల్పేటట్టు మెలి తిరిగిన మీసాలమధ్యనుంచీ బయటకీ కనిపించే పెదాలనీ, ముక్కునీ, కళ్లనీ ముఖం అని పిలవగలిగితే అతని ముఖం, యిసకలాగా బూడిదవర్ణంతోటీ, పరిశుద్ధమైన ఉక్కులాగా మెరుస్తూనూ ధైర్యంగా శక్తివంతంగా చూసే చూపు వున్న కళ్లు వుండబట్టీగాని, లేకపోతే వదులుగా పారదర్శకంగా వుండి వుండేది.

''యింక దాన్ని యిచ్చెయ్యండి'' అంది ఆ పిల్ల బెరుగ్గా. ''మీరు దాంతో చాలాసేపు ఆడుకున్నారు, చాలు. అది మీకు యెలా దొరికింది?''

ఎగెల్ పైకి చూసి పడవని వదిలేశాడు యేమంటే అస్సాల్ ఉద్రేకభరిత కంఠస్వరం అనుకోకుండా ఆ నిశ్శబ్దాన్ని భగ్నం చేసింది. ఆ ముసలతను చిరునవ్వు నవ్వుతూ, పొడుగాటి వంపులు తిరిగిన వేళ్లతోటి మెల్లిగా గడ్డం దువ్వుకుంటూ ఓ క్షణం ఆ పిల్లకేసి పరకాయించి చూశాడు. బక్క పలచగా యెండకి కమిలిన ఆమె మోకాళ్లమీదకి, ఎన్నోసార్లు ఉతికిన, చిన్న నూలుబట్ట చాలీచాలనట్టుగా వుంది. లేసు రుమాలుతో కట్టుకున్న ఒత్తుగా నల్లగా వుండే జుట్టు విడిపోయి భుజాలమీద పడుతోంది. అస్సాల్ రూపులో ప్రతీదీ చక్కగా చెక్కినట్టూ, హంసనడక లాగా సుతారంగానూ వున్నాయి. ఆమె వదనంకంటే వయసెక్కు వున్నట్టు కనిపించే నల్లని కళ్లల్లో ఒక విచారకరమైన, ప్రశ్నార్థకమైన చూపు వుంది. ఆ వదనపు అసమ అండాకారపు తీరు చర్మపు ఆరోగ్యవంతమైన శ్వేత వర్ణానికి ప్రత్యేకమైన ఆతపస్నపతంగా అందంగా వుంది. తెరుచుకుని వున్న ఆమె చిన్న పెదాలు చిరునవ్వుతో కనిపిస్తున్నాయి.

''గ్రిమ్ సోదరులమీద, ఈసప్‌మీద, ఆండర్సన్‌మీద ఒట్టు'' అన్నాడు ఎగెల్, ఆ పిల్లనుంచి పడవ బొమ్మకేసి చూపు మళ్లించి ''యిక్కడ మరీ ప్రత్యేకమైంది ఒకటుంది! చూడమ్మా, గులాబీ పువ్వు! యిది నీదే, ఏం?''

''అవును. దీనికోసం యేటి వొడ్డంతా పరిగెత్తుకుంటూ వచ్చాను. నేను చచ్చి పోతానేమో అనుకున్నాను. యిది యిక్కడికి వచ్చిందా?''

''సరిగ్గా నా కాళ్ల దగ్గరికి. నౌకాభంగం వల్ల యిది నాకు సాధ్యమైంది, ఒడ్డున వున్న సముద్రపు దొంగలాగా నీకీ బహుమతీ యివ్వడం. సిబ్బంది వదిలేసిన యీ పడవ, ఒడ్డుకి మూడంగుళాల అలమీద కొట్టుకుని వచ్చి, నా యెడం కాలి మడమకీ, చేతిక్ర్ర కొసకీ మధ్యన వచ్చి పడింది.'' అతను చేతిక్ర్రని కొట్టాడు. ''నీ పేరేమిటి, పాపా?''

''అస్సాల్'' అని చెప్పిందా పిల్ల, ఎగెల్ అందించిన ఆటబొమ్మని బుట్టలో పెట్టుకుంటూ.

''చాలా బాగుంది'' ఆ ముసలాయన తన గూఢ ఉపన్యాసాన్ని కొనసాగించాడు ఆమెనుంచి కళ్లని తప్పించుకోకుండా. ఆ నేత్రాల లోతుల్లో దయాన్వితమైన, సౌహార్ద్రపూరితమైన సంతోషపు చిన్నెలు మెరిశాయి. ''నిజానికి నేను నీ పేరు అడిగి వుండేవాణ్ణి కాను. నాకు చాలా సంతోషంగా వుంది, యీ పేరు మామూలుగా వుండేది కానే కాదు, యెంతో ఉత్కృష్టోచ్చారణతోటి రివ్వున బాణం వూళలాగా, శంఖంలాగా ధ్వనిచేస్తూ వుంది. నీ పేరు, ముచ్చటైనా కానీ, పరమ సామాన్యంగా, ఆ 'మహిమాన్వితమైన సంశయానికి' అన్యమైనవిగా వుండే పేర్లలో ఒకటైతే యేం చేసి వుండేవాణ్ణి? నువ్వు యెవరైందీ, నీ తల్లిదండ్రులెవరైందీ, నువ్వు యెలాంటి జీవితం గడిపేదీ యింకా తక్కువ పట్టించుకుని వుండేవాణ్ణి. మంత్రమహిమని భగ్నం చెయ్యడం దేనికి? నేనిక్కడ యీ రాతిమీద ఫిన్నిష్, జపానీస్ కథేతివృత్తాలని పోలుస్తూ కూర్చున్నాను... అప్పుడు హఠాత్తుగా పెలయేరు యీ పడవ బొమ్మని తీసుకొచ్చింది, అప్పుడు నువ్వు కనిపించావు. నువ్వున్నట్టుగానే. నేను హృదయంలో కవిని, పాపా, నేను యెప్పుడూ యేమీ రాసి వుండకపోయినా. నీ బుట్టలో యేం వుంది?''

''పడవలు'' అంది అస్సోల్, బుట్టని కుదుపుతూ. ''ఒక అవిరి ఓడ, తెండాలతో వున్న మూడు చిన్న యిళ్లు. వాటిల్లో సైనికులుంటారు.''

''అద్భుతం. వాటిని అమ్మడానికి నిన్ను పంపారు. దారిలో నువ్వు ఆడుకోడానికి ఆగావు. పడవని కొంచెం దూరం పోనిచ్చావు, కాని అది అలా జారిపోయింది. ఏం, నే చెప్పేది నిజమేనా?''

''మీరు చూస్తూ వున్నారా?'' అస్సోల్ సందేహంగా అడిగింది, తనే అతనికి చెప్పానా అని గుర్తు చేసుకో ప్రయత్నిస్తూ. ''మీకు యెవరేనా చెప్పారా? లేక మీరు వూహించారా?''

''నాకు తెలుసు.''

''యెలా?''

''యెలా అంటే నేను యెంతో గొప్ప మాంత్రికుణ్ణి.''

అస్సోల్ కలవరపడింది. ఎగెల్ అన్న యీ మాటలకి ఆమెకి కలిగిన మానసికోద్వేగం భయాన్ని దాటిపోయింది. నిర్జనమైన ఆ తీరం, ఆ నిశ్శబ్దం, అలసట కలిగించిన ఆ పడవ సాహసయాత్ర, మెరిసే కళ్లతో ఆ ముసలాయన మాట్లాడే వింత వాగ్ధోరణి, అతని శ్మశ్రు, కేశాల వైభవం అన్నీ కూడా అతిలోకమైందీ వాస్తవమైందీ మిశ్రమంచెందినట్టు ఆ పిల్లకి కనిపించాయి. ఎగెల్ కనక ముఖం వికారంగా పెట్టి అరిచి వున్నట్లయితే ఆ పిల్ల యేడుస్తూ, భయంతో సొమ్మసిలిపోయి, పారిపోయి వుండేదే. ఆమె నేత్రాలు యెంత విప్పారాయో చూసి ఎగెల్ చటుక్కున తన ప్రవర్తన పూర్తిగా మార్చేశాడు.

''నన్ను చూసి భయపడాల్సిన పని నీకు లేదు'' అన్నాడతను గంభీరమైన స్వరంతో. ''తద్భిన్నంగా, నీతోటి మనసు విప్పి మాట్లాడాలని అనుకుంటున్నాను.''

ఆఖరికి ఆమె ముఖంలో తనని అంతలా ఆకర్షించింది యేమిటైందీ అతను గమనించాడు. ''అందమైన, ఆనందదాయకమైన భవిష్యత్తు కోసం తెలియకుండా యెదురుచూడ్డం'' అని అతను నిర్ణయించుకున్నాడు. ''అయ్యో, నేను రచయితగా యెందుకు పుట్టలేదు? కథకి యెంత అద్భుతమైన యితివృత్తం.''

''మరిప్పుడు'' అని మొదట అందుకున్న సిద్ధాంతాన్ని (అభూత కల్పనలపట్ల అభిరుచి — రోజువారీ పని తాలూకు ఫలితం — అజ్ఞాత భూమిలో మహాస్వప్నాల విత్తనాలని విరజిమ్మే భయంకంటే యెక్కువైనది) పూర్తిచెయ్య ప్రయత్నిస్తూ ఎగెల్ కొనసాగించాడు, ''మరిప్పుడు, అస్సోల్, జాగ్రత్తగా విను. బహుశా నువ్వు యిప్పుడు వచ్చిన వూరినుంచే, అంటే కపేర్నానుంచే నేను వచ్చాను. నాకు అద్భుత కథలన్నా, పాటలన్నా యిష్టం. యింతకు ముందు యెవరూ విని వుండని దాన్ని వినచ్చునేమోనన్న ఆశతో రోజంతా ఆ వూళ్లో గడిపాను. కాని యీ ప్రాంతాల్లో యెవరూ అద్భుత కథలు చెప్పరు. యిక్కడ యెవరూ పాటలు పాడరు. ఒకవేళ వాళ్లు కథలు చెప్పినా పాటలు పాడినా అవి మోసగాళ్లైన రైతుల గురించీ, సైనికుల గురించీ; వంచనని నిరంతరంగా పొగుడుతూ వుంటాయి అవి. అవి మురికి కడగని కాళ్లల్లాగా మకిలిగా, కడుపులోని గుడగుడలాగా, నాలుగు పాదాల పొట్టి పదాల దుర్భరమైన వరసకట్టి వుంటాయి... ఆగు, నేను యెందులోవో కొట్టుకుపోయాను. మళ్లీ మొదలెడతాను.''

అతను ఒక క్షణం నిశ్శబ్దంగా వుండిపోయి మళ్లీ మొదలుపెట్టాడు:

''యెన్ని యేళ్లు గడుస్తాయో నాకు తెలీదు, కాని కపేర్నామీద ఒక అద్భుత కథ వికసించి, ప్రజల మనస్సుల్లో చాలాకాలం వుండిపోతుంది. నువ్వు అప్పటికి పెద్ద దానివి అవుతావు, అస్సోల్. ఒక ప్రభాతాన ఎర్రని తెరచాప దిఙ్మండలంమీద యెండలో మెరుస్తుంది. తళతళల యెర్రని తెరచాపల బారు వున్న తెల్లని ఓడ, అలల్ని దున్నుకుంటూ నీకేసే నేరుగా వస్తుంది. ఆ అద్భుతమైన నౌక నిశ్శబ్దంగా తేలివస్తుంది. అరుపులుగాని, మర్యాదగా పేల్చే ఫిరంగులుగాని వుండవు. ఒడ్డుమీద పెద్ద జనసమూహం పోగవుతుంది. ప్రతి

ఒక్కళ్ళూ ఆశ్చర్యపడిపోయి, నిర్భాంతపోతారు. నువ్వూ అక్కడ వుంటావు. మధురమైన స్వరం ఆలాపన చేస్తూ వుంటే ఓడ ఠీవిగా ఒడ్డుదాకా వచ్చేస్తుంది; వేగంగా పోయే చిన్న పడవ ఒకటి, రత్నకంబళీలతోటీ, పుష్పాలతోటీ, బంగారంతోటీ అలంకృతమైనది, ఓడమీదనుంచి కిందికి దిగుతుంది. 'ఎందుకు వచ్చావు? ఎవరికోసం వెతుకుతున్నావు?' అని తీరంమీద వున్న జనం అడుగుతారు. అప్పుడు నీకో సాహసవంతుడైన, సుర్వరూపి అయిన యువరాజా కనిపిస్తాడు. అతను అక్కడ నుంచుని, నీకేసి చేతులు చాస్తాడు. 'ఓహోయ్, అస్సాల్!' అంటాడతను. 'యెక్కడ్నో, యెక్కడ్నో యిక్కడికి దూరంగా నిన్ను ఒక కలలో చూశాను, నిన్ను శాశ్వతంగా మా రాజ్యానికి తీసుకుపోదామని వచ్చాను. నువ్వు నాతోటి అక్కడ దట్టమైన గులాబీ లోయలో వుంటావు. నువ్వు కోరుకున్నవన్నీ నీకు లభిస్తాయి. మనిద్దరం యెంతో ఆనందంగా గడుపుతాం, నీకు యిక యెన్నటికీ కన్నీళ్లుగాని, కలతలుగాని తెలియవు.' అతను నిన్ను పడవలోకి యెక్కించుకుని, ఓడదగ్గరికి తీసుకెళ్లతాడు. నువ్వు మహత్తరమైన నేలకి, నీ రాకకి స్వాగతం చెప్పేందుకు సూర్యుడు వచ్చే, నక్షత్రాలు దిగి వచ్చే నేలకి, శాశ్వతంగా వెళ్లిపోతావు.''

''మరి యిదంతా నాకే?'' అని ఆ పిల్ల మెల్లిగా అడిగింది.

ఆమె గంభీరమైన నేత్రాలు ఉత్సాహవంతమై, విశ్వాసంతో మెరిశాయి. నిజానికి యే ప్రమాదకరమైన మాంత్రికుడూ అలా మాట్లాడడు. ఆమె అతనికి యింకా చేరువైంది.

''అది యిప్పటికే వచ్చిందేమో... ఆ ఓడ?''

''అంత తొందరగానా?'' అడ్డుపెట్టాడు ఎగెల్. ''మొదట్గా నేను చెప్పినట్టు నువ్వు పెద్దదానివి అవాలి. అప్పుడు... సరే, మాట్లాడుకోవడంవల్ల యేమిటి లాభం? అది జరుగుతుంది, మరి వున్నదంతా అంతే. నువ్వేం చేస్తావు అప్పుడు?''

''నేనా?'' ఆమె బుట్ట లోపలకి చూసింది, కాని అక్కడ బహుమతిగా యివ్వదగ్గ సరైనదేదీ కనిపించ లేదు. ''అతన్ని ప్రేమిస్తాను'' అని గబగబా అని, కొంచెం సందేహిస్తూ జతచేసింది, ''అతను దెబ్బలాడకపోతే.''

''వుహుం, దెబ్బలాడ్డు'' అన్నాడా మాంత్రికుడు, ఆమె కేసి నిగూఢంగా సైగచేస్తూ. ''నేను హామీ యిస్తాను. వెళ్లు పాపా, సువాసన వోద్కా రెండు గుక్కల మధ్య, అపరాధుల పాటల గురించిన నా ఆలోచనల మధ్య నేను చెప్పింది మరిచిపోవద్దు. వెళ్లు. మెత్తటి కుచ్చున్న నీ బుర్రకి కుదురు కలుగు గాక!''

లాంగ్‌రెన్ తన చిన్న తోటలో బంగాళాదుంప మొక్కల్ని కుప్పగా పేరుస్తూ పనిచేసుకుంటున్నాడు. సంబరంగా ఆతృతతో వున్న ముఖంతో పరిగెత్తు కొస్తూ వున్న అస్సాల్ కేసి తల యెత్తి చూశాడు.

''నాన్నా, విను...'' రొగర్పుని ఆపుకో ప్రయత్నిస్తూ తండ్రి మురికి కాకుండా పైన కట్టుకున్న బట్టని రెండు చేతులతోటీ పట్టుకుని అంది. ''నే చెప్పేది విను... అక్కడ తీరం దగ్గర, దూరంగా, ఒక మాంత్రికుడు వున్నాడు...''

మాంత్రికుణ్ణి గురించీ, అతని అద్భుతమైన జోస్యం గురించీ ఆమె తండ్రికి చెప్పడం మొదలుపెట్టింది. ఆమె తహతహ ఆ సంఘటనలని ఒక క్రమ రీతిలో చెప్పడాన్ని కష్టం చేసింది. ఆమె మంత్రగాణ్ణి గురించి వర్ణించ మొదలుపెట్టి, పోయిన పడవని తను వెంబడించడం దగ్గరికి వెనక్కి వచ్చింది.

ఆమె చెప్పిందాన్ని యేం అడ్డం రాకుండానూ, చిరునవ్వు నవ్వకుండానూ లాంగ్‌రెన్ విన్నాడు. ఆమె పూర్తి చెయ్యగానే అతని వూహ ఒక వింత వ్యక్తిని, ఒక చేతిలో సువాసన వోద్కా ఫ్లాస్కునీ, యింకో చేతిలో ఆట పమ్మవునీ పట్టుకున్న ముసలతని రూపాన్ని ఆవాహన చేసుకుంది. అతను పక్కకి తిరిగాడు. కాని పిల్లల జీవితంలో

 వుండే ప్రబలమైన ఘడియల్లో యెవళ్ళేనా గానీ గంభీరంగా, ఆశ్చర్యపడి వుండాలని గుర్తుకు తెచ్చుకుని, గంభీరంగా తల ఆడించి అన్నాడు:

''అలాగా... అతను నిజంగా మంత్రగాడి లాగానే కనిపిస్తున్నాడు. ఒకసారి నేను అతన్ని చూస్తే బాగుణ్ణు... కాని నువ్వీ సారి వెళ్లినప్పుడు, రోడ్డు పక్కకి మళ్లద్దు; అడవిలో దారి తప్పిపోతావు.''

అతను తన తొల్లికని పక్కన పెట్టి, కురచగా వున్న గుంజలదడి పక్కన కూలబడి పిల్లని తన వొళ్లో కూర్చోబెట్టుకున్నాడు. ఆమె యింకొంచెం చెప్పడానికి మహాయాతనగా అలసట పడిపోయింది. వేడీ ఉద్రేకమూ అలసటా ఆ పిల్లకి మగత తెప్పించేశాయి. ఆమె కంటిరెప్పలు మూసుకుపోయాయి. ఆమె తల తండ్రి కఠినమైన భుజంమీద వాలిపోయింది. మరో క్షణంలో ఆమె నిద్రాదేశంలోకి జారిపోయేదే కాని వున్నట్టుండి ఒక హఠాత్సందేహంతో కలవరపడి అస్సాల్ నిటారుగా లేచి కూర్చుని, కళ్లు యింకా మూసుకునే, తన చిన్న పిడికిళ్లని లాంగ్‌రెన్ లోపలి కోటుమీద పొడుస్తూ, అంది:

''నిజంగా ఆ మహిమ నౌక నాకోసం వస్తుందా?''

''వస్తుంది'' అన్నాడా నావికుడు శాంతంగా. ''వీకలా చెప్పినప్పుడు అది వస్తుంది, వస్తుందీ అంటే వస్తుంది.''

''తను పెద్దయే నాటికి దీన్ని గురించి అంతా మరిచిపోతుంది'' అని తనలో తను అనుకున్నాడతను. ''యీ లోపున అలాంటి బొమ్మని నీనుంచి యెవళ్లూ తీసుకోకూడదు. భవిష్యత్తులో నీకు యెన్నో తెరచాపలు కనిపిస్తాయి, కాని అవి ఎరుపువి కావు, మురికిగా మోసపూరితంగా వుంటాయి. దూరానికి అవి మెరుస్తూ తెల్లగా కనిపిస్తాయి కాని దగ్గరసా చూస్తే అవి చిరిగిపోయి, కర్కశంగా కనిపిస్తాయి. పథికుడెవడో నా బిడ్డతో హాస్యమాడాడు. అయితే యేం? అది ఆదరపూర్వకమైన పరిహాసమే! అది మంచి హాస్యమే! తల్లీ, యెంత అలిసిపోయావు నువ్వు? ఒక పూట అడివిలో, వనమధ్యంలో గడిపావు. ఎర్రటి తెరచాపలకి సంబంధించి నాకు మల్లేనే అనుకో: నీ ఎర్రటి తెరచాపలు నీకుంటాయి.''

అస్సాల్ నిద్రపోయింది. లాంగ్‌రెన్ ఖాళీగా వున్న చేత్తోటి పైపు తీసుకుని, ముట్టించుకున్నాడు. గాలిలో పొగ కంచెగుండా తోట అవతల పెరిగిన పొదలకేసి పోయింది. పొదపక్కనే, వీపు కంచెకేసి పెట్టి మాంసం అప్పచ్చివి నములుతూ కూర్చున్నాడొక యువ భిక్షుకుడు. అతగాడు తండ్రీ కూతుళ్ల సంభాషణ పొంచి విన్నాడు. అది అతన్ని ఉల్లాసపరిచింది, యిప్పుడు మంచి పొగాకు వాసన అతనిలోవి పాపాటు రాముణ్ణి లేపింది.

''అయ్యా, యీ బీదవాడికి ఓ పొగాకు కాడ యివ్వండయ్యా'' అన్నాడతను కంచె అవతల నుంచి. ''మీ పొగ చుట్టలతో పోలిస్తే నా పొగాకు ఒట్టి యిషం దొరా.''

''తప్పకుండా యిద్దును'' అన్నాడు లాంగ్‌రెన్ లోగొంతులో ''కాని నా సంచీ యింకో జేబులో వుంది. మరి పిల్ల నిద్ర లేచిపోతుంది, యెలా.''

''యెంత దుర్గతి, నిజంగా! పిల్ల లేచినా మళ్లీ నిద్రలోకి జారిపోతుంది, కావి దారిన పొయ్యేవాడికి పొగాక్కాడ యిచ్చిన పుణ్యం వుంటుంది మీకు.''

''నీ దగ్గర యేమీ ఒక్క పిసరు కూడా లేనట్టు మాటాడతావే! పిల్ల అలిసిపోయింది. ఓ క్షణం తాళిరా, కావాలంటే'' అన్నాడు లాంగ్‌రెన్.

ఆ ముష్టివాడు అసహనంతో వుమ్మేసి, క్రర్రని సంచీ వేలాడేసుకుని, హేళనగా నవ్వాడు:

''అవును మరి ఆ పిల్ల యువరాణి కదూ. పిల్లబుర్రలో నానా రకాల అద్భుత నౌకల కథలూ కుక్కడం! నువ్వు నిజంగా చిత్రమైన మనిషివయ్యా! సంపన్నుడివి కదా!''

''యిదిగో'' లాంగ్‌రెన్ మెల్లిగా అన్నాడు, ''నేను పిల్లను లేపుతానేమో, యెందుకూ? నీ ముఖం చితగ్గొట్టడానికి. ఫో, అవతలికి!''

ఓ అరగంట తర్వాత ఆ ముష్టివాడు సారా దుకాణంలో ఓ డజను మంది బెస్తవాళ్లతో వున్నాడు. మొగుడి చొక్కా చేతుల్ని గుంజుతూనూ, ఓ గ్లాసు వోద్కా — తమకోసమే మరి — అందుకోవడానికి వాళ్ల భుజాలమీద చేతులు చాస్తూనూ వెనక్కాల కూర్చుని వున్నారు గుబురు కనుబొమల బొద్దు యింతులు కొందరు. వాళ్ల చేతుల కండరాలు చపటా రాళ్లంత పెద్దగా వున్నాయి. అవమానంతో పొగలు కక్కుతూ ఆ ముష్టివాడు తన కథ చెప్పాడు:

''...ఏం, నాకు ఒక్క పొగాక్కాడ యివ్వడండి! 'నువ్వు పెద్దయ్యాక' అన్నాడండి, 'నీకోసం ఓ ప్రత్యేకమైన ఓడ వస్తుంది. నువ్వు ఒక యువరాజుని పెళ్లిచేసుకోవాలని రాసి పెట్టి వుండటంవల్ల. ఏం' అంటాడండి యింకా. 'మాంత్రికుడు చెప్పింది గుర్తుంచుకో.' కాని నేను అన్నానండి 'లేపండయ్యా ఆ పిల్లని లేపండి, మీ సంచీ అందుతుంది' అని. మరప్పుడు యేం చేశాడండి నన్ను సగం దారి దాకా తరిమేశాడండి.''

''ఎవరు? ఏమిటి? అతనేంటి చెప్తున్నాడు'' ఆడవాళ్లు కుతూహలంగా అడిగారు.

ఆ బెస్తవాళ్లు అదంతా యేమిటైందీ చెప్పడంకోసం కొంచెం తలలు వెనక్కి తిప్పారు, అలా చెబుతూ వంకరగా చిరునవ్వు నవ్వారు:

''లాంగ్‌రెన్, వాడి కుతురూ పశువుల్లా మదించి పోయారు, బుర్రలు చెడిపోయుంటాయి కూడా, అదీ యితగాడు చెప్తావున్నది. ఓ మంత్రగాడు అతన్ని చూడవచ్చాడట. మరి యిప్పుడు వాళ్లు, పరాయి దేశాన్నుంచి వచ్చే యువరాజా కోసం నిరీక్షిస్తున్నారు, అమ్మలక్కలూ, మీ అదృష్టం జార విడుచుకోకండి, అతను ఎర్రటి తెరచాపలకింద మంచిగా ప్రయాణం చేస్తాడు!''

మూడు రోజుల తర్వాత అస్సోల్ బస్తీలోని ఆటబొమ్మల దుకాణంనుంచి తిరిగి వస్తూవుంటే మొదటి సారిగా ఆమె యెత్తిపొడుపు మాటలు వింది:

''ఒహోయ్! నువ్వు ఉరితియ్య దగ్గదానివి! అస్సోల్! అవిగో, ఎర్ర తెరచాపలు వస్తున్నాయి!''

ఆ పిల్ల కంపించి, అప్రయత్నంగా సముద్రంకేసి చూసి కళ్లకి అడ్డం పెట్టుకుంది. అప్పుడు యీ అరుపులు యెక్కణ్నుంచి వస్తున్నాయో అటు వేపు తిరిగింది. యిరవై అడుగుల దూరంలో పిల్లల గుంపు కనిపించింది. వాళ్లు వెక్కిరిస్తూ కోణంగి చేష్టలు చేస్తున్నారు. ఆ చిన్న పిల్ల నిట్టూర్చి గబగబా యింటికి వెళ్లిపోయింది.



రోమ్‌లో ద్వితీయుడుగా వుండటం కంటే పల్లెలో ప్రథముడుగా వుండటం మేలని సీజర్ తలిస్తే, యీ వివేకవంతమైన కోరికకి సంబంధించి ఆర్థర్ గ్రే అసూయ పడాల్సిందేమీ లేదు సీజర్‌ని చూసి. అతను కేప్టెన్‌గా పుట్టాడు, కేప్టెన్ కావాలనుకున్నాడు, కేప్టెన్ అయ్యాడు.

గ్రే జన్మించిన మహాసౌధం లోపల దిగులుగానూ, పైకి దివ్యంగానూ వుంటుంది. సౌధంనుంచి పుష్పవనమూ, పాక్షికంగా వనమూ కనిపిస్తూ వుంటాయి. వూహించదగ్గ అత్యుత్తమ తులిప్ పుష్పాలు — రజతనీలం, లవండర్, ఎరుపుజీరతోటి వున్న నలుపువి — తోటలో అజాగ్రత్తగా జార విడిచిన పూసల హారాల్లా మెలికలు తిరిగి వుంటాయి. వంపులు తిరిగి ప్రవహించే సెలయేటి తుంగ పైన జల్లించిన మబ్బున పార్కులోని వృద్ధ వృక్షాలు నిద్రిస్తున్నాయి. కోట కంటె, యేమంటే ఆ సౌధం వాస్తవానికి కోటే, యినప కటాంజనంతోటి

 సంధించిన ఆవర్తపు దుక్కాయినప స్తంభాలతోటి తయారుచేసింది. ప్రతి స్తంభంమీదా దుక్కాయినుముతో వికసించిన కలువ పువ్వు అలంకారం వుంది. పండగలప్పుడు ఆ దొన్నెల్లో చమురు పోసి, వెలిగిస్తారు, అవి రాత్రంతా దూరంగా పరుచుకుంటూ, జ్వాలాయమానంగా వెలుగుతాయి.

గ్రే తల్లిదండ్రులు తమ సాంఘిక అంతస్తుకీ, ఐశ్వర్యానికీ, ఆ సమాజపు నియమాలకీ బానిసలు. ఆ సమాజాన్ని గురించి ప్రస్తావించుకుంటూ వాళ్లు ''మేము'' అనగలరు. తమ పూర్వుల చిత్రప్రదర్శనశాల గాలరీమీద కేంద్రీకృతమైన వాళ్ల హృదయ పార్శ్వాలని గురించి చెప్పుకోదగింది నిజంగా లేదు, కాని మిగిలిన పార్శ్వం — దాని వ్యూహాత్మక కొనసాగింపు — చిన్న వాడైన గ్రేతో మొదలైంది. వంశగౌరవానికి భంగం కలక్కుండా గోడమీద అతని పటం వేలాడగలిగే రీతిలో, అతను జీవించి మరణించాలని విధికృతమై వుంది. కాని ఆ పథకంలోకి ఒక చిన్న దోషం చొచ్చుకువచ్చింది, యేమైనా: ఆర్థర్ గ్రే యెక్కువ చురుకు పాలుతోటి జన్మించి, వంశ చిహ్నాల్ని కొనసాగించే సుముఖత్వంతో లేకపోయాడు.

యీ చురుకుతనం, శిష్ట ఆచారంపట్ల ఆ కుర్రవానిలో వుండే సంపూర్తి వ్యతిరేకత, అతని యేనిమిదవ యేటనే, చాలా ప్రస్ఫుటమైంది. వింత అనుభూతులతో ప్రభావం చెందిన యోధ లక్షణం, అన్వేషకుడు, మహిమలు చేసేవాడు అనగా జీవితంలోని అసంఖ్యాక పాత్రల్లోనుంచి అత్యంత కష్టభూయిష్టమైనట్టిదీ, హృదయ స్పందన కలిగించేదీ అయిన ఆ పాత్రని, విధికృత పాత్రను తీసుకున్నాడు. శిలువమీద సీలలు కొట్టిన బొమ్మ నందుకోవడానికి గ్రే గోడదగ్గరికి కుర్చీ లాక్కున్న సమయంలోనే, క్రీస్తు రక్తసిక్తమైన హస్తాలనుంచి మేకుల్ని పీకినప్పుడే, అంటే అతను రంగుల వాడి వద్దనుంచి కాజేసిన నీలం రంగుతో వాటిని పూసేసినప్పుడే, ఆ పాత్ర వెల్లడి అయింది. ఆ రకంగా మార్చిన బొమ్మ అతనికి మరింత యింపుగా కనిపించింది. యీ చిత్రమైన వ్యాపృతితో మోహితుడైపోయి అతను క్రీస్తు పాదాల్ని కూడా రంగుతో పులిమెయ్యడం ప్రారంభించాడు గాని, తండ్రి వచ్చి అతనికి ఆశ్చర్యం కలిగించాడు. ఆ ముసలాయన కుర్రవాణ్ణి చెవి మెలిపెట్టి కుర్చీలోనుంచి లేపి అడిగాడు:

''బొమ్మని పాడుచేశావేం?''

''నేను పాడుచెయ్యలేదు.''

''యిది ఒక మహా చిత్రకారుడు గీసిన బొమ్మ.''

''నాకు లెక్కలేదు. ఎవరి చేతుల్లోనూ మేకులు దిగబడ్డం రక్తం కారడం నేను సహించను. అలా వుండ నివ్వను.''

మీసాల వెనక ముసిముసినవ్వుని దాచుకుంటూ లయొనెల్ గ్రే తన కొడుకు జవాబులో తననే చూసుకొని అతన్ని దండించలేదు.

గ్రే విసుగూ విరామం లేకుండా కోటని పరిశీలిస్తూ పోయాడు. అతని ఆవిష్కరణలు ఆశ్చర్యజనకంగా వున్నాయి. మిద్దెమీద ఒక యోధుడి ఉక్కు కవచ శిథిలాలూ, యినుముతోనూ తోలుతోనూ బైండు చేసిన పుస్తకాలూ, నలిగిపోయిన వస్త్రాలూ, పావురాళ్ల గుంపులూ కనిపించాయి. వైను వుంచిన నేలమాళిగలో అతను లఫ్ఫిత్, మదీరా, షెర్రీలని గురించిన భోగట్టా సేకరించాడు. రాతి కట్టడపు విలువంపు సరంబీ తాలూకు వాలు త్రికోణాల మధ్య నలిగిపోతూ వంగిన వింటి బద్దలాంటి కిటికీల మసక వెలుతుర్లో పెద్దా, చిన్నా పీపాలు కనిపించాయి. వాటిల్లో అతి పెద్దది, చదును వృత్తంలాంటిది, నేలమాళిగ పొట్టి గోడని పూరా ఆక్రమించింది; ఆ పీపా వంద యేళ్లనాటి నల్ల ఓకు కొయ్య బాగా నగిషీ పెట్టిన కొయ్యలాగా మెరుస్తోంది. బొజ్జ వున్న ఆకుపచ్చ, ముదురు నీలపు సీసాలు పీపాల మధ్య మేదర బుట్టల్లో వున్నాయి. సన్నటి పొడుగాటి కాండాల బూడిదరంగు కుక్కగొడుగులు రాళ్లమీదా, మట్టి నేలమీదా పెరిగి వున్నాయి; ప్రతిచోటా బూజు, నాచు,

క్షేమ, పులిసిన ఉక్క వాసన వున్నాయి. సాయంత్రం వేళ అస్తమయ సూర్యుని ఆఖరి కిరణవు వెలుగులో బయట పడి దూరంగా ఒక మూల పెద్ద సాలెగూడు బంగారంలా మెరుస్తోంది. క్రామ్‌వెల్ కాలం నాటి శ్రేష్ఠ మైన అలికాంట్ వైన్ వున్న రెండు పీపాలు నేలలో ఒకచోట కప్పెట్టి వున్నాయి. మాళిగకాపాలా మనిషి ఆ ఖాళీజాగాని గ్రేకి చూపించి, బతికున్న పొట్టి బొచ్చు కుక్కల మంద కంటే యెక్కువ జీవంతోటి వుండే మృతుడున్న ప్రసిద్ధ సమాధిని గురించిన కథ వర్ణించడం మరవలేదు. ఆ కథ చెప్పేటప్పుడు అతను ఆ పెద్ద పీపామీద బిరడాని సరిచూసుకోవడం యెన్నడూ మర్చిపోలేదు, అక్కడ్నుంచి, పైకి తేలిక పడ్డ మనసుతో వెళ్లి పోయేవాడు. యేమంటే అకస్మాత్తుగా ఆనందభరితమై అతని నేత్రాలలో అప్రయత్నంగా ఘాటు ఆనంద అశ్రువులు మిలమిల్లాడేవి.

''యిప్పుడు మరి'' అని పోల్డిషోక్ ఖాళీ వెదురుపెట్టెమీద కూర్చుని, ఒక పిసరు పొడుం పొడుగాటి ముక్కుతో పీలుస్తూ గ్రేతో అనేవాడు. ''ఆ చోటు కనిపిస్తోందా? అక్కడ కప్పెట్టిన వైన్‌లాంటి వైన్ ఒక్క గ్లాసు దక్కితే యిక నాలిక కోసేసుకుంటామని యెలాంటి తాగుబోతులేనా గానీ అంటారు. మీ మనసుని పీల్చేసి, మీ శరీరాన్ని పిసికిన పిండి ముద్దలా చేసేసే లాంటి వస్తువు వంద లీటర్లు ప్రతి పీపాలో వుంది. యిది షెర్రీకంటే ముదురు రంగుది, అది పీపాలోంచి వూడిపడదు. చిక్కటి మీగడలాగా వుంటుంది. యినుము లాగా గట్టిగా వుండే నల్లని ఓకు పీపాల్లో దాన్ని బంధించేశారు. వాటికి రెండు వరసల రాగి పీపా కట్లు న్నాయి. ఆ రాగి కట్లమీద అక్షరాలు లాటిన్‌లో యిలా వున్నాయి: 'తను స్వర్గంలో వున్నప్పుడు ఒక గ్రే నన్ను తాగుతాడు.' దీని అర్థం యేమిటైందీ అన్న దాన్ని గురించి చాలా అభిప్రాయాలున్నాయి. మీ ముత్తాత గారైన సిమియన్ గ్రే ఒక గ్రామ ఎస్టేట్ కట్టించి దానికి 'స్వర్గం' అని పేరు పెట్టి ఆ రకంగా ఆ మర్మగర్భితమైన రాతనీ, నిష్కపటమైన యుక్తిద్వారా వాస్తవాన్నీ జోడించాలని భావించాడు. మరి తెలుసా? మొదటి కట్లు విప్పుతూ వుండగానే ఆయన హృద్రోగంతో చనిపోయాడు. మధువు రుచులు తెలిసిన ఆ ముసలాయన అంత ఉద్రేకపడ్డాడు. ఆ నాటినుంచీ మరెవళ్లూ కూడా ఆ పీపాని తాకను కూడా తాకలేదు. ఆ విలువైన మధువు దురదృష్టాన్ని కొనితెస్తుందని అంటారు. వాస్తవానికి యిది ఒక బ్రహ్మరాక్షసి ప్రశ్నలాంటిది. నిజమే అది ఒక రుషిని అడిగింది: 'అందర్నీ కబళించినట్టుగా నిన్ను నేను కబళిస్తావా? నిజం చెప్పు నువ్వు బతికిపోతావు.' కాని ఆ ప్రశ్నని గురించి కొంచెం యుక్తిగల ఆలోచన చేసిన తర్వాతనే...''

''మళ్లీ ఆ బిరడా కారుతున్నట్టుంది'' అని తన మాటకి తనే అడ్డం వస్తూ పోల్డిషోక్ అనేవాడు, యేటవాలుకేసి మూలగా తలపెట్టి అక్కణ్నుంచి బిరడా బిగించి, మృదువుగా, వెలిగిపోయే ముఖంతోటి తిరిగి వచ్చేవాడు. ''వూఁ, కొంచెం సేపు ఆలోచించి, అన్నిటికంటే ముఖ్యమైంది దానిమీద తన కాలాన్ని వ్యయం చేసి ఆ రుషి బ్రహ్మరాక్షసితోటి అనేవాడు: 'వెళ్లి కొంచెం మధువు తాగుదాం పద, ఆ చెత్త అంతట్నీ మర్చి పోతావ్.' — 'తను స్వర్గంలో వున్నప్పుడు ఒక గ్రే నన్ను తాగుతాడు!' దీన్ని అర్థం చేసుకోవడం యెలాగ? అంటే తను చచ్చింతర్వాత తాగుతాడవా? చిత్రంగా వుంది. అంటే అతను మహర్షి అవాలి, అంటే అతను సారాయిలు గాని మధువులు గాని తాగడన్న మాట. ఉదాహరణకి 'స్వర్గం' అంటే ఆనందం అనుకుందాం. కాని ప్రశ్నని ఆరకంగా వేసినట్టయితే, ఆ ఆనందమూర్తి నిజాయితీగా తనని యిదేనా స్వర్గం అని అడిగితే సంతోష మనేది విగనిగలాడే తన రెక్కల్ని సగం రాల్చుకుంటుంది. అక్కడే వుంది సంకటం. నిశ్చింతగా నవ్వుతూ, నాయనా, నిజంగా నవ్వుతూ యీ పీపానుంచి తాగాలంటే యెవళ్లకేనాగానీ ఒక కాలు నేలమీద యింకో కాలు ఆకాశం లోనూ వుండాలి. యింకో మూడో సిద్ధాంతం కూడా వుంది: ఏమంటే ఒక రోజున ఒక గ్రే స్వర్గతుల్యంగా తాగి సిగ్గులేకుండా యీ పీపాని ఖాళీ చేస్తాడు అని. యేమైనా యిది యీ జోస్యాన్ని నిజపరచడం అవదు, నాయనా, కల్లు దుకాణవు కొట్లాట అవుతుంది.''

ఆ పెద్ద పీపా బిరడా సక్రమంగా వున్నదీ లేనిదీ మరోసారి చూసి పోర్ల్డిషోక్ ముఖం ముడుచుకుని, తీక్ష్ణంగా తన కథని ముగించాడు:

"మీ పూర్వుడు అయిన జాన్ గ్రే యీ పీపాలని లిస్బన్‌నుంచి 'బీగిల్' నౌకలో 1793లో తీసుకుని వచ్చాడు. ఆయన యీ వైన్‌కి రెండు వేల బంగారు మొహరీలు చెల్లించాడు. పాండిచ్చేరీనుంచి వచ్చిన తుపాకులు చేసే కమ్మరి బెంజమిన్ ఎల్లియన్ యీ పీపాలమీద అక్షరాలు చెక్కాడు. యీ పీపాలని భూమిలో ఆరడుగులు పాతేసి ద్రాక్ష తీగల ఆకులు కప్పారు. ఎవరూ యీ వైన్‌ని తాగలేదు, రుచి చూడలేదు, చూడబోరు."

"దీన్ని నేను తాగుతా" అన్నాడు గ్రే ఒకరోజాన కాలితో నేలమీద తంతూ.

"ఏం ధైర్యవంతుడైన కుర్రాడు!" అన్నాడు పోర్ల్డిషోక్. "నువ్వు మరి దీన్ని స్వర్గంలో తాగుతావా?"

"అవచ్చు! యిదే స్వర్గం! యిదిగో యిక్కడుంది, చూడు" అని గ్రే మెత్తగా నవ్వి తన చిన్న పిడికిలి విప్పాడు. నున్నితమైందైనా చక్కని రూపు తీసుకున్న అరచెయ్యి యెండకి మెరిసింది. అప్పుడతను వేళ్లని మళ్లీ పిడికిలి లాగా బిగించాడు. "యిక్కడుంది! యిదిగో, మళ్లీ పోయింది!" అన్నాడు.

అలా అంటూ పిడికిలి బిగిస్తూ తెరుస్తూ వున్నాడతను. ఆఖరికి తన పరాచికానికి సంబరపడి పోర్ల్డిషోక్ కంటే ముందుగా నేలమీద వసారాలోకి పోయే చీకటి మెట్లకేసి పరిగెత్తి పోయాడు.

వంటగదిలోకి పోకూడదని గ్రే మీద పరమ ఆంక్ష వుండింది. కాని ఒకసారి అంటూ యీ అద్భుత ప్రపంచం తాలూకు మండే పొయ్యిలు, మసి, కళపెళ కుతకుత మరిగే ద్రవాలు, చాకులతో నరకడాలు, నోరూరించే వాసనలు కనిపెట్టేంతర్వాత ఆ కుర్రవాడు ఆ మహామందిరాన్ని అతి శ్రద్ధగా సందర్శించే వాడయాడు. వంటవాళ్లు పెద్ద పీఠాధిపతులైనట్టు శిలాసదృశ మౌనం వహించి చరించేవాళ్లు; మసిబారిన గోడల నేపథ్యంలో వాళ్ల తెల్లని టోపీలు వాళ్ల కదలికలకి గంభీర క్రతు వాతావరణాన్ని కల్పించేవి; బొద్దుగా కులాసాగా వుండే అంట్లు తోమేవాళ్లు పీళ్ల పీపాల దగ్గర ప్లేట్లు వగైరా సామాన్ని కడుగుతూ పింగాణీ సామాన్నీ వెండి సామాన్నీ టంగ్ మనిపిస్తూ తోమేవాళ్లు. చేపలు, పీతలు, పెద్ద పీతలు, పళ్లు వున్న బుట్టల బరువుతో వంగిపోయి, వాటిని మోస్తూ కుర్రాళ్లు వచ్చేవాళ్లు. పెద్ద బల్లమీద ఇంద్రధనుమ్సు రంగులున్న అడివికోళ్లూ, వెలిబూది బాతులు, అనేక రంగు యీకలున్న కోడిపెట్టలూ పెట్టి వుండేవి. ఆ వార చిన్న తోకా, చంటి పిల్లలా మూసుకున్న కళ్లూ వున్న పందిపిల్ల కళేబరం వుండేది. దుంపలు, కాబేజీలు, గింజలు, ఎండు ద్రాక్షలు, ఎండలో మెరిసే పీచ్ పళ్లు వుండేవి.

గ్రే యెప్పుడూ వంటగదిలో కొంచెం తత్తర పడేవాడు. అక్కడ యేదో వింత శక్తి అజమాయిషీ చేస్తూ వుంటుందనీ, దాని అధికారం కోట జీవితానికి మూలాధారమనీ అతను భావించేవాడు. అక్కడి అరుపులు ఆజ్ఞల్లాగా అవాహనల్లాగా భాసించేవి. యేళ్ల ఆచరణ ఫలితంగా, వంటగది సిబ్బంది చేసే కదలికలు ప్రేరణలాగా కనిపించే కచ్చితమైన, తాళబద్ధమైన లయని సంతరించుకున్నాయి. వెసూవియస్ అగ్ని పర్వతంలాగా కుతకుతలాడే పెద్ద అండాలోకి చూడగలిగేటంత పొడుగు గ్రే లేడు, కాని అదంటే అతనికి ప్రత్యేకమైన గౌరవం వుండేది. యిద్దరు పనికత్తెలు దాన్ని కదుపుతూ వుంటే అతను భయభక్తులతోటి అలా చూస్తూ వుండిపోయేవాడు. అలాంటి సందర్భాల్లో పొంగేపొంగే నురుగు పొయ్యి పైభాగంలో చిమ్మేది, సుంయ్‌మనే పొయ్యి మూత శబ్దం వంటగదిని ముంచేది. ఒక సందర్భంలో యెంత రసం ఒలికిందంటే వంటగది పనికత్తెల్లో ఒకమ్మాయి చేతిని బొబ్బ లెక్కించేసింది. చర్మం వెంటనే ఎరుపెక్కిపోయింది, బేట్సీ (ఆమె పేరు అదే) కాలిన చర్మంమీద వెన్న రాస్తూ యేడిచింది. ఆమె గుండ్రని, భయకంపిత వదనంనుంచి అడ్డులేకుండా కన్నీటి ధార స్రవించింది.

గ్రే రాయిలాగా బిగుసుకుపోయాడు. మిగతా ఆడవాళ్లు బేట్సీ చుట్టూ చేరి ఆర్భాటం చేసేస్తూ వుంటే, అతను హఠాత్తుగా తను అనుభవించగలగలేని అవతలి వ్యక్తి బాధతో నలిగి పోయాడు.

"ఎక్కువ నొప్పిగా వుందా?" అని అతను అడిగాడు.

"ఒకసారి అనుభవిస్తే తెలుస్తుంది" అంది బేట్సీ తన చేతిని పైకొంగుతో కప్పుకుంటూ.

ఆ కుర్రాడు ముఖం చిట్లించి, ఒక ఎత్తుపీటమీదకి యెక్కి పొదుగాటి కాడ వున్న గరిటెని వేడివేడి ద్రవంలో ముంచి (యీసారి అది గొర్రె పులుసు వంటకం) కొంచెం మణికట్టుమీద చిందించుకున్నాడు. ఆ అనుభూతి నీరసంగా లేదు, కాని తీవ్ర బాధనుంచి ఉత్పన్నమైన శోష అతన్ని వూగిపోయేటట్టు చేసింది. బొబ్బలెక్కిన చేతిని లాగు జేబులో పెట్టుకుని అతను బేట్సీ దగ్గరికి వెళ్లేటప్పటికి పిండిలా తెల్లగా పాలిపోయి వున్నాడు.

"నీకు చాలా నొప్పిగా వుండాలి" అని అతను దు, గొణిగాతను చేసిన ప్రయోగం గురించి ఒక్క మాటా అనకుండా. "రా, డాక్టరు దగ్గరికి వెడదాం, బేట్సీ, రా!"

అంతసేపూ గృహవైద్యపు చిట్కాదార్లు ఆ బొబ్బకి రకరకాల మందులు వెయ్యమని ఆమెకి చెపుతూనే వున్నా అతను ఆమె గౌను పుచ్చుకుని గుంజుతూనే వున్నాడు. యేమైనా ఆమెకి చాలా బాధగా వుండింది, అందు కని ఆమె గ్రే వెనక్కాలే వెళ్లింది. డాక్టరు కట్టుగట్టి ఆమె బాధ నివృత్తి చేశాడు. బేట్సీ వెళ్లి పోయాకనే గ్రే తన చెయ్యీ చూపించాడు.

యీ అప్రాముఖ్యమైన ఘటన యిరవై యేళ్ల బేట్సీనీ పదేళ్ల గ్రేనీ ప్రాణ మిత్రుల్ని చేసింది. ఆమె అతని జేబుల్లో ఆపిల్‌పళ్లూ, చాక్‌లెట్లూ కుక్కేది. అతను ఆమెకి తను పుస్తకాల్లో చదివిన అద్భుత కథలూ, తదితర కథలూ చెప్పేవాడు. బేట్సీ గుర్రపుకాపరి జిమ్‌ని పెళ్లి చేసుకోలేకపోయిందనీ, యేమంటే కాపరం పెట్టడానికి తగ్గ సొమ్ము వాళ్ల దగ్గర లేదనీ ఒకరోజున అతను గ్రహించాడు. గ్రే పట్టకారుతోటి తన చిన్న పింగాణీ పొదుపు డబ్బా బద్దలు కొట్టి వొంపితే రాలిన మొత్తం దగ్గర దగ్గర వంద పౌన్లు వుండింది. అతను పెందరాళే లేచి, వరకట్నం సొమ్ములేని ఆ పిల్ల వంటింట్లోకి వెళ్లిపోయాక, ఆమె గదిలోకి దొంగచాటుగా దూరి తన బహుమతిని ఆమె పెట్లో పెట్టి, ఒక చిన్న చీటీ రాసి పైన వుంచాడు: "యిది నీదే బేట్సీ. (సంతకం) రాబిన్ హుడ్." యిది వంటింట్లో యెంత సంచలనం కలిగించిందంటే అది తను చేసిన పనే అని గ్రే ఒప్పేసుకో వాల్సి వచ్చింది. అతను ఆ డబ్బుని వెనక్కి తీసుకోలేదు, దాన్ని గురించి యింకో మాట అననివ్వలేదు.

జీవితం వడ్డించిన విస్తరిలా వుండే వాళ్ల కోవలోకి చెందుతుంది అతని తల్లి. సామాన్య మనిషి ప్రతి కోరికనీ తీర్చే ఐశ్వర్య స్వాప్నిక ప్రపంచంలో ఆమె బతికింది. అంచేత ఆవిడకి దర్జీలతోనూ, వైద్యుల తోనూ, వంటవాళ్లతోనూ సంభాషణలు జరపడం తప్ప వేరే వ్యావృత్తి లేకపోయింది. తన పెంపకం వల్లా విధివల్లా మత్తుకమ్మేసిన ఆమె అభిరుచులు బహిర్గతం అయే ఒక్క మార్గమూ ఆ వింత పిల్లవాడిపట్ల ఆమె తీవ్రమైన, నిష్కగరిష్ఠమైన అనుబంధం అని యెవళ్లకేనా అనిపిస్తుంది. ఆమె అభిరుచులు యింక యెంత మాత్రమూ సజీవంగా లేవు, యిచ్చని సోమరితనంతో కలిపి వదిలేసి నీరసంగా తెర్లాయి. ఆ ఉన్నత వంశీకురాలు హంస అండాన్ని పొదిగిన ఆడు నెమలిని పోలి వుండేది. తన కొడుకుకిగల వైభవోపేత వైశిష్ట్యాన్ని గురించి ఆమె స్పందనాత్మక చైతన్యంతో వుండేది. తన అక్కున పిల్లవాణ్ణి అదుముకున్నప్పుడు విచారం, ప్రేమ, నిర్బంధం ఆమె వునికిని నింపేసేవి. అలవాటుగా సంప్రదాయిక తరహా బంధాలనీ, భావాల్నీ ప్రతిబింబించే నాలుకలాగా కాకుండా ఆమె హృదయం మాట్లాడేది. సూర్యకిరణాలతో విపరీతంగా కలగాపులగం అయిపోయిన మేఘపు ప్రభావం ఆ రకంగా ఒక ఆఫీసు భవవపు అనురూప్య అంతఃమందిరంలోకి చొచ్చుకుపోయి దాని రసహీన లక్షణాల్ని వలువలు ఒలిచేసేది; కన్ను చూస్తుంది గాని మందిరాన్ని గుర్తించలేదు. ఆ అల్పత్వం మధ్యలో వెలుతురు తాలూకు నిగూఢ సూక్ష్మ ఛాయలు కళ్లు మిరుమిట్లు గొలిపే సామరస్యాన్ని సృష్టించేవి.

జీవిత జాజ్వల్యమాన స్వరాలకి ఆదరశూన్య మౌనంతో మాత్రమే ప్రత్యుత్తరమివ్వగల వదనంతోటి, స్త్రీ ఆకర్షణ లుప్తమైన ఆమె అహంకారపూరితమైన యిచ్ఛాత్మక శక్తి యెవళ్ళకేనా అనుభూతం. కనుక, ఆక ర్షించే దానికంటే యెక్కువగా వైముఖ్యం కలిగించే సున్నిత సౌందర్యం కల యీ ఉన్నత వంశీకురాలు, యిదే లిలియన్ గ్రే, పిల్లవాడితో ఒంటరిగా వున్నప్పుడు సామాన్య మాతృమూర్తి లాగా ప్రేమగా, మృదు స్వరంతో, ముచ్చటలాడేది. వాటి శక్తి అనుభూతుల్లో వుంది కాని వాటి అర్థంలో లేదు కనుక కాగితంమీద రాయలేని ప్రియభావనలతో నిండిపోయేది. ఆమె తన కొడుక్కి యేదీ నిరాకరించే స్థితిలో లేదు. ఆమె అతనిలో ప్రతిదీ క్షమించింది: అతను వంటింటిని సందర్శించడం, పాఠాలని చీదరించుకోవడం, అతని అవిధేయత, నానా రకాల టిక్కులు.

చెట్లని కత్తిరించడం అతనికి యిష్టంలేకపోతే వాటిని అలా వదిలేసేవాళ్ళు; అతను యెవళ్ళనేనా మన్నించ మన్నా, సమ్మానించమన్నా ఆ వ్యక్తికి తెలుసు అది జరుగుతుందని; తన చిత్తం వచ్చిన గుర్రాన్ని అతను స్వారీ చేసేవాడు, తన కిష్టమైన కుక్కని కోటలోకి తీసుకువచ్చేవాడు. లైబ్రరీలో పుస్తకాలని తిరగేశేవాడు, దిస పాదాలతో పరిగెత్తేవాడు, యేది పడితే అది తినేవాడు.

అతని తండ్రి దీన్ని ఆపుదామని ప్రయత్నించి కడకి లొంగిపోయాడు — మాత్రానికి కాదు, భార్య కోరి కలకి. పనివాళ్ల పిల్లలందర్నీ కోటలోనుంచి బయటికి పంపించేశాడు, నీచ సమాజంతో కలిస్తే పిల్లవాడి టిక్కులు తుడిచిపెట్టలేనంత అభిరుచుల్లాగా మారిపోతాయనే భయంతో. మొత్తంమీద ఆయన అంతంలేని కుటుంబ వ్యాజ్యాల్లో పూర్తిగా తల మునకలైపోయాడు. ఆ వ్యాజ్యాల పుట్టుక మొదటి పేపరు మిల్లు స్థాపన కాలంనాటిది. అంతం బహుశా ఆఖరి కుశంకలు లేవదీసేవాడి మరణ కాలంనాటికి పోతుంది. వీటికి తోడు రాజ్య వ్యవహారాలు, తన ఎస్టేటు వ్యవహారాలు, తన జ్ఞాపకాలని చెప్పడం, నక్కల వేట, వార్తాపత్రికల పఠనం, విపరీతమైన ఉత్తరప్రత్యుత్తరాలు వుండేవి ఆయన్ని కుటుంబంనుంచి అంత దూరంలో వుంచడానికి. ఆయన కొడుకుని యెంత అరుదుగా చూసేవాడంటే ఒకో అప్పుడు వాడి వయస్సెంత అయిందీ కూడా మర్చిపోయేవాడు.

ఆ రకంగా గ్రే తన సొంత ప్రపంచంలో వుండేవాడు. తనొక్కడే ఆడుకునేవాడు — మామూలుగా, ఒకప్పుడు వ్యూహాత్మక పథకాలకి ఉపయోగించిన కోట వెనకతట్టు భాగంలో. లోతు అగడ్తల అవశేషాలతోటి, నాచు కమ్మిన శిలా మాళిగలతోటి వున్న యీ విశాల ఖాళీ భూభాగం నిండా కలుపు మొక్కలు, ముళ్ల తీగెలు, ఉమ్మెత్తలూ, గచ్చ తీగలూ, పిచ్చి మొక్కలూ పెరిగిపోయి వుండేవి. గ్రే అక్కడ ఎలక బొరియల్ని శోధిస్తూ, కంపలతో యుద్ధం చేస్తూ, సీతాకోకచిలకల్ని పొంచిపొంచి అనుసరిస్తూ, విరిగిపోయిన యిటుకలతో బురుజులు కడుతూ మళ్లీ వాటిని కర్రలతోటీ రాళ్లతోటీ పడగొడుతూ గంటల కొద్దీ గడిపేవాడు.

అతని జీవంలోని అన్ని విడి చిహ్నాలూ రహస్య ప్రేరేపణలూ, ఆత్మలోని అంతరార్థాలూ అన్నీ ఒక శక్తివంతమైన తరంగంలో మిళితమై, ఆ రకంగా సామరస్యపూర్వక వ్యక్తీకరణగా రూపొంది, మొండి పట్టు దలగల కామనగా తయారయే నాటికి అతనికి పన్నెండో యేడు జరుగుతోంది. అప్పటిదాకా అతను బతుకు తోటకి సంబంధించిన వేరువేరు భాగాల్ని — ఓ ఎండగా వుండే చోటు, ఓ నీడ, ఓ పువ్వు, పెద్ద నల్ల మొద్దు — చాలా యితరుల తోటల్లో చూసినట్టు హఠాత్తుగా స్పష్టంగా వాటినన్నిటినీ — వైభవోపేత, ఆశ్చర్యకర అనుగు ణ్యతతోమా, చూసినట్టయింది.

యిది లైబ్రరీలో జరిగింది. ద్వారబంధంమీద విసన కర్ర ఆకారంతో మకిలిగా వున్న కిటికీపైన వున్న పెద్ద తలుపులు మామూలుగా మూసే వుండేవి, కాని గడియ కుసిలో సరిగా పడేది గాదు. గట్టిగా నొక్కితే తలుపు కొక్కెం వూడి తెరుచుకునేది. సాహసకృత్యోత్సాహం గ్రేని లైబ్రరీలోకి పోయేటట్టు ప్రేరేపిస్తే

వెళ్లిన అతనికి, ద్వారబంధంమీద సీసపు కిటికీ రంగుల అలంకారంవల్ల తయారైన పరిణామమూ, వైచిత్రీ వున్న మసక వెలుతురు ఆశ్చర్యం కలిగించింది. కుంటలో నీరు లాగా, యిక్కడ ప్రతిదానిమీదా పరిత్యక్త నిస్తబ్దత పరుచుకుని వుంది. యిక్కడా అక్కడా పుస్తకాల అరల నల్లని వరసలు కిటికీలని ఆనుకుని, వాటిని సగం మూసేస్తూ వున్నాయి. పుస్తకాల అరల మధ్య ఖాళీజాగాలు వున్నాయి, అక్కడ గ్రంథాలు యెత్తుగా పేర్చి వున్నాయి. మధ్య పేజీలు బయటికి వచ్చేసి తెరిచి వున్న ఆల్బం ఒకటి యిక్కడ వుంది; అక్కడ బంగారు తాడుతో కట్టిన కొన్ని పత్రాలు, ముటముటలాడుతూ కనిపించే పుస్తకాల గుట్టలు, రాత ప్రతుల దొంతర్లు, తెరిస్తే పేడులా పెట్లిపోయే సూక్ష్మాకారపు గ్రంథాల గుట్ట వున్నాయి, యిక్కడ పటాలూ, పట్టికలు, నూతన గ్రంథాల బారులు, దేశపటాలూ వున్నాయి; యెన్నో రకాలవి ముతకా, సన్నం, నలుపు, బొల్లి, నీలం, బూడిద రంగు, మందం, పలచన, గరుకు, నునుపు బైండింగులు వున్నాయి. పుస్తకాల అరలన్నీ పుస్తకాలతో నిండి పోయి వున్నాయి. తమ స్థౌల్యంతో జీవితాన్నే ఆవరించిన గోడల్లా వున్నాయవి. పుస్తకాల అరల అద్దాలమీద వర్ణ శూన్యమైన, తళతళ మెరసే మచ్చలతో మిగతా పుస్తకాల అరలు ప్రతిబింబిస్తున్నాయి. భూమధ్య రేఖా, ఉత్తర దక్షిణ రేఖలూ కలిసి యేర్పడిన యిత్తడి వర్తులాకారపు శిలువలో పెట్టిన పెద్ద గ్లోబు ఒకటి గుండ్రటి బల్లమీద వుంది.

నిష్క్రమించే దారికేసి తిరిగి, గ్రే ఒక పెద్ద చిత్రాన్ని గుమ్మంమీద చూశాడు. దాంట్లోని బొమ్మలు తక్షణం ఆ లైబ్రరీ కఠిన నిశ్శబ్దాన్ని నింపేశాయి. ఒక బ్రహ్మాండమైన అలశీర్షంమీద లేస్తున్న నౌక బొమ్మ అది. నౌక పక్కలనుంచి నురగ జారిపోతోంది. దాని ఉత్థాన ఆఖరి క్షణంలో గీసినది అది. సరిగ్గా చూసేవాడికేసే ఆ ఓడ వస్తోంది. వెనక్కి లేచిన ఓడ ముక్కుదూలం వల్ల తెరచాపకొయ్యల కిందిభాగం కనిపించడంలేదు. చుక్కానీ చీల్చిన ఆ పెద్ద అలశీర్షం గండభేరుండ పక్షి రెక్కల్లా వుంది. నురగ గాలిలోకి యెగిసిపోతోంది. ముక్కు దూలంపైన ఓడ అల్కాన్ డెక్కు వెనక వున్న తెరచాపలు అస్పష్టంగా అనుతున్నాయి. ఉధృతంగా లేస్తున్న తుపానువల్ల అవి గాలితో ఉబ్బి భారంతోటి వెనక్కి వాలి, శీర్షంమీద లేవడంవల్ల మళ్లీ తిన్నవై శూన్యంమీదనుంచి ఒరిగి నౌకని కొత్త అలలమీదకి వేగంగా పోయేట్టు చేస్తున్నాయి. తక్కువ యెత్తులో, శిధిల మేఘాలు మహాసముద్రంమీద సుళ్లు తిరుగుతున్నాయి. సమీపించే నిశీధి చీకటితోటి మసక దీపం వృధాగా పోరుతోంది. యేమైనా ఆ చిత్రంలో కొట్టవచ్చినట్టు కనిపించేదేమంటే అల్కాన్ డెక్కుమీద, చూపరివైపు వీపు పెట్టి, నుంచున్న మనిషి బొమ్మ. అది ఆ పరిస్థితినీ, యింకా చెబితే, ఆ క్షణపు స్వభావాన్నీ పూర్తిగా వెల్లడిచేసింది. ఆ మనిషి భంగిమ (అతను కాళ్లు చాలా యెడంగా పెట్టి చేతులు చాచాడు) వాస్తవంగా అతనేం చేస్తున్నదీ సూచించడం లేదుగాని, తీవ్రంగా దృష్టిలగ్నం చేస్తున్నట్టూ, చూపరికి కనిపించకుండా డెక్కుమీద వున్న దేనికో సూచనలిస్తున్నట్టూ యెవరికేనా అనిపింపచేస్తుంది. అతని కోటు వెనక్కాల అంచు గాలికి యెగురుతోంది; అతని తెల్లని జడ, నల్లని కత్తి తిన్నగా గాలిలో తేలి వున్నాయి. అతని ఖరీదైన వేషధారణ అతను కేప్టెన్ అని తెలియజేస్తోంది. అతని నృత్యభంగిమ — అల ఉరవడి ఫలితం; టోపీ లేదు; అతను ఆ ప్రమాదభరిత క్షణంలో సంపూర్తిగా లీనమైపోయాడు. యేదో అరుస్తున్నాడు — కాని యేమిటది? నీళ్లలో జారిపడిపోయే వాణ్ణి యెవణ్ణేనా పిస్తున్నాడా, లేక దేన్నేనా కట్టమని ఆజ్ఞ యిస్తున్నాడా? గాలి హోరులో గట్టిగా అరుస్తున్నాడా, తండేలుని పిలుస్తున్నాడా? యీ ఆలోచనల ఛాయలు, ఆలోచనలు తామే కాదు, ఆ బొమ్మ కేసి చూస్తూ వుంటే గ్రే బుర్రలో రూపు తీసుకు న్నాయి, ఎవరో యెడం వేపునుంచి సమీపించి, అజ్ఞాతంగా అదృశ్యంగా పక్కన నుంచున్నట్టుగా అతనికి హఠా త్తుగా అనిపించింది. ఆ అత్యద్భుతమైన అనుభూతి జాడలేకుండా అదృశ్యం కావడానికి అతను పూరికే తల తిప్పాలంతే. గ్రేకి అది తెలుసు. ఏమైనా అతను వూహని కత్తిరించెయ్యలేదు, కాని దాన్ని విన్నాడు. ఒక శబ్ద

 రహిత స్వరం కొన్ని పాడి పదబంధాల్ని అరిచింది, యేదో మరే భాషలో మాట్లాడినంత దురవగాహంగా వున్నాయి అవి; మంచు బండలు ఫెళఫెళా విరుచుకుపడ్డ ధ్వని అనుసరించింది; ప్రతిధ్వనులూ, భయంకరమైన గాలీ లైబ్రరీలో నిండిపోయాయి. గ్రే దీన్నంతటినీ తనలోనే విన్నాడు. చుట్టూ చూశాడు; తిరిగి స్థాపితమైన ప్రశాంతత అతని విచిత్ర వూహలనే గింగుర్లెత్తే బూజుని తక్షణం తుడిచేసింది. తుఫానుతోటి అతని బంధం తెగిపోయింది.

ఆ చిత్రాన్ని చూడ్డానికి గ్రే కొన్ని సార్లు అక్కడి వచ్చాడు. ఆత్మకీ జీవితానికీ మధ్యన సంభాషణలో అవసరమైన పదం అయింది అతనికి అది. అలాంటి పదం లేకుండా మనిషి తనని తాను అర్థం చేసుకోవడం కష్టం. ఆ చిన్న పిల్లవాడిలో ఆ మహాసముద్రం క్రమేపీ ఒక స్థానం సంపాదిస్తూ వుండింది. ఆ లైబ్రరీలో పీ పుస్తకాల బంగారు తలుపుల వెనక్కాల మహాసముద్రపు తళుకు కనిపించేదో వెతుకుతూ ఆబగా చదువుతూ వుండగా అతను దానికి అలవాటు పడ్డాడు. అలాంటి పుస్తకాలలో ఓడల వెనకతట్టులో నురగని విత్తుతూ ఓడలు తర్వాత ఓడలు చరించేవి. కొన్నిటికి తెరచాపలు, కొయ్యలు పోయివుండేవి; అలల ముంపులో, చీకట్లో చేపల భాస్వరపు నేత్రాలు మెరిసే ఆ అగాధంలోకి పోయేవి. కొన్ని ఓడలు అలలు చుట్టుకొన్న తెరచాప మడతల్లోకి కొట్టుకునేవి. మణిగిపోయే ఉధృతి ఓడ ఆకృతిని ప్రమాదభరితంగా కుదిపేసేది. వదిలేసిన ఓడ, చిరిగిపోయిన మోకులతోటి, నూతన తుఫాను వచ్చి ముక్కలు ముక్కలుగా భగ్నం చేసేసే దాకా దీర్ఘరోదనలో వుండేది. యింకా కొన్ని, సరుకులని ఒక రేవులో యెత్తుకుని యింకో రేవులో యథాలాపంగా దించేసేవి. సిబ్బంది కల్లు దుకాణం బల్ల చుట్టూ చేరి సముద్ర జీవితాన్ని పొగుడుతూ పాటలు పాడి, యిష్టంగా మద్యం గుటకలు వేసేవాళ్ళు. నల్లబావుటా యెగిరే సముద్రపు దొంగల ఓడలు వుండేవి. వంకరగా పొట్టిగా వుండే కత్తుల్ని తిప్పే భయంకర సిబ్బంది వాటిని నడిపేవాళ్ళు. నీలపు వెలుతురు మృత్యు కాంతితో వెలిగే ఇంద్రజాలిక నౌకలుండేవి. సైనికుల తోటీ, ఫిరంగులతోటీ, సంగీత వాయిద్యాలతోటీ నిండిన నావికా దళ ఓడలుండేవి. శాస్త్రీయ పరిశోధనలకి సంబంధించి అగ్ని పర్వతాలనీ, ఆకులలముల్నీ అధ్యయనం చేసే నౌకలుండేవి. భయంకర నిగూఢత్వంతోనూ, తిరుగుబాట్లతోనూ కప్పుకుపోయిన ఓడలు వుండేవి. ఆవిష్కరణల ఓడలూ, సాహసకృత్యాల ఓడలూ వుండేవి.

యీ నౌకా ప్రపంచంలో అత్యంత సహజంగా కేప్టెనే అన్నిటి కంటే మకుటాయమానమైన వ్యక్తిగా వుంటాడు. అతనే ఓడకి వెన్నెముక, గుండెకాయ, తలకాయ సర్వమూనూ; అతని స్వభావమే సిబ్బంది పని పాటుల్నీ ఆట పాటల్నీ నిర్ణయిస్తుంది. తన సిబ్బందిని తనే యెంపిక చేసుకుంటాడు, సిబ్బంది చాలా విధాలుగా అతని అభిరుచుల్ని తృప్తి పరుస్తుంది. అతనికి ప్రతి వ్యక్తి అలవాట్లూ, కుటుంబ జీవితమూ తెలును. అతని కింద పనిచేసే వాళ్ల దృష్టిలో అతనికి మహిమాన్విత జ్ఞానం వుంది. అదే ఒక ప్రయాణపు గతిని, ఉదహరణకి లిస్బన్‌నుంచి షాంగైకి, అతను ధైర్యంగా పథకం వెయ్యడానికి సహకరిస్తుంది. అతను తుఫాన్ని సంక్లిష్ట ప్రయత్నాల పద్ధతితోటి ప్రతిఘటించి నిరోధిస్తాడు, ఖండితమైన ఆజ్ఞలతోటి భయాన్ని దఢేలుమని పడేస్తాడు. అతను తనకిష్టమైన చోటికి పోతాడు, లంగరు వేస్తాడు. ప్రయాణానికి, ఎగుమతికి, మరమ్మత్తులకి, విశ్రాంతికి అన్నిటికీ అతనే అధిపతిగా వుంటాడు. నిరంతరం చరిస్తూనే వుండే ప్రాణభూతమైన వ్యవహారంలో యింతకంటే అధికమైన యుక్తివంతమైన అధికారాన్ని వూహించుకోవడం కష్టం. యీ అధికారం దాని ప్రత్యేకతలోనూ, అపరిమేయతలోనూ ఆర్ఫ్యూస్ ఆధికారానికి సమంగా వుంది.

కేప్టెన్‌ని గురించిన యీ భావన, యీ చిత్రం, వాస్తవంలో అతని అధికారానికి వున్న స్థానం, మనసుకి హత్తుకునే సన్నిహితత్వపు పరిస్థితి దృష్ట్యా గ్రే అద్భుత వూహల్లో గౌరవప్రదమైన స్థానాన్ని ఆక్రమించాయి. యిది తప్ప మరే యితర వృత్తీ కూడా జీవితంలోని సంపదలన్నింటినీ యేక మొత్తంగా మిళితం చేసుకోలేదు ప్రతి విడి సంతోషపు అతిసున్నిత వ్యూహాన్ని కాపాడుతూనే. ప్రమాదం, తెగింపు, ప్రకృతి శక్తి,

దూరదేశపు శోభ, అద్భుతమైన అజ్ఞేయం, కలయికల్లోనూ యెడబాయడాల్లోనూ వికసించి పొంగిపొర్లే ప్రేమ, సాహసకృత్యాలు, కొత్త ముఖాలు, సంఘటనల కల్లోలం కలిగించే మోహపరత. పైన ఆకాశంలో ఒకప్పుడు దాక్షిణాత్య నక్షత్రరాశీ, ఒకప్పుడు సప్తర్షిమండలమూ దర్శనమిస్తూ నిశిత దృష్టిలోకి అన్ని ఖండాలూ వస్తూ అనంత జీవిత వైవిధ్యం భాసిస్తుంది. అయినా మీ ఓడ గది యెప్పుడూ పుస్తకాలతోటే, బొమ్మల తోటే, ఉత్తరాలతోటే నిండి వుండి, మీ వీరోచితమైన ఛాతీమీద సిల్కుకేశగమితో చుట్టిన ఎండిన పువ్వుల మేకపిల్లచర్మపు పతకం నిత్యం వుండటంతో మాతృదేశపు మూర్తిని పొదువుకునే వుంటుంది.

తన పదిహేనవ యేట ఆకురాలు కాలంలో ఆర్థర్ గ్రే యింట్లోనుంచి పారిపోయి సముద్రపు బంగారు గడపలగుండా వెళ్ళిపోయాడు. తర్వాత కొద్ది కాలానికి, చిన్న చేతులతోటి మొగపిల్లల దుస్తులు వేసుకుని ఆడ పిల్ల ముఖం వున్న ఓడ కుర్రాడు యెక్కిన "అన్‌సెల్మ్" అనే ఓడ డ్యూబెల్ట్‌నుంచి మార్సెయిల్స్‌కి ప్రయాణం అయింది. ఆ కుర్రాడే గ్రే. ముచ్చటైన ప్రయాణం సంచీ, గ్రీష్మమైన యెంతో నాజూకైన తోలు బూట్లు, వంశలాంఛనమైన కిరీటం అలంకృతమైన సన్నని నేత రుమాల్లూ అతని దగ్గర వున్నాయి.

"అన్‌సెల్మ్" ఫ్రాన్స్‌నుంచి అమెరికాకీ, స్పెయిన్‌కీ ప్రయాణం చేస్తూ వుండిన సంవత్సరకాలంలోనూ, గ్రే తన దగ్గర వున్న దాంట్లో ఒక భాగం చిరుతిండి భక్ష్యాలమీద తగలేసి ఆ రకంగా గతానికి నివాళు లర్పించి, మిగతాది వర్తమానానికీ భవిష్యత్తుకీ నివాళు లర్పిస్తూ పేకాటలో తగలేశాడు. అతను "అగ్గిపిడుగు"లాంటి నావికుడు కావాలనుకున్నాడు. మద్యం గుక్కమింగేటప్పుడు ఉక్కిరిబిక్కిరి అయ్యాడు, స్నానం చేసేటప్పుడు పన్నెండ డుగుల యెత్తునుంచి ఉరుకుతూ వుంటే అతని గుండె తడబడేది. అతను క్రమేపీ అన్నీ పోగొట్టుకున్నాడు అత్యంత ముఖ్యమైన ఒక్క దాన్ని తప్ప—అతని వింత, ఎగిసిపోయే ఉత్సాహం. ఎముక ఘనమై కండరాలు గట్టిపడ్డంవల్ల అతని దౌర్బల్యం పోయింది; ఆతప తప్తమైందానివల్ల పాండువర్ణం పోయింది; కదలికలోని నాజూకు అజాగ్రత్త పోయింది పనిచేసే కచ్చితమైన హస్త కౌశలంవల్ల; విప్పుకేసి చూసే వాడికి మల్లే అతని తెలివైన కళ్లకి మిలమిల వచ్చింది. యిక అసమమైన స్వాతిశయపు బెరుకు అస్థిరత్వం పోయి అతని మాట మితంగా సూటిగా అయింది, మెరిసే వెండి చేపని వెంబడించి దూసుకు వచ్చే సముద్రపు కాకి దెబ్బ లాగా.

"అన్‌సెల్మ్" కేప్టెన్ దయాపూరితుడు. కాని కటువైన ఓడ మనిషి. యీ కుర్రాణ్ణి పగ కొద్దీ యెక్కించుకున్నాడు. గ్రే తెగింపుతో కూడిన కోరికలో ఒక రకమైన తిక్కకాంక్ష అతనికి గోచరించి, అతను ఓడిపోతాడని కేప్టెన్ ముందుగానే దుర్బుద్ధితో యెదురుచూశాడు, రెండు నెలల్లోనే గ్రే తన కళ్లల్లోకి చూడ్డం తప్పించుకుని "కేప్టెన్ హాప్, మోకులు యెక్కుతూ వుంటే నా మోచేతులు దోక్కుపోయాయి; నా వీపూ డొక్కలూ నెప్పిగా వున్నాయి; నా వేళ్లు వొంగడంలేదు; నా తల బద్దలైపోతోంది, వేళ్లు వణుకుతున్నాయి. యీ మోకులు, పగ్గాలు, బరువుని పైకెత్తే యంత్రాలు, ఎత్తైన చాపకొయ్యలు, అడ్డబద్దలు నా సున్నిత మైన శరీరాన్ని చంపేస్తున్నాయి. నేను యింటికి మా అమ్మదగ్గరికి పోతాను" అంటాడని వూహించుకున్నాడు. యిలా మానసికంగా అతని ధోరణి విని కేప్టెన్ హాప్ తనూ మానసికంగా యిలా అంటాడు: "నువ్వు యెక్కడికి వెళ్లాలనుకుంటే అక్కడికి వెళ్లచ్చు, పిచ్చికొండ. నీ చక్కని యీకలకి యేదేనా తారు అంటుకుంటే దాన్ని కడిగేసుకో— అత్తిపత్తి పన్నీరుతోటి." తనే కనిపెట్టిన యీ పన్నీరు అన్నిటికంటె యెక్కువగా కేప్టెన్ హాప్‌ని సంబర పరచింది, ఆ రకంగా తను మానసికంగా తిట్టడాన్ని చాలించి అతను పైకి అన్నాడు "ఫూ, అత్తిపత్తి పన్నీరుకోసం పో."

కాలం గడిచే కొద్దీ యీ ముచ్చటైన సంభాషణ కేప్టెన్ బుర్రకి తరుచుగా వచ్చేది కాదు, యేమంటే గ్రే పళ్లు బిగబట్టి, పాలిన ముఖంతో తన గమ్యంకేసి పురోగమిస్తున్నాడు. ఆ కటువైన నౌక తన శరీరంలోకి

 చొచ్చుకుపోతూ వుంటే, అప్రయోజిత్వం స్థానే అలవాటు వస్తూవుంటే యింకా అది సులభమవుతోందని భావిస్తూ అతను యీ కష్టభూయిష్టమైన శ్రమని కృతనిశ్చయంతో భరించాడు. ఒకో అప్పుడు లంగరు గొలుసు కొక్కెం అతన్ని డెక్కుకి కొట్టుకునేట్టు చేస్తూ, అతన్ని కూలదోసేది, లేకపోతే జంటగుంజలకి చుట్టబెట్టని తాడు అతని అరచేతి చర్మాన్ని పొప్పరలేపేస్తూ చేతిలోనుంచి జారిపోయేది, లేకపోతే యినప చక్రం కుట్టిన తడి తెరచాపని గాలి యెత్తి అతన్ని ముఖంమీద మోదేది; ఒక్క ముక్కలో చెప్పాలంటే యీ పనంతా యెంతో జాగ్రత్తని అపేక్షించే హింస. అయినా నడుం నింపాదిగా నిటారుగా పెట్టేటప్పుడు యెంత కష్టంగా అతను శ్వాస పీల్చినా ఒక తిరస్కారపూరితమైన చిరునవ్వు అతని వదనంమీదనుంచి తొలగిపోలేదు. అన్ని రకాల పరిహాసాలనీ, ఎత్తి పొడుపుల్నీ, విధిగా వుండే తిట్లనీ అతను నిశ్శబ్దంగా భరించాడు, తనూ నూతన పరిస్థితుల్లో "కుర్రాళ్లలో ఒకడు"గా అయేంతదాకా. కాని అప్పటినుంచి ఎప్పుడూ అవమానాన్ని ముష్టి బిగించి ఎదిరించేవాడు.

ఒకసారి అతను తెరచాపవి కట్టేస్తంభం అడ్డకర్రకి నేర్పుగా తెరచాపని బిగిస్తూ వుంటే కేప్టెన్ హోప్ చూసి "ఓరి భడవకానా, నెగ్గుకొచ్చావ్" అని తనలో తనే అనుకున్నాడు. గ్రే డెక్కుమీదకి దిగగానే హోప్ అతన్ని తన గదికి పిలిచి చూసి, మణగిన కాగితాలున్న పుస్తకం తెరిచి అన్నాడు:

"శ్రద్ధగా విను. పొగ పీల్చద్దు! కుక్క పిల్లని కేప్టెన్‌గా కుదిరించే పని మొదలెడదాం."

అతను చదవడం మొదలుపెట్టాడు, లేదంటే సముద్రానికి సంబంధించిన ప్రాచీన పదాల్ని విపులీకరిస్తూ అరిచాడు. అది గ్రే మొదటి పాఠం. ఒక యేడాది కాలంలో అతనికి నౌకాయానం, ఓడల నిర్మాణం, సముద్రన్యాయం, ఓడ ప్రయాణపు దిశలు, లెక్కలు రాయడం తెలిశాయి. కేప్టెన్ హోప్ అతనికి చెయ్యి అందించాడు, తమిద్దర్నీ కలుపుకుని "మనం" అని ప్రస్తావించేవాడు.

గ్రే వాన్కూవర్‌లో వుండగా భయంతోటీ, కన్నీళ్లతోటీ నిండిపోయిన అతని తల్లి ఉత్తరం అతనికి చేరింది. అతను జవాబు రాశాడు: "నాకు తెలుసు. కాని నువ్వు నేను దర్శిస్తున్నట్టే చూడగలిగితే: అన్నిటి కేసీ నా కళ్లతో చూడు. నేను విన్నట్టే వినగలిగితే: ఒక సంద్రపు గుల్లని నీ చెవిదగ్గర పెట్టుకో — అది అనంతమైన అల తాలూకు ధ్వనిని నీ కందిస్తుంది. నువ్వు నేను ప్రేమించినట్టే ప్రేమించగలిగితే — ప్రతి దాన్నీ, నీ ఉత్తరంలో ప్రేమకీ డబ్బుకీ తోడుగా ఒక చిరునవ్వుని కూడా చూసి వుండేవాణ్ణి." అతను అలా ప్రయాణిస్తూనే వున్నాడు, "అన్‌సెల్మ్" సరుకుతోటి డ్యూబెల్ట్‌కి చేరిందాకా. అక్కడ అది లంగరు దించాక యిరవై యేళ్ల గ్రే కోటని చూడ్డానికి వెళ్లాడు.

ప్రతీదీ యెప్పుడూ వున్నట్టే వుంది. వివరాల్లో అనతిక్రమణీయంగా అయిదేళ్ల నాడున్న సామాన్యాభిప్రాయమే వుంది, ఎల్మ్ చెట్ల శిఖరాలు కొంచెం పెద్దవి అయినా. భవనపు ముందు భాగం వాటి ఆకులతో చేసిన అలంకరణ నమూనాని జరిపి పెద్దదయింది.

పరిగెత్తుకుంటూ వచ్చే నౌకర్లు పరమానందభరితులైపోయారు, తామేదో యీ గ్రేకి అంతకుముందు రోజునే అభివాదం చేసినట్టు భక్తితోటి వణికి, ముద్దకట్టుకుపోయారు. అతనికి తల్లి యెక్కడుందో చెప్పారు; అతను ఆ పెద్ద మందిరం దగ్గరికి వెళ్లి, మూసిన తలుపుని మెల్లిగా లాగుతూ, తల పండిపోయి, నల్లటి దుస్తులలో వున్న ఆమెకేసి చూస్తూ నిశ్శబ్దంగా ఆగిపోయాడు. ఆమె శిలువ ముందు నుంచుని వుంది. గుండె కొట్టుకోవడం వినిపించేటంతగా ఆమె ఉగ్రమైన గుసగుస వినిపిస్తోంది. "సముద్రంమీద వున్న వాళ్లనీ, బాటసారుల్నీ, రోగుల్నీ, బాధితుల్నీ, ఖైదీలనీ కటాక్షించు." గ్రే వేగంగా గాలి పీలుస్తూ యీ మాటల్ని విన్నాడు. మళ్లీ యీ మాటలు వినిపించాయి: "మరి నా కుర్రాడు...." అప్పుడు అతను అన్నాడు: "యిక్కడ...." కాని అతను యింక అనలేకపోయాడు. అతని తల్లి వెనక్కి తిరిగింది. ఆమె చిక్కిపోయింది; చెక్కినట్టుండే

వదనపు అహంకారాన్ని ఒక నూతన భావ వ్యక్తీకరణ వెలిగించింది, యౌవనం తిరిగి వచ్చినట్టుగా. ఆమె కొడుకు దగ్గరకి తటాల్న వచ్చింది; గొంతు నిండుగా నవ్వు ఫక్కుమనడం, అణచుకున్న కేక, కళ్ళల్లో నీళ్ళు — యివే అంతా. కాని ఆమె ఆ క్షణంలో జీవించింది — ఆమె గత జీవితమంతటి కంటే యెక్కువ పూర్తిగా, ఆనందపూరితంగా జీవించింది.

"వెంటనే నిన్ను గుర్తు పట్టాను, బాబూ, నా బాబూ!"

నిజంగా గ్రే పెద్ద వాడయినట్టు వుండటం మానేశాడు. తన తండ్రి మరణం గురించి ఆమె చెప్పింది విని ఆమెకి తన గురించి చెప్పాడు. అతను చెప్పినదాన్ని యేమీ నిందించకుండా, నిరసన లేకుండా వింది, కాని తన మట్టుకి — అతను ప్రతిపాదించిన ప్రతిదాంట్లోనూ అతని జీవితసారం వుంది — తనకి ఆ పిల్లవాడు ఆటవస్తువులతో ఆడుకుంటున్నట్టే అనిపించింది. యీ ఆటవస్తువులు ఖండాలు, మహాసముద్రాలు, నౌకలు.

గ్రే కోటలో ఏడు రోజులు గడిపాడు. ఎనిమిదవ రోజున చాలా యెక్కువ మొత్తం సొమ్ము తీసుకుని డ్యూబెల్ట్‌కి తిరిగి వచ్చి కెప్టెన్ హోప్‌తోటి చెప్పాడు:

"కృతజ్ఞుణ్ణి. మీరు చాలా మంచి మిత్రులు. సెలవు ప్రస్తుతానికి, మధ్గురూ." యీ మాటకి ఇరుకు దాగిలిలాంటి కరచాలనంతోటి ముద్రవేశాడు. "యిప్పటినుంచీ నేను ఒంటరిగా ప్రయాణం చేస్తాను. నా సొంత ఓడమీద."

హోప్ బుర్రలో రక్తం ఉరుకెత్తింది, ఉమ్మెసి, చేతిని బలవంతంగా గుంజుకుని, విసవిసా పోయాడు. కాని గ్రే తటాల్న అతన్ని అందుకుని తన చేతిని అతని భుజం చుట్టూతా వేశాడు. వాళ్ళందరూ, సిబ్బందితో సహా యిరవై నాలుగు మంది సారా దుకాణానికి వెళ్ళి తాగి, అరిచి, పాడి, తిని, అక్కడ బార్‌లోనూ, వంటగది లోనూ వున్న ప్రతిదాన్నీ ముంచేశారు.

కొంచెం సేపటి తర్వాత డ్యూబెల్ట్ ఓడరేవులో కొత్త తెరచాప కొయ్య నల్లని తాటిమీద శుక్రగ్రహం మెరిసింది. అది గ్రే కొన్న రెండు వందల అరవై టన్నుల, మూడు తెరచాప కొయ్యల "సీక్రెట్" ఓడ. ఆర్థర్ గ్రే ఆ ఓడ యజమానిగా కెప్టెన్‌గా, అతన్ని యాదృచ్ఛికత లిస్‌కి తీసుకుని వచ్చేదాకా, నాలుగేళ్ళు తిరిగాడు. యేమైనా అతను గొంతు నిండుగా తనని యింటి దగ్గర ఆదరించిన నవ్వుని మర్చిపోలేదు. అలాంటి పెద్ద పిల్లాడు బహుశా తన ఆటవస్తువుల్ని సరిగానే పట్టుకోగలడనే అసందిగ్ధ విశ్వాసాన్ని ఆ రజితకేశినికి కలిగిస్తూ పాలుకి రెండు సార్లు కోటని సందర్శించేవాడు.

# ప్రభాతం

గ్రే "సీక్రెట్" వెనకతట్టు లేపిన నురగ జాలు మహాసముద్రాన్ని తెల్లని రేఖలా దాటి లిస్ తాలూకు సాయం దీపాల కాంతి ప్రవాహంలో మసకైపోయింది. ఓడ లైట్‌హౌస్ దగ్గర లంగరు దింపింది.

తర్వాత పది రోజులు "సీక్రెట్" టస్సోరి సిల్కు, కాఫీ, టీలని దిగుమతి చేసింది. సిబ్బంది పదకొండవ రోజున వూళ్ళో గడిపారు, మధుధూపోద్రేకంలో బరువు సడలించుకుంటూ. పన్నెండవ రోజున యెందుకనో తెలియదుగాని గ్రే పరమ నిరాసక్తంగా వుండిపోయాడు, యీ నిరాశ యెందుకైందీ అర్థం చేసుకోలేకపోయాడు.

అతను ఉదయం నిద్రలేచాడో లేదో, ఆ రోజు మబ్బు కమ్మినట్టుందని అతనికి అనిపించింది. మూతి ముడుచుకునే బట్టలు వేసుకుని, అయిష్టంగానే నాస్తా తిన్నాడు, వార్తాపత్రిక చదవడం మరిచిపోయాడు, చాలా సేపు చుట్ట కాలుస్తూ వుండిపోయాడు, అవ్యక్తమైన నిష్ఫల ఉద్వేగంలో మునిగిపోయాడు. అస్పష్టంగా

 పుట్టుకొచ్చే మాటల్లో అజ్ఞాత కామనలు సంచరించాయి, ఒక దాన్ని ఒకటి సమమైన ప్రయత్నంతో రద్దు చేసుకుంటూ. అప్పుడతను పని చెయ్యడానికి సిద్ధపడ్డాడు.

తండేలుతో కలిపి గ్రే ఓడని తనిఖీ చేసి పగ్గాల్ని బిగించమన్నాడు, చక్రంలో అనుసంధించిన తాటిని వదులుచెయ్యమన్నాడు, లంగరు దించే తాటి మార్గాన్ని శుభ్రం చెయ్యమన్నాడు, ఓడ వాటం మార్చమన్నాడు, డెక్కుకి తారుపూయమన్నాడు, దిక్సూచిని తుడవమన్నాడు, సామాను గదిని తెరిచి గాలి చొరనిచ్చి శుభ్రం చెయ్య మన్నాడు. ఏమైనా యిదేమీ అతని మబ్బుగా వుండే మనస్థితిని మార్చలేదు. ఆ రోజున వున్న మబ్బు స్థితిని గుర్తించిన యిబ్బందితో నిండిపోయి అతను చిరాగ్గా విచారంగా గడిపాడు. ఎవరో తనని పిలిచినట్టు, ఎవరైందీ ఎక్కడినుంచి అయిందీ తను మరిచిపోయినట్టు వుంది.

సాయంత్రం వేళకి అతను తన గదిలో సర్దుకుని ఓ పుస్తకం తీసుకుని, రచయితతోటి కాసేపు కుస్తీ పట్టి, విషమ స్వభావంతో కనిపించే ఒక ఉద్ఘాటనని పక్కన ఖాళీలో గుర్తు రాసుకున్నాడు. కాసేపు యీ క్రీడతో అతనికి వినోదం కలిగింది, శ్మశానంనుంచి పట్టు చిక్కించుకున్న విగతజీవుడితోటి యీ సంభాషణ. అప్పుడు పైపు ముట్టించుకుని ఆ నీలం పొగలో, అది అలా అలా పైకి పోతూ వుంటే దానిలో భూత సమ చిత్ర విచిత్ర మశీదుల్లాంటి వాటిని వూహిస్తూ వుండిపోయాడు.

పొగాకు చాలా శక్తివంతమైంది; అలల మధ్య ఉల్లకల్లోలపు చీలికలో చమురుపోస్తే దాని ఉధృతం తగ్గినట్టు పొగాకు చిరాకునీ, ఉద్రేక మాంద్యాన్నీ కొంత పరిమాణం తగ్గిస్తుంది. ఉద్రేకాలు శాంతంగా, శ్రావ్యంగా తయారవుతాయి. అంచేత మూడు పైపులు కాల్చింతర్వాత గ్రే వ్యాకులత తాలూకు తీవ్రత తగ్గి యోచనాత్మక పరధ్యానంగా మారింది. యీ పరిస్థితి యింకో గంట సేపు వుండింది. అతని మనసుమీదనుంచి పొగమంచు తొలగ్గానే, గ్రే కదిలి, వ్యాయామంకోసం నకనక లాడిపోయి డెక్కుమీదకి వెళ్లాడు. రాత్రి సమయం. ఊగుతూ వుండే నల్లని నీటి వారే నక్షత్రాలూ, కొయ్యల్ని వేలాడే లాంతరు దీపాలూ నిద్రపోతున్నాయి. గాలి చెక్కిలి అంత నునువెచ్చగా వుండి, సముద్రపు వాసనని మోసుకు వస్తోంది. గ్రే తల పైకి యెత్తి నక్షత్రపు మెరిసే బంగారు బొగ్గు కేసి ఓరగా చూశాడు. తక్షణం, తల తిరిగి పోయేటంత ఆ దూరంనుంచి ఒక సుదూర గ్రహపు వాడి సూది అతని కనుపాపల్లో గుచ్చుకొంది. సాయంత్రం వేళ పట్టణపు మూక ధ్వని అగాధపు లోతులనుంచి అతని చెవులకి అందుతోంది. ఒకో అప్పుడు ఒక పదబంధం ఒడ్డునుంచి నీటి తాలూకు కంపించే ఉపరితలంమీద గాలిలో తేలుతూ వస్తోంది. డెక్కుమీదనే మాట్లాడుతున్నట్టుగా అది స్పష్టంగా వినిపిస్తుంది. అప్పుడు మళ్లీ మోకుల రాపిడిలో మణిగిపోతుంది. ముందుతట్టు డెక్కుమీద అగ్గిపుల్ల వెలిగింది, ఒక చేతిని, ఒక జత గుండ్రని కళ్లని, మీసాన్నీ కనిపింప చేస్తూ. గ్రే యీల వేశాడు. వెలిగించిన ఆ పైపు కదిలి అతని వేపే తేలుతూ వచ్చింది. త్వరలోనే కేప్టెన్ పహారా వుండే ఆ మనిషి చేతుల్నీ, ముఖాన్నీ గుర్తుపట్టాడు.

''లెతికాతో చెప్పు నాతో తను వస్తున్నట్టు'' అన్నాడు గ్రే. ''చేపలు పట్టే సరంజామా అంతా తీసుకు రమ్మని చెప్పు.''

అతను తెడ్లతో తోసే పడవలోకి వెళ్లి లెతికాకోసం పది నిముషాలు నిరీక్షించాడు. లాఘవంగానూ, మోసపు చూపులు చూస్తూనూ వుండే యువకుడు తెడ్లని గ్రేకి అందిస్తూ పక్కలకి తాటించాడు, పడవలోకి దిగి తెడ్లరింగుల్లో వాటిని బిగించి, సామాన్లు పెట్టిన సంచీని పడవ వెనకతట్టు తగిలించాడు. గ్రే చుక్కానీ దగ్గర కూర్చున్నాడు.

''ఎక్కడికి, కేప్టెన్?'' కుడి తెడ్డుతో మాత్రమే ఒక వర్తులాకారపు సుడి తిప్పుతూ లెతికా అడిగాడు.

కేప్టెన్ నిశ్శబ్దంగా వున్నాడు. ఆ నిశ్శబ్దంలోకి యెవరూ చొచ్చుకుపోలేరని ఆ నావికుడికి తెలుసు. అందుచేత తమూ నిశ్శబ్దంగా అయిపోయి వేగంగా తెడ్లతో పడవని నడపడం మొదలెట్టాడు.

గ్రే సముద్రంమీదకి పడవ గతిని నిర్దేశించి, తర్వాత యెడమ ఒడ్డు వారే పోనిచ్చాడు. ఎక్కడికి పోతున్నదీ అతను పట్టించుకోలేదు. చుక్కానీ దుబదుబలాడింది. తెడ్లు కీచుమంటూ నీళ్లని చిమ్ముతున్నాయి. మిగిలిందంతా సముద్రమూ, నిశ్శబ్దమూనూ.

ఒక రోజులో ఒక మనిషి యెన్నో ఆలోచనలు, అనుభూతులు, ఉపన్యాసాలు, మాటలు వింటాడు. అన్నీ కలిపితే ఒక పెద్ద ఉద్గ్రంథం అవుతాయి. కాపరం చేసే అందం కాళ్ల దగ్గర కనిపిస్తుంది. దినపు ఆరంభమే ఒక వ్యక్తీకరణ ధరిస్తుంది. కాని యీ రోజున గ్రే యీ ఆరంభాన్ని నిష్ఫలంగా వెదికాడు. దాని మసక కవళికలు, ఎన్నో ఉద్రేకాలలో, ఒక దాంతో వెలిగాయి. కాని ఆ ఉద్రేకాలకి పేరు లేదు. సరే, వాటిని యే పేర్లుతో పిలిస్తే యేంగాని అవి యెన్నటికీ మాటలకీ, యింకా చెప్తే భావనలకీ కూడా, అవతల అందకుండానే వుండిపోతాయి, ఒక పరీమళపు స్పర్శ లాగా. గ్రే యిప్పుడు అలాంటి ఒక ఉద్రేకపు కృపకు బద్ధుడై వున్నాడు. నిజమే అతను అనివుండచ్చు: "నేను నిరీక్షిస్తున్నాను. చూస్తున్నాను. త్వరలోనే నేను తెలుసుకుంటాను." కాని యీ మాటలు కూడా నిర్మాణాకృతి భావనకి సంబంధించి విడి రేఖాచిత్రాలకి మించిన సమానతతో లేవు. కాని, యీ భావాల్లో దీప్తవంతమైన ఉద్వేగశక్తి వుంది.

ఎడమ వేపున ఒడ్డు చీకటి ముద్దగట్టిన అలలాగా వుంది. పొగ గొట్టాల్లోంచి రవ్వలు కిటికీల ఎరుపు అద్దంమీద నృత్యం చేస్తున్నాయి. అది కపేర్నా. అరుపులు, కేకలు, మొరుగులు విన్నాడు గ్రే. నిప్పుగది చిన్నచిన్న కంతలగుండా లోపల బొగ్గుమండుతున్నట్టుగా మనకి కనిపించేటట్టు గ్రామంలోని దీపాలు వెలుగుతున్నాయి. నిద్రపోయిన మనిషి వాస్తవంగా వున్నంతగా కుడి వేపున మహాసముద్రం వుంది. కపేర్నా దాటి గ్రే ఒడ్డుకి పడవని నడిపించాడు. నీళ్లు యిక్కడ మృదువుగా తాకుతున్నాయి. లాంతరు దీపం వెలిగించి నిటంగా వుండే కొండలోని పల్లాలనీ, మీద పొడుచుకు వచ్చిన తీనెలనీ చూశాడు. అతనికి ఆ జాగా నచ్చింది.

"మనం యిక్కడ చేపలు పడదాం" అన్నాడతను తెడ్లు వేసే అతని భుజం తడుతూ.

ఆ నావికుడు అస్పష్టంగా మూలుక్కున్నాడు.

"యిలాంటి కేప్టెన్‌తో ప్రయాణం చెయ్యడం నాకు యిదే మొదటిసారి" అని గొణుక్కున్నాడు. "తెలివైన కేప్టెనే. కాని మామూలు రకం కాదు. గట్టి కేప్టెన్. యేమైనా అతనంటే నాకు యిష్టమే."

అతను తెడ్డు బురదలో కూరేసి దానికి పడవని కట్టేశాడు. వాళ్లిద్దరూ రాళ్లమీద పాకారు, వాళ్ల మోకాళ్ల కిందనుంచీ, మోచేతులకిందనుంచీ రాళ్లు దొర్లిపోయాయి. కొండపైన దట్టంగా చెట్లున్నాయి. ఎండు కొండాన్ని కొడుతూ వుండే గొడ్డలి చప్పుడు వినిపించింది. చెట్టుని పడగొట్టి లెతికా కొండమీద భోగిమంటలా మంట వేశాడు. నీడలు కదిలాయి, జ్వాలలు నీళ్లల్లో ప్రతిఫలించాయి. వెనకనున్న చీకట్లో గడ్డీ, కొమ్మలూ నిలిచి వున్నాయి. గాలి, పొగతో కలిసి, మంటమీద తళతళలాడి మెరిసింది.

గ్రే మంట పక్కనే కూర్చున్నాడు.

"యిదిగో" అన్నాడతను ఒక సీసాని ముందుకు చాస్తూ. "మిత్రమా, లెతికా, మధువు ముట్టని వాళ్ల అందరికోసం తాగు. సరే గాని, నువ్వు తెచ్చిన వోద్కా అల్లం సువాసనతో వుంది, క్వినైన్‌తో గాదు."

"పొరపాటైపోయింది, కేప్టెన్" అన్నాడా నావికుడు, వూపిరి బిగపట్టి. "మీరేం అనుకోక పోతే దాంతో బాటు నేను యిది తింటా..." అని అతను కోడివేపుడు ముక్కని కొరికి వోట్లోంచి ఒక రెక్కని తీసి, కొన సాగించాడు: "మీకు క్వినైన్ యిష్టమని నాకు తెలుసు. చీకటిగా వుండింది, నేనేమో హడావుడి పడిపోయాను. అల్లం వుంది చూశారూ మనిషిని కటువు చేస్తుంది. ఎప్పుడు పోట్లాటకి దిగాల్సి వచ్చినా నేను అల్లం వోద్కా తాగుతాను."

కేప్టెన్ తింటూ, తాగుతూ వున్నంత సేపూ, నావికుడు అతనికేసి ఓరచూపులు చూస్తూనే వున్నాడు, ఆఖరికి, యిక వుండబట్టలేక అన్నాడు:

"ఏమండీ, మీరు చాలా గొప్ప కుటుంబం వారట, వాళ్లంటారు, నిజమేనా?"

"అదేమంత ముఖ్యమైన విషయం కాదులే, లెతికా. సరంజామా తీసుకుని, కావలిస్తే కాసేపు చేపలు పట్టుకో."

"మరి మీరు?"

"నేనా? తెలీదు. బహుశా. కానీ... తర్వాత."

సిబ్బందిని హుషారు చెయ్యడానికి తనకి చెయ్యి తిరిగిన విద్య అయిన కూనిరాగం తీస్తూ లెతికా తాడు విప్పాడు.

"తాడూ క్రాతోటే, ఝాటే పాడుగుది చేసీ, చివర్న కొక్కెం పెట్టే, హుషారుగా యీలేశాను" ఎరల డబ్బాలో వెతికాడు "యీ పెద్ద పురుగు కంతలో హాయిగా వుండింది, యిప్పుడు నేను దీన్ని కొక్కేనికి తగిలిస్తున్నానూ, యిప్పుడు బేడిసలు నాకు రుణపడి వుంటాయి."

ఆఖరికి అతను పాడుకుంటూ వెళ్లిపోయాడు: "వెన్నెల వుంది, వోద్కా బాగుంది, చేపల్లారా వినండి, మీ దగ్గర కొస్తున్నాను. క్రమీనుల్లారా — తూలిపొండి, బొమ్మిడాయిల్లారా — ఎర తగలండి, లెతికా యిక్కడకొచ్చాడు, చేపలు పడుతూ వున్నాడు."

గ్రే మంటపక్కనే, నీళ్లకేసీ, దానిమీద మంట ప్రతిఫలనంకేసీ చూస్తూ పడుకున్నాడు. అతను ఆలోచిస్తున్నాడు. కాని ప్రయత్నరహితంగానే; యీ పరిస్థితిలో చుట్టూతా వున్న వాటిని పరధ్యానంగానే పరిశీలిస్తున్నా ఎవరి మనసేనా గానీ వాటిని అస్పష్టంగా అర్థం చేసుకుంటుంది. తోసుకుంటూ వచ్చే మందలో అణగదొక్కేస్తూ, పక్కకి లాగేస్తూ, ఆగుతూ మావి గుర్రంలాగా అది దూసుకువస్తుంది. శూన్యం, అయోమయం, ప్రతీక్ష ఒక దాని తర్వాత ఒకటి వస్తాయి. అది వస్తువుల అంతస్తత్వంలో చరిస్తుంది. ప్రకాశ మానమైన ఆందోళననుంచి నిగూఢ అవబోధకి వేగిర పడుతుంది; నింగినుంచి నేలదాకా చరిస్తూ వూహాత్మక వ్యక్తులతో జీవితం అనే విషయాన్ని చర్చిస్తూ, జ్ఞాపకాలని తుడిచిపెట్టేస్తూనూ, అలంకరిస్తూనూ వుంటుంది. యీ మేఘావృత చలనంలో అంతా సజీవమే, స్పర్శగ్రాహకమే, అంతా ఒక భ్రాంతి లాగా బులబులాగ్గా తగిలి వేలాడుతూ వుంటుంది. ఉదాహరణకి, అస్సలు రానవకాశం లేని వూహ వల్ల ఒకరి జీవిత ఆలోచనలు హఠాత్తుగా అభినందితం కావడంతోటే తేలిక పడే చైతన్యం తరుచుగా చిరునవ్వు నవ్వుతుంది: బహుశా రెండేళ్లక్రితం విరిగిన కొమ్మ గురించిన వూహవల్ల. ఆ రకంగా గ్రే మంట పక్కన ఆలోచిస్తూ కూర్చున్నాడు, కాని అతను "ఎక్కణ్ణో" వున్నాడు — అక్కడ కాదు.

తల ఆన్చుకున్న అతని మోచెయ్యి చెమ్మగా అయి, తిమ్మిరెక్కింది. నక్షత్రాలు నీరసంగా మిణుకు మంటు న్నాయి. ప్రభాతానికి ముందు వచ్చే బిగువువల్ల చీకటి తీవ్రం అయింది. కేప్టెన్ కునుకు తీస్తున్నాడు, కాని దాన్ని గుర్తించలేదు. అతనికి కాస్త తాగుదామని పించింది, అతను చేతిని సంచీకేసి, దాన్ని నిద్రలోనే తెరుస్తూ, చాచాడు. అప్పుడు కల గనడం మానేశాడు. ఆ తర్వాత రెండు గంటలూ అతనికి రెండు క్షణాలకంటే దీర్ఘం అనిపించలేదు. ఆ సమయంలో అతను చేతులమీద తల పెట్టుకుని నిద్రపోతున్నాడు. యీ లోపున లెతికా మంటదగ్గరికి రెండు సార్లు వచ్చాడు, అతను చుట్టకాల్చాడు. కుతూహలం కొద్దీ అక్కడ యేం వుంటుందా అనుకుంటూ తను పట్టుకున్న చేపల వోళ్లల్లోకి చూశాడు. మరి, సహజంగావే, యేమీ లేదు.

నిద్రలేచాక, గ్రే తను వున్న ఆ చోటికి రావడం యెలా జరిగిందా అని ఓ క్షణం మర్చిపోయాడు. అతను ఆశ్చర్యంతోటి ప్రత్యూషపు ఉల్లాస ప్రకాశాన్నీ, కాంతివంతమైన కొమ్మలతో అలంకృతమైన కొండనీ,

మండే నుదూర నీలిమనీ పరకాయించాడు. ఒక హేజెల్ గుబురు ఆకులు దిఙ్మండలంమీద వేలాడుతున్నాయి, తన కాళ్ల దగ్గిరా వేలాడుతున్నాయి. కొండ దిగువున—అది సరిగ్గా తన వెనకాలే అయినట్టు గ్రేకి అనిపించింది—అలలు మెల్లిగా తాకుతున్నాయి. ఒక ఆకుమీదనుంచి జారి ఒక మంచు బిందువు అతని నిద్రమత్తు మొహంమీద చల్లగా టపామని పడింది. అతను లేచాడు. నాలుగు వేపులా వెలుతురు పరుచుకుంది. భోగిమంట తాలూకు చల్లారే కట్టెలు పొగ నులితీగతోటి జీవితాన్ని అంటిపెట్టుకుని వున్నాయి. పచ్చని అడవుల గాలిని పీల్చే సంతోషానికి భోగమంట సువాసన ఘాటుకలిగిస్తోంది.

లెతికా కను చూపు మేరలో యెక్కడా లేదు. అతను అన్నిటికీ మరుపైపోయాడు. సినల్లైన జూదరి ఉత్సాహంతోటి చేపలు పట్టి అతను చెమటలు కక్కాడు. గ్రే అడివిని వొదిలిపెట్టి పాదలు పరుచుకున్న యేటవాలు కేసి వెళ్లాడు. గడ్డినుంచి పొగలేస్తోంది, మండుతోంది. బలవంతంగా చన్నీళ్లతో తోమిన పిల్లల్లా వున్నాయి చెమ్మ తగిలిన పువ్వులు. ఆకుపచ్చ ప్రపంచం వేలవేల చిన్ని నోళ్లతో శ్వాసిస్తోంది, తన ఆహ్లాదకరమైన గుత్తితో గ్రే పథాన్ని అడ్డగిస్తూ. గడ్డీ, పువ్వులూ కమ్మిన ప్రదేశంకేసి ఆఖరికి ఆ కేప్టెన్ చేరాడు, అక్కడ నిద్రించే ఒక అమ్మాయిని చూశాడు.

అతను జాగ్రత్తగా ఒక కొమ్మ పక్కకి వెళ్లి ఆగాడు తను ఒక ప్రమాదకరమైన ఆవిష్కరణని చేసినట్టు. ఒక కాలు ముడుచుకుని, యింకో కాలు చాచుకుని, సౌకర్యంగా మడుచుకున్న చేతులమీద తల ఆన్చి అయిదడుగుల దూరంలోనే వుంది అలిసిపోయిన అస్సోల్. ఆమె జుట్టు చెదిరిపోయి వుంది; ఆమె కాలరు దగ్గర ఒక బొత్తాం వూడిపోయింది, తెల్లటి పల్లాన్ని వెల్లడి చేస్తూ. లుంగ చుట్టుకుపోయిన గౌనుకింద మోకాళ్లు బయటికి కనిపిస్తున్నాయి. నల్లని వెంట్రుకతో సగం కప్పేసి సున్నితంగా వంపు తిరిగిన కణతల నీడలో చెక్కిలిమీద ఆమె పక్ష్మాలు నిద్రిస్తున్నాయి. తలకింద వున్న ఆమె కుడి చెయ్యి వెనక యిరుగ్గా వుండే నావలా తల వెనక వంపు తిరిగింది. గ్రే మఠం వేసి కూర్చుని కింద నుంచి ఆమె ముఖంలోకి చూశాడు, తను ఆర్నాల్డ్ బాక్లిన్ చిత్రంలో పాన్ని పోలివున్నాడని అనుమానం లేకుండా.

బహుశా వేరే పరిస్థితుల్లో అతను ఆ పిల్లని తన కళ్లతో మాత్రమే చూసి వుండేవాడు, కాని యిప్పుడు భిన్నంగా చూశాడు. ప్రతీదీ కదిలింది, ప్రతీదీ అతనిలో చిరునవ్వునవ్వింది. మరి అతనికి ఆమె ఎవరో తెలీదు, ఆమె పేరు తెలీదు, పైగా, ఆమె ఆ ఒడ్డున యెందుకు పడుకుందో తెలీదు. కాని అతనికి యిది సంతోషం కలిగించింది. ఒక తాత్పర్యం గాని, పేరు గాని లేకుండా అనుసరించి వచ్చిన చిత్రాలు అతనికి యిష్టం అయ్యాయి. అలాంటి చిత్రం వేసే ముద్ర చాలా శక్తివంతమై వుంటుంది. దాని విషయం మాటల భారం లేకుండా సకల కల్పనలనీ, భావాల్నీ రూఢం చేస్తూ అవధిలేని దవుతుంది.

ఆకులు పరచిన నీడ కాండాలదాకా వస్తోంది, కాని గ్రే యింకా అక్కడే, అదే యిబ్బందికర భంగిమలోనే కూచున్నాడు. ఆ పిల్లలో వున్న ప్రతీదీ నిద్రిస్తోంది. ఆమె రాగి జుట్టు నిద్రిస్తోంది; ఆమె దుస్తులు నిద్రిస్తున్నాయి, ఆమె గౌను కుచ్చిళ్లల్లాగానే; ఆమె దేహానికి దగ్గర్లో వున్న గడ్డి కూడా, సానుభూతి పూర్వకంగా నిద్రపోతున్నట్టుంది. ఆ అనుభూతి పూర్తికాగానే గ్రే దాని నును వెచ్చని, ముంచివేసే తరంగాలమీద పడి, అలా తేలిపోయాడు. లెతికా కొంచెం సేపట్నుంచి అరుస్తున్నాడు: "కేప్టెన్, ఎక్కడున్నారు?" అని. కాని ఆ కేప్టెన్కి అతని మాటలు వినిపించడంలేదు.

అతను కడకి లేచేటప్పటికి, ఆగ్రహించిన ఆడదాని ఉత్తేజంతోటీ, నిశ్చయంతోటీ అసాధారణమైన దానిపట్ల అతని పక్షపాతం అతన్ని అనుకోకుండా నిలబెట్టేసింది. దానికి సాలోచనగా లొంగిపోతూ అతను తన వేలినుంచి విలువైన పాత ఉంగరాన్ని తీసివేశాడు; బహుశా ఆ రకంగా తను జీవితానికి అత్యవసరమైందాన్ని, సంప్రదాయ సిద్ధ వర్ణక్రమ సమమైందాన్నీ, తగినంత కారణంతోనే, సూచిస్తున్నట్టు భావించాడు. ఆమె తల వెనక

 కింద తెల్లగా కనిపించే చిన్న పడవలాంటి చేతిలో అతనా ఉంగరాన్ని జారవిడిచాడు. ఆ పడవ విసుగుచెందినట్టుగా మెలిపడి ముడుచుకుపోయింది. నిర్దిష్టాన్న ఆ ముఖంకేసి యింకో సారి చూసి, గ్రే వెనుదిరిగి తీక్ష్ణంగా పైకి యెత్తిన నావికుని కనుబొమల కేసి చూశాడు. కేప్టెన్ చర్యలని అమరిగ్గా వున్న తిమింగిలం పొట్టలోకి జోనా — చూసినట్టు* తన యజమాని చర్యలని ఆశ్చర్యంగా గమనిస్తూ వున్న లెతికా అలా చూస్తూ నోరు వెళ్లబెట్టి వున్నాడు.

''ఓ, నువ్వా, లెతికా! ఆమెకేసి చూడు. అందంగా లేదూ?''

''అనిదంపూర్వమైన చిత్రం!'' అన్నాడా నావికుడు మెల్లిగా, యేమంటే అతనికి గ్రంథస్థ పదబంధాలంటే యిష్టం. ''యీ పరిస్థితుల సమర్పణంలోనే మనోహరం అయింది యేదో వుంది. నేను నాలుగు మోరేలని తిత్తిలాగా గుండ్రంగా వుండే యింకో దాన్ని పట్టాను.''

''ష్, లెతికా! వెళ్లిపోదాం యిక్కణ్నుంచి.''

వాళ్లు పొదల్లోకి వెనక్కి వెళ్లిపోయారు. వాళ్లి పాటికి తెడ్ల పడవ దగ్గరికి వెళ్లిపోయి వుండాల్సింది. కాని గ్రే, దూరంలోని పల్లపు ఒడ్డుకేసి, ప్రాతఃకాలపు కపేర్నా యిళ్ల పొగగొట్టాల్లోని పొగ, యినకమీదనుంచీ, పచ్చటి ప్రదేశంమీదనుంచీ గాలిలో తేలిపోతూ వుంటే చూస్తూ వుండిపోయాడు. ఆ పొగలో అతను మళ్లీ యింకోసారి ఆ పిల్లని చూశాడు.

అప్పుడతను నిశ్చయం చేసుకున్నట్టుగా తిరిగి, ఏటవాలు మీదనుంచి కిందకి దిగిపోయాడు. ఆ నావికుడతన్ని ఏం జరిగిందీ అని ప్రశ్నించలేదు, వెనక్కాల వెళ్లాడంతే. మళ్లీ యింకోసారి విధిగా నిశ్శబ్దం రాబోతోందని అతను గ్రహించాడు. అప్పుడు వాళ్లు మొదటి యిళ్లని సమీపించగానే గ్రే వున్నట్టుండి అన్నాడు:

''అరితేరిన నీ దృష్టితో చూసి సారాయి దుకాణం యెక్కడ వుందో చెప్పగలవా, లెతికా?''

''అది ఆ నల్లని కప్పున్నదే అయివుండాలి'' అని, ఆలోచించి ''యేమో, కాకపోతే కాకపోనూ వచ్చు.''

''కప్పుకి సంబంధించి అంత విశిష్టత యేమిటి?''

''నాకు నిజంగా తెలియదు కేప్టెన్. నా అంతరాత్మ చెప్పింది తప్ప యెక్కువ యేమీ తెలీదు.''

వాళ్లా యింటిని సమీపించారు; అది నిజంగానే మెన్నెర్స్ సారాయి దుకాణం. తెరిచిన కిటికీగుండా వాళ్లకి బల్ల మీద సీసా కనిపించింది. దాని పక్కనే యెవరిదో మురికి చెయ్యి తెల్లగా పండిన మీసాన్ని దువ్వుకుంటోంది.

అప్పుడే తెల్లారినా కూడా, ఉమ్మడి గదిలో ముగ్గురు మొగాళ్లు చేరారు. యిప్పుడే అనుకున్న తెల్లని మీసం వున్న బొగ్గులమ్మే అతను కిటికీ వార కూర్చున్నాడు; యిద్దరు బెస్తవాళ్లు బారుకీ లోపలిగదికీ మధ్యన యేర్పాటుచేసిన బల్ల దగ్గర చెదిరివున్న గుడ్లూ, బీరూ చుట్టూతా కూర్చున్నారు. పొడుగ్గా, మచ్చలున్న ముఖంతోటి, హ్రస్వ దృష్టి వున్న కళ్లల్లో, సామాన్యంగా వ్యాపారస్థులందరికీ వుండే ప్రత్యేక లక్షణమైన ధైర్యమైన మోసపు చిత్రభావం వున్న యువకుడైన మెన్నెర్స్ కౌంటర్ వెనక్కాల ప్లేట్లు తుడుస్తున్నాడు. మురికి నేలమీద కిటికీ చట్రం నీడ ముద్ర ఎండలో పడుతోంది.

గ్రే యీ పొగచారిన వెలుతురు జాగాలోకి వచ్చీ రాగానే మెన్నెర్స్ సగౌరవంగా అభివాదం చేసి బద్దీ వెనకనుంచి యివతలికి వచ్చాడు. గ్రేలో అతనికి తక్షణం నిజమైన కేప్టెన్ భాసించినట్టైంది — యెప్పుడో గాని ఆ బాపతు ఖాతాదారు అక్కడ దర్శనం యివ్వడు. గ్రే రమ్ తెమ్మని పురమాయించాడు. దైనందిన జీవితపు సందోహంలో పసుపురంగు తిరిగిన గుడ్డని తెచ్చి, బల్లమీద, పరిచి మెన్నెర్స్ ఒక సీసా తెచ్చాడు. కాని దాని లేబిల్ ఒక మూల వూడొస్తే దాన్ని నాకి అతికించాడు. తర్వాత మెన్నెర్స్ కౌంటర్ వెనక్కి

---

* బైబిల్ పాతగ్రంథం కథ. — అను.

వెళ్ళిపోయాడు. అతను తదేక దృష్టితో కాసేపు గ్రే కేసీ, కాసేపు తను పొడి భోజన పదార్థపు తునకని తీసుకుంటూ వుండే ప్లేటుకేసీ చూస్తూ వుండిపోయాడు.

లెతికా· చేతుల మధ్య గ్లాసు యెత్తిపట్టి దానితో మెల్లిగా ముచ్చట్లాడుతూ కిటికీ అవతలకి చూస్తూ వుండగా గ్రే హిన్ మెన్నెర్ప్‌ని పిలిచాడు. హిన్ ఒకరకమైన సంతృప్తితోటి కుర్చీ అంచున కూర్చున్నాడు. పిలిచినందుకు పొంగిపోయాడు, మరీ ముఖ్యంగా గ్రే ఒకవేలు వంచి అలా చెయ్యడంతోటి పొంగిపోయాడు.

''మీకు యిక్కడ స్థానికంగా వుండే వాళ్ళంతా తెలుసనుకుంటాను'' అన్నాడు గ్రే నిదానంగా. ''రుమాలు చుట్టుకుని, గులాబీ పువ్వుల బట్టలు వేసుకుని, రాగి జుట్టుతోటి సామాన్యమైన యెత్తు, పదిహేడు ఇరవై సంవత్సరాల మధ్య వయసు వున్న అమ్మాయి యెవరో తెలుసుకోవాలని వుంది. యిక్కడికి దగ్గరలో ఆమెని చూశాను. ఆమె పేరేమిటి?''

అతను బింకంగా నిబ్బరమైన సాదాతనంతో మాట్లాడేడు. అతని స్వరాన్ని తప్పించుకోవడం అసాధ్యం. హిన్ మెన్నెర్ప్ లోపల గింజుకున్నాడు, కొద్దిగా వికారపు నవ్వు కూడా నవ్వేడు, కాని పైకి అతను మన్ననగానే వున్నాడు. యేమైనా సమాధానం చెప్పేముందు సంకోచించాడు — అదేనా అనలేమిటి జరుగుతుందా అని వూహించాలనే వ్యర్థ కోరికవల్ల.

''హుమ్'' అన్నాడతను పెంఢకేసి పైకి చూస్తూ. ''అది లోక సంచారి నౌక అస్సాల్ అయివుంటుంది. దానికి మతి లేదు.''

''నిజమా?'' అన్నాడు గ్రే పట్టించుకోనట్టు, పెద్ద గుక్క తాగి. ''ఆమె అలా యెందుకు వుంది?''

''మీకు నిజంగా తెలుసుకోవాలని వుంటే చెపుతా.'' — ఏడేళ్ళక్రితం ఆ పిల్ల సముద్రం ఒడ్డున జానపద గేయాలు పోగుచేసే మనిషిలో ఆమె మాట్లాడిన కాలాన్ని గురించి హిన్ గ్రేకి చెప్పాడు. యీ కథ, ఆ ముష్టి వాడు సారాయి దుకాణంలో మొదట చెప్పిందగ్గర్నుంచీ వికారంగా అసహ్యమైన పుకారుగా తయారైంది, కాని సారంలో మాత్రం మారకుండానే వుండిపోయింది.

''అందుకని అప్పట్నుంచి ఆమెని అలానే పిలుస్తారు'' అన్నాడు మెన్నెర్ప్. ''ఆమెని లోక సంచారి నౌక అస్సాత్ అంటారు.''

గ్రే అప్రయత్నంగా లెతికాకేసి చూశాడు. అతను యింకా మెల్లిగా అణకువగానే వున్నాడు. అప్పుడు గ్రే దుకాణం బయటి మట్టి రోడ్డుకేసి చూసి, పిడుగు పడ్డట్టు — గుండెకీ బుర్రకీ రెండు దెబ్బలు తగిలి నట్లు అయాడు. రోడ్డుమీద తనకేసే వస్తున్నది అదే లోక సంచారి నౌక అస్సాల్, మెన్నెర్ప్ అప్పుడే చికిత్సా త్మక దృక్పథంనుంచి వర్ణించిన ఆమె. మరువు రాని, కదిలించేటటువంటి, అయినా సాదా మాటలని పోలి కొట్ట వచ్చినట్టు కనిపించే ఆమె ఆకారరేఖలు ఆమె చూపు కాంతిలో అతనికి ద్యోతకమయ్యాయి. ఆ వావికుడి వీపూ, మెన్నెర్పు వీపూ, కిటికీకేసి వున్నాయి, వాళ్ళు యాదృచ్ఛికంగా యిటు తిరక్కుండా వుండేందుకని గ్రే లేత యెరుపు కలిసిన పసుపు వర్ణం వున్న హిన్ కళ్ళల్లోకి చూసే ధైర్యం చేశాడు. అతను అస్సాల్ కళ్ళల్లోకి చూశాక మెన్నెర్ప్ కథలోని దురభిప్రాయం అంతా కొట్టుకుపోయింది. యీ లోపున అనుమానం తోచకుండానే హిన్ చెప్పుకుపోతున్నాడు:

''అసలు దాని తండ్రి సిసలైన తొత్తు కొడుకండి. వాడు మా అయ్యని పిల్లో మరేమిటో అయినట్టుగా ముంచేశాడు. దేవుడు మన్నించుగాక. వాడు...''

వెనకనుంచి అనుకోకుండా వెర్రిగా వచ్చిన కేక అతని ధోరణికి అంతరాయం కలిగించింది. కళ్ళు భయం కరంగా పెట్టి, తాగుడుమత్తు వదిలించుకున్న బొగ్గుల మనిషి వున్నట్టుండి గొడవగా వుండే పాటని అందు కున్నాడు. కాని యెంత గట్టిగానంటే ప్రతివాళ్ళనీ ఎగిరేటట్టు చేసింది అది.

"మేదరవాడా మేదరవాడా
మమ్మల్ని వొలుచు బుట్టలకోసం!"

"మళ్లీ తాగి పేలుతున్నావ్, తిమింగిలం పడవగాడా, ఫో అవతలికి" అని మెన్నెర్స్ అరిచాడు.

"కానీ, భద్రం పడతావు
తిన్నగా నీ బుట్టల్లోకే!"

బొగ్గుల మనిషి మళ్లీ గోల చేశాడు. పిసరు కూడా పోగొట్టుకోకూడదన్నట్టు మీసాలని సారాయి గ్లాసులోకి ముంచాడు.

హిన్ మెన్నెర్స్ కోపంగా భుజాలు వూపాడు.

"యీ భూమ్మీద పరమ మడ్డి వెధవ వీడు" అన్నాడతను లోభిలాంటి కుటిల ఘనతతోటి. "ప్రతి సారీ యిలాగే జరుగుతుంది!"

"మీరు యింకా యేదేనా చెప్తారా?" అని అడిగాడు గ్రే.

"నేనా? నేనిప్పుడే చెప్పాను కదా వాళ్ల నాన్న తొత్తు కొడుకని. వాడివల్ల నేనండి, అయ్యా, నేను తండ్రి లేని వాణ్ణయ్యాను. చిన్నప్పటినుంచీ పొట్టకూటికి సంపాదించుకోవాల్సి వచ్చింది, కష్టించి చెమటోడ్చి పన్జేసి."

"నువ్వు కోస్తున్నావ్!" అని అరిచాడు అనుకోకుండా బొగ్గుల మనిషి. "నువ్వు శుద్ధ, పరమ అబద్ధం చెపుతున్నావ్, దానివల్లనే నా మత్తు పోయింది."

హిన్ యింకా మాట్లాడ్డానికి నోరు తెరవకముందే, బొగ్గుల మనిషి గ్రేతో అన్నాడు:

"వాడు కోస్తున్నాడు. వాళ్ల నాన్నా అబద్ధాల కోరే, వాళ్ల అమ్మానూ. అది వాళ్ల కుటుంబంలోనే వుంది. వొట్టేదండి, ఆమె మీ అంత, నా అంత తెలివి వున్నదే. నేనామెతోటి మాట్లాడాను. ఆమె నా బండిలో ఎనభై నాలుగు సార్లో, యే కొంచెం తక్కువో ఎక్కింది. బస్తీనుంచి యే పిల్లేనా యింటికి నడుచుకుంటూ వస్తూ వుంటే, నేను బొగ్గు అంతా అమ్మేసినప్పుడు యెప్పుడూ నేను నా బండిలో యెక్కించుకుంటాను. ఆమె తోలగలదు. నేను చెప్పేదేమంటే ఆమె మెడకాయమీద తలకాయ తెలివి వున్నదే. మీరిప్పుడే ఆ సంగతిని చూద్దురు గాని. మీతో ఆమె యెన్నడూ మాట్లాడదు, హిన్ మెన్నెర్స్, సహజమే. కాని నాకు సంబంధించి, అయ్యా, మా స్వేచ్ఛా బొగ్గుల వ్యాపారంలో చెవులు కొరుక్కోవడం, పుకార్లు అంటే నాకసహ్యం అండి. ఆమె పెద్ద వాళ్లల్లాగే మాట్లాడుతుంది, కాని మాట్లాడే తీరు కొంచెం యాసగా వుంటుంది. కొంచెం జాగ్రత్తగా వింటే — మీరూ, నేనూ చెప్పేదానిలాగానే వుంటుంది, వుంటుంది కూడానూ, కాని కాదు. మాటకి మేం ఆమె పనిని గురించి మాట్లాడుతున్నాం. 'నేను ఒకటి చెపుతాను' అంది, నా భుజాన్ని గడియారం గోపురంమీద యీగలాగా పట్టుకుని, 'నా పని నిరుత్సాహంగా లేదు, కాని ప్రత్యేకమైంది దేనికోసమో చూస్తూ వుంటాను. నిజంగా తనే నీళ్లమీద తేలి వెళ్లిపోయే పడవని, నిజంగా తెడ్లు వేసేవాళ్లతోటి తయారుచెయ్యాలనుకుంటు న్నాను. అప్పుడు వాళ్లు దాన్ని ఒడ్డున నిలిపి, కట్టేసి, తీరంమీద కూర్చుని ఎర కొరకడం కోసం చూస్తూ వుంటారు, నిజంగా ప్రాణం వున్నట్టు.' నేను నవ్వాను, యేమంటే అది అంత తమాషాగా వుంది. అంచేత నేను అన్నాను 'సరే, అస్సోల్, యిదంతా కూడా నువ్వు చేసే పని వల్లననుకో, అందుకనే నువ్వు అలా అనుకుంటున్నావు కాని చుట్టూ చూడు, మిగతా వాళ్లు పని చేసే పద్ధతిని చూడు, వాళ్లు పోట్లాడుకుంటున్నారను కుంటావ్.' 'వుహుఁ,' అంటుంది ఆమె. 'నాకేం తెలుసో నాకు తెలుసు. చేపలు పట్టేవాడెవడేనా చేపలు పట్టేటప్పుడు

తనో పెద్ద చేపని పడతాననే అనుకుంటాడు, యెవళ్ళూ యిదివరలో పట్టనంత చేపని పడతాననుకుంటాడు.' 'నా-సంగతేమిటి?' 'నువ్వా?' ఆమె నవ్వింది. 'నువ్వు నీ బుట్టని బొగ్గుతో నింపినప్పుడు అది విరగపూస్తుందని నువ్వు అనుకుంటావు' అనే మాటలు ఆమె వాడింది! ఆ క్షణమే, నిజం చెప్తున్నా, మరి యేది నన్ను అలా చేసిందో తెలీదు, నేను కాళీ బుట్టలోకి చూసి బుట్ట తడకలనుంచి మొగ్గలు కనిపిస్తున్నట్టే నిజంగా అనుకున్నాను. మొగ్గలు విరగపూసి, బుట్టంతా ఆకులు పరుచుకున్నట్టయి మాయమై పోయాడు. నాకు కొంచెం మత్తు తగ్గింది కూడానూ! కాని హిన్ మెన్నెర్స్ వచ్చి అబద్ధాలు, జంకు లేకుండా — నాకు తెలుసు వాడి సంగతి!''

సంభాషణ అవమానకరమైన మలుపు తీసుకుంది స్పష్టంగానని మెన్నెర్స్ గుర్తించి బొగ్గుల మనిషి కేసి మింగేసేటట్టు చూసి కౌంటర్ వెనక్కి వెళ్లిపోయాడు. అక్కణ్ణుంచి కసిగా అడిగాడు: ''యింకా యేమన్నా కావాలా మీకు?''

''అక్కర్లేదు'' అన్నాడు గ్రే పర్సు తీస్తూ. ''మేం లేచి వెళ్లిపోతున్నాం. లెతికా, నువ్విక్కడ వుండు. సాయంత్రం తిరిగి రా, మరి యెదురు చెప్పద్దు. నువ్వు చూడగలిగిందంతా చూసి నాకు చెప్పు. అర్థమైందా?''

''ప్రియమైన కేప్టెన్‌గారూ'' అన్నాడు లెతికా రమ్ వల్ల వచ్చిన చనువుతోటి, ''మూగచెవిటి ముక్కి మాత్రమే దీన్ని అర్థం చేసుకోలేదు.''

''సెభాష్. జరగబోయే యేన్నో వాటిలో ఒక్క సందర్భంలో కూడా నన్ను గురించి ప్రస్తావించద్దు, నా పేరు కూడా చెప్పద్దు. సెలవు.''

గ్రే వెళ్లిపోయాడు. ఆ క్షణంనుంచి అతను ఆశ్చర్యజనకమైన ఆవిష్కరణల చైతన్యంతోటి, బెర్తోల్డ్ పొడుం కల్వంలోనుంచి రవ్వలేచినట్టు — నిప్పు చిమ్ముకుంటూ తనకిందనుంచి ఎగిరిపోయేటటువంటి ఆ ఆధ్యాత్మిక హిమశిలల్లో ఒకటి అయిన దాంతోటి, నిండిపోయాడు. తక్షణ కార్యాచరణ అనే కోరిక ఆవహించింది. తెడ్లపడవల్లోకి వెళ్లినాకనే అతను స్పృహలోకి వచ్చాడు, ఆలోచించగలిగాడు. నవ్వుకుంటూ అతను చెయ్యి చాచి మాడ్చేసే సూర్యునికడ్డంగా అరచేతిని పెట్టుకున్నాడు, తను పిల్లవాడిగా వున్నప్పుడు ఒకసారి నేల మాళిగలో చేసినట్టు. అప్పుడు లోపలికి పడవని తోసి ఓడరేవు దగ్గరికి తెడ్లతో నడుపుకుంటూ పోయాడు.

# ఆ సందర్భం

జానపద గేయాల సంకలనకర్త ఎగెల్ తీరంలో ఆ పిల్లకి ఎరుపు తెరచాపల నౌక గురించిన అద్భుత కథ చెప్పిన యేడేళ్ల తర్వాత, ఆ ముందు రోజు సాయంత్రం అస్సోల్ ఆటబొమ్మల దుకాణంనుంచి, తను మామూలుగా వారం వారం వెళ్లే ఆ చోటునుంచి, నిరుత్సాహంగా, విచారంగా కనిపిస్తూ తిరిగి యింటికి వచ్చింది. అమ్మడానికి తను తీసికెళ్లిన ఆటవస్తువుల్ని ఆమె తిరిగి తీసుకువచ్చింది. ఆమె యెంత చికాకు పడిపోయిందంటే మొదట మాట్లాడలేకపోయింది. కాని ఆత్రుతతో నిండిన లాంగ్‌రెన్ వదనాన్ని చూసి, అతను అసలు జరిగిందానికంటే అధ్వాన్నమైన వార్త వస్తుందనుకుంటున్నాడని గ్రహించి, ఆమె తను నుంచున్న పక్క కిటికీ రెక్కని వేళ్లతో తడుముతూ, పరధ్యానంగా సముద్రంకేసి చూస్తూ, మాట్లాడ్డం మొదలుపెట్టింది.

ఆటవస్తువుల దుకాణపు యజమాని యీసారి తన పద్దు పుస్తకం తీసి వాళ్లు తనకెంత బాకీ వున్నారో చూపెంచడం మొదలుపెట్టాడు. పంచలమీద, మనసుకు నాటుకునేట్టువున్న ఆ అంకెని చూసి ఆమె పొమ్మసిలి పోయింది.

''యిదీ మీకు డిసెంబరునుంచీ ముట్టిన మొత్తం'' అన్నాడు యజమాని. ''ఏం, ఎంత అమ్మకం అయిందో చూద్దాం.'' అతను యింకో అంకెమీదకి వేలు పోనిచ్చాడు. కాని అది పదుల సంఖ్యలోనే వుంది.

''చూడ్డానికి యెంత సిగ్గయిపోయిందో. అతని ముఖాన్ని బట్టి యెంత మొరటుగా, కోపంగా వున్నదీ గ్రహించాను. అసలు పరిగెత్తి పారిపోయేదాన్నే కాని యెంత సిగ్గేసిందంటే శక్తిపడిపోయింది. అతనింకా అన్నాడు: 'వీటిమీద లాభం రావడం లేదు, అమ్మాయ్. యిప్పుడు అంతా దిగుమతీ చేసుకున్న వస్తువులమీద వుంది మోజు. అన్ని దుకాణాలూ వాటితో నిండిపోయి వుంటున్నాయి, యిలాంటి వాటిని యెవళ్ళూ కొనడం లేదు.' అదీ అతను అన్నది. అతనింకా చెబుతూనే వున్నాడు గాని, నాకు తత్తర పాటయిపోయి యేం చెప్పాడో మర్చి పోయాను. అతను బహుశా జాలి పడివుంటాడు నామీద, యేమంటే నేను 'పిల్లల బజారు' లోనూ, 'అల్లా వుద్దీన్ అద్భుత దీపం' దగ్గర ప్రయత్నిస్తే మంచిదని సలహా యిచ్చాడు.''

అతిముఖ్యమైన ఆ విషయపు భారాన్ని తగ్గించుకుని ఆమె బెరుగ్గా ఆ ముసలతనికేసి చూసింది. లాంగ్‌రెన్ గూనిగా కూర్చున్నాడు, మోకాళ్ళమీద మోచేతులు ఆన్చుకుని, వేళ్ళు కట్టుకున్నాడు. తనమీద ఆమె చూపుల్ని గ్రహించి, తల యెత్తి నిట్టూర్చాడు. తన దిగులు తగ్గించుకుని ఆమె అతని వద్దకు పోయి, అతని పక్కన చేరి, అతని తోలు చొక్కా చేతులో తన చిన్న చేతిని పెట్టి, నవ్వుతూ, తండ్రి ముఖంకేసి చూసి, తెచ్చిపెట్టు కున్న ఉత్సాహంతోటి ఆమె చెప్పుకుపోయింది:

''పోన్లే. అదేమంత ముఖ్యం కాదు. యిప్పుడు విను. యేమైనా నేను వచ్చేశాను. ఏం, నేను ఆ పెద్ద భూతం లాంటి దుకాణం దగ్గరికి వెళ్ళాను. అబ్బో యేం జనం. మనుషులు నన్ను తోసేశారు, కాని యెలాగో తప్పించు కుంటూ లోపలికి వెళ్ళి కళ్ళద్దాలున్న నల్లని జుట్టాయన దగ్గరికి వెళ్ళాను. అతనితో ఏం చెప్పానో నాకు ఒక మాట గుర్తులేదు. కడకి, అతను సకిలించాడు, బుట్ట కెలికాడు, కొన్ని ఆటవస్తువుల్ని చూశాడు, వాటిని రుమాల్లో కట్టి మళ్ళీ తిరిగి యిచ్చేశాడు.''

లాంగ్‌రెన్ ఆమె చెప్పేది కోపంగా విన్నాడు. ఎన్నో మంచి వస్తువులు గుట్టగా వున్న అంగట్లో, డాబుగా దుస్తులు వేసుకున్న గుంపులో నిశ్చేష్టమై వున్న తన కూతుర్ని చూస్తున్నట్టే వున్నాడతను. కళ్ళద్దాలు పెట్టుకున్న సొగసైన మనిషి తను లాంగ్‌రెన్ ఆటవస్తువుల్ని అమ్మడానికి అంగీకరిస్తే దివాళా తీసేస్తానని వివరిస్తున్నట్టుంది. అతను ఆమె ముందు యథాలాపంగా, నేర్పుగా మడత పెట్టే యిళ్ళూ, రైలు రోడ్డు వంతెనలూ అమరుస్తున్నట్టుంది: చిన్నగ్గా, చక్కగా తయారుచేసిన కార్లు, ఎలక్ట్రిక్ వస్తువులు, విమానాలూ, మోటార్లూనూ. యిదంతా కూడా రంగువాసన, బడివాసన కొడుతున్నాయి. అతని ప్రకారం పిల్లలు యివాళ పెద్దల వృత్తుల్ని అనుకరించే ఆటలే ఆడుతున్నారు.

అప్పుడు అస్సోల్ ''అల్లావుద్దీన్ అద్భుత దీపం,'' యింకా రెండు దుకాణాలకి వెళ్ళింది కాని లాభం లేకపోయింది.

ఆమె తన కథ ముగించి సాయంత్రం భోజనాలు సర్దింది. తిని, చిక్కటి కాఫీ ఒక మగ్గు తాగి లాంగ్‌రెన్ అన్నాడు:

''మనకి అదృష్టం పోయింది కాబట్టి మనం వేరే యింకోటి మొదలుపెట్టాలి. నేను మళ్ళీ ఓడ పనిలో చేరతాలే — 'ఫిట్స్‌రాయ్' మీదగాని 'పాలేర్‌మో' మీదగాని. మరి వాళ్ళన్నమాట నిజమే'' అన్నాడతను, ఆట వస్తువుల్ని గురించి అనుకుంటూ. ''పిల్లలు యీరోజుల్లో ఆడుకోవడంలేదు, చదువుకుంటున్నారు. వాళ్ళు చదివీ చదివీ పడచదివేస్తున్నారు, ఎన్నటికీ జీవించడం మొదలుపెట్టరు. యిది అలా వుంది. కాని సిగ్గు, నిజంగా సిగ్గు. ఒక్క ప్రయాణంచేసి వస్తాను, ఒక్కత్తివీ సమర్థించుకోగలవా? నిన్ను ఒక్కత్తెనీ వదిలిపెట్టి వుండటం నేను వూహించుకోలేను.''

''నేనూ నీతో ఓడలో పని చేస్తా. బార్‌లో పని కత్తెగా.''

''వద్దు!'' అని ఆ మాటని నొక్కేశాడు లాంగ్‌రెన్, చేత్తో బల్ల అదిరిపోయేటట్టు కొడుతూ. ''నేను బతికున్నంత కాలం నువ్వు పనిలో చేరేందుకు వీల్లేదు. అయినా, దాన్ని గురించి అనుకోడానికేనా వ్యవధి వుంది.''

అతను వ్యాకుల చిత్తుడై నిశ్శబ్దంగా వుండిపోయాడు. అతని పక్కన స్టూలుమీద అంచున కూర్చుంది అస్సోల్. తల తిప్పకుండానే క్రీగంటి చూపుతో ఆమె తనని వూరడించడానికి యేం చేస్తున్నదీ అతను చూడగలుగుతున్నాడు. దాదాపుగా చిరునవ్వు నవ్వాడు. వుహుఁ, తను చిరునవ్వు నవ్వితే ఆమెని బెదరగొట్టి, యిబ్బంది పెట్టిన వాడవుతాడు. తనలో తనే గొణుక్కుంటూ ఆమె అతని నెరిసిన జుట్టుని అటూ యిటూ ఆడించింది, మీసాన్ని ముద్దుపెట్టుకుంది, బిరుసు వెంట్రుకలున్న అతని చెవుల్ని కోసుగా వచ్చిన వేళ్లతో మూస్తూ అంది:

''యిప్పుడు నేను నిన్ను ప్రేమిస్తున్నాను అని నేను చెప్పే మాటని వినలేవు.''

ఆమె అతన్ని మురిపిస్తూ వుంటే లాంగ్‌రెన్ నిశ్శబ్దంగా కూర్చునే వున్నాడు, పొగ లోపలికి పీలుస్తానని భయపడి ఉగ్గబట్టుకుని కూర్చున్న మనిషిలాగా. కాని ఆమె అన్నమాట విని అతను పగలబడి నవ్వాడు:

''పిచ్చితల్లీ'' అని వూరికే అని ఆమె చెక్కిళ్లు నిమిరి, తన తెడ్లపడవని చూడ్డానికి సముద్రతీరానికి వెళ్లిపోయాడు.

కొంచెం సేపు అస్సోల్ గదిమధ్యలో వుండిపోయింది, వ్యామోహపర విచారానికి లొంగిపోవడమా, యింటి పనులు చూసుకోవడమా అన్న వాటి మధ్య వూగిసలాడుతూ. అప్పుడు పళ్లేలు కడుక్కున్నాక, మిగిలి వున్న సంబారాలు యేమిటో చూసింది. ఆమె తూచనూ, కొలవనూ లేదు; కాని గ్రహించిందేమిటంటే పిండి ఓ వారంకంటే యెక్కువ రాదు, పంచదార డబ్బా అడుగు కనిపిస్తోంది; టీ, కాఫీ పాకెట్లు దగ్గర దగ్గరగా ఖాళీ; వెన్న నిండుకుంది, అని. ఆమె కళ్లకి కాస్తంత యేదో ఫరవాలేదు అన్నట్టుగా కనిపించినవి సంచీ బంగాళా దుంపలు. తర్వాత ఆమె నేల కడిగి, మరింకోదాంతో గౌనుమీద లేసు కుడదామని కూచుంది. కాని అద్దం వెనక్కాల పీలిక ముక్కలు కుక్కి వున్నాయని తక్షణం గుర్తుకు తెచ్చుకుని, ఆమె అక్కడికి వెళ్లి చిన్న మూట తీసింది. అప్పుడు తన ప్రతిబింబంకేసి చూసుకుంది.

ఆక్రోటు చట్టం అవతల ప్రతిబింబితమైన గది స్పష్టమైన శూన్యంలో చవకదైన, తెల్లని, గులాబీ పువ్వుల పెల్లా కట్టుకున్న చిన్న, నాజూకైన ఆడపిల్ల వుంది. ఆమె భుజాల్ని బూడిదరంగు సిల్కు రుమాలు కప్పతోంది. యింకా బాలికలాగా, ఎండకి ఓమాదిరిగా గోధుమరంగు తిరిగిన వదనం ఉత్సాహవంతంగా, భావ ప్రకాశకంగా వుంది; ఆమె అందమైన కళ్లు, ఆమె వయసుకి కొంచెం గంభీరమే అనిపించేవి, అభిమానస్తులైన వాళ్లకి చిత్రంగా వుండే బెరుకు యేకాగ్రతతోటి వున్నాయి. ఒకే తీరులో లేని ఆమె వదనం సున్నితమైన రేఖా స్వచ్ఛతతోటి ప్రేమాస్పదంగా వుంది. ప్రతి వంపూ, ప్రతి ఉన్నతీ చాలామంది ఆడవాళ్ల ముఖాల్లో కనిపించవచ్చు, కాని అన్నిటినీ యేక మొత్తంగా తీసుకున్నప్పుడు ఆ శైలి అత్యంత అద్వితీయంగా వుంది — సహజమాధుర్యంతో వుంది; మిగిలింది మాటల్లో వర్ణించలేము, ఒక్క మాట చాలు: ''మనోహరం''గా వుంది.

ఆ ప్రతిబింబితమైన అమ్మాయి అస్సోల్ అంత సహజ ప్రేరణతోటి చిరునవ్వు నవ్వింది. ఆ చిరునవ్వు కొంచెం విచారగ్రస్తంగా అయింది. అది గమనించి ఆమె కలవర పడింది తను పరాయి వ్యక్తికేసి చూస్తున్నట్టు. ఆమె తన చెక్కిలిని అద్దానికి ఆనించింది, కళ్లు మూసుకుంది, ప్రతిబింబంపైన అద్దాన్ని మెల్లిగా నిమిరింది.

 అస్పష్టపు, మృదువైన ఆలోచనల గుంపు ఆమెలో దూసుకుపోయింది; ఆమె నిటారుగా అయి, నవ్వి, కుట్టుకుందా మని కూర్చుంది.

ఆమె కుట్టుకుంటూ వుంది. యింకొంచెం దగ్గరగా చూస్తే, ఆమెలోకి చూస్తే ఆమె యిద్దరు అమ్మా యిలు కలిసి యేర్పడింది, యిద్దరు అస్సొల్‌లు ఆనందభరిత, అద్భుత రసాభాసంగా కలిసిపోయినట్టేది. ఒకామె నావికుడు చేతివృత్తి నిపుణుడు, ఆటవస్తువుల తయారీవాడు అయిన అతని కూతురు; రెండవ ఆమె సజీవ కావ్యం, తన సకల సారూప్యతల, చిత్రాల అద్భుతంతోటే ఒకదానిమీద ఒకటి పరుచుకుంటున్న ఛాయా కాంతుల పరస్పర చర్యలో నిగూఢంగా పొందిక చెందిన మాటలతోటి నిండిన సజీవ కావ్యం. ఆమెకి తన అనుభవపు పరిమి తుల్లోనే జీవితం గురించి తెలుసు, కాని సామాన్యతలతో బాటుగా, ఆమె భిన్న శ్రేణి తాలూకు ప్రతిబింబిత అర్థం కూడా చూసింది. ఆ రకంగా మనం వస్తువులకేసి చూస్తూ వాటిని రేఖాకృతి గ్రహణతోనే పరిశీలించం, అనుభూతిద్వారా గ్రహిస్తాం. అనుభూతి ఖాయంగా మానవసహజమైంది. మరి మానవసహజమైనదంతా, విశిష్టమైంది కదా. యీ ఉదాహరణద్వారా చిత్రించిన దానికి సమమైనదేదో, ఆమె దర్శనీయమైన దానికి పైన, అవతల చూసింధి. యీ అణకువతో కూడిన విజయాలు లేకపోతే, అవగత యోగ్యమైనదంతా ఆమెకి పరాయిదే. ఆమెకి చదవడం అంటే యిష్టం కాని ఆమె చదివిన ప్రతి పుస్తకంలోనూ అధికభాగం నిగూఢార్థాలని చదివింది, తను జీవించినట్టే. ఆ స్పృహ లేకుండానే, ప్రేరణద్వారానే, ఆమె ప్రతి అడుగు లోనూ అగణితమైన అభౌతిక సూక్ష్మ ఆవిష్కరణలని, అవర్ణ్యనీయమైన వాటిని, కాని శుభ్రత, వెచ్చదనం అంత ముఖ్యమైన వాటిని, చేసింది. ఒకో అప్పుడు — మరి యిది రోజుల తరబడి సాగేది — ఆమె పరివర్తన చెందినట్టు అయిపోయేది; జీవితపు భౌతిక పీడన, నారి కవతల వింటి పూపులోని నిశ్చలతలాగా పడిపోయేది. ఆమె కాంచినదంతా, ఆమెకి ప్రాణభూతమైనదంతా, ఆమెని పరివేష్టించినదంతా ఐహిక చిత్రపు నిగూఢ జాలమే. యెన్నో సార్లు భయకంపితయై రాత్రిళ్లప్పుడు ఆమె సముద్ర తీరానికి పోయేది. అక్కడ తూరుపు రేకలు విచ్చు కోవడంకోసం ప్రతీక్షిస్తూ, ఆమె తదేకంగా ఎరుపు తెరచాపల ఓడకోసం అలానే చూస్తూ వుండేది. ఆ క్షణాలు దివ్యానంద భరితమైనవి ఆమెకి; ఆరకంగా ఒక అద్భుత కథకి వశులైపోవడం మనకి కష్టం. దాని శక్తినుంచీ, మనోహరత్వంనుంచీ పారిపోవడం ఆమెకి అంతే కష్టం.

దీన్నంతటని గురించీ అనుకుంటూ, మరో సందర్భంలో, తను నమ్మానా అని నమ్మలేక నిజంగా ఆశ్చర్య పడుతూ సముద్రాన్ని ఒక చిరునవ్వుతో క్షమించి, విచారంగా వాస్తవంవైపు మళ్లేది. యిప్పుడు కుచ్చెన బట్ట యేరుతూ ఆమె తన గత జీవితాన్ని నెమరువేసుకుంది. నిరుత్సాహపూరితంగా సాదాగా వుండేది చాలా వుంది. తామిద్దరమే ఒంటరిగా వుండట మనేది ఆమెమీద గణనీయంగా పనిచేసింది. కాని అప్పటికే ఆమెలో ఆంతరంగికమైన బిడియపు పొర, ఉల్లాసపు ఆదానప్రదానాలని అడ్డగించే బాధాకరమైన ముడత యేర్పడ్డాయి. అందరూ ఆమెని ఎగతాళి చేసేవాళ్లు "దీని తలలో పురుగు పట్టింది," "మతి పోయింది" అని — ఆమె యీ బాధకి కూడా అలవాటు పడింది. ఆమె అవమానాలు కూడా భరించింది, వాటి తర్వాత దెబ్బ తగిలినట్టుగా ఆమె గుండె ఘూర్ణిల్లేది. ఆమె కపేర్నాలో నలుగురూ మెచ్చిన పిల్ల కాదు, ఆమెకి మిగతా వాళ్లకంటే యెక్కువ వుందని చాలామంది అనుమానించినా — కాని వేరే భాషలో. కపేర్నాలోని మగాళ్లు బొద్దుగా, గట్టి అవయవాలూ, పిక్కలమీద స్నిగ్ధమైన చర్మమూ, బలిష్ఠమైన చేతులూ వుండే ఆడవాళ్లంటే పడి ఛస్తారు; మంచి రద్దీగా వుండే బజారుల్లోలాగ తోసుకుంటూ, వెనక్కాల చరుస్తూ వాళ్లతో ప్రేమకలాపం జరిపేవాళ్లు. అలాంటి అనుభూతితీరు జంతువుల అరువు లాంటి ప్రాకృతిక అమాయకత్వాన్ని పోలి వుండేది. రంభా, ఊర్వశుల రామణీ యకత అంతా రంగరించుకుని వున్నా తీవ్రమైన నరాల ఉద్రేకం వున్న వాళ్లకి భూతం స్నేహం యెలా వుంటుందో యీ నిష్కర్షభరిత జీవన పరిస్థితి అస్సొల్‌కి అలా వుంది. ప్రేమని పోలిన యేదేనాగానీ యిక్కడ వుండే సమస్యే

లేదు. ఆ రకంగా ఒక వీర దళాన్ని తిన్ననైన మైదాన ప్రభావంనుంచి తప్పించడానికి మధుర విషాద వాయులీ నానికి ఒక సైనికుడి స్థిరమైన బాకా ముందు శక్తి వుండదు. యీ వాక్యాల్లో చెప్పిందాని కంతటికీ యీ పిల్ల తన వీపు వెనక్కి తిప్పే వుంది.

ఆమె తల తన జీవితపు కూనిరాగం తీస్తూ వుంటే ఆమె చేతులు వేగంగా, నేర్పుగా పని చేస్తున్నాయి. ఒక తాటిని తెంపి, ఆమె అవతలకి చూసింది; కాని దానివల్ల అంచుని ఆమె సరిచెయ్యడమూ, యంత్రం అంత కచ్చితంగా కుట్టడం అడ్డిపోలేదు. లాంగ్‌రెన్ తిరిగి రాకపోయినా ఆమె తండ్రిని గురించి చింతపడలేదు. యీమధ్యన అతను పడవలో చేపలు పట్టడానిక్కాని లేకపోతే వూరికే గాలికోసం గాని తరచుగా రాత్రిళ్ళ బయటికి వెడుతున్నాడు.

ఆమెని భయం కొరకలేదు. అతనికి యే ప్రమాదమూ రాదని ఆమెకి తెలుసు. యీ విషయంలో తన ధోరణిలో ప్రార్థించుకుంటూ "దేవుడా నమస్కారం" అని ఉదయమూ, "దేవుడా, సెలవు" అని సాయంత్రమూ గోముగా ముద్దమాటలు అంటూ వుండే చిన్నపిల్లే యింకా అస్సాల్.

ఆమె దృష్టిలో దేముడితోటి ఆ మాదిరి ప్రత్యక్ష పరిచయం యే ప్రమాదాన్నైనా గానీ తొలగించడానికి చాలునని అనిపించేది. ఆమె తనని భగవంతుని స్థానంలో వూహించుకునేది: భగవంతుడు యెప్పుడూ లక్షలాది ప్రజల వ్యవహారాలలో మునిగి పోయి వుంటాడు. అంచేత జీవితపు సాదా ఛాయల్ని, యింటినిండా మనుషులు వుండటం చూసి తనకి తిండి తీర్థాలు సమకూర్చి హడావుడిగా యాతన పడే యజమానికోసం ఓపిగ్గా నిరీక్షించే అతిథిలాగా, గ్రహించాలని ఆమె నమ్మేది.

కుట్టడం పూర్తిచేసి అస్సాల్ తన పని కట్టిపెట్టి అన్నిటినీ సర్ది బల్ల మూల పెట్టి, బట్టలు మార్చు కుని పక్కమీద వాలింది. దీపం ఆర్పేసింది. కాని తను నిద్రపోవడం లేదని త్వరలోనే గ్రహించింది. మట్టమధ్యా హ్నం వున్నట్టుగా వుంది ఆమె మనసు. చీకటి కూడా కృత్రిమంగా కనిపించింది. ఆమె శరీరం ఆమె మనసు లాగానే నిర్విచారంగా, పగలు లాగా భాసించింది. జేబు గడియారం అంత వేగంగా ఆమె గుండె కొట్టుకుంది. అది తలగడకీ, చెవికీ మధ్యన కొట్టుకుంటున్నట్టు వుంది. అస్సాల్‌కి చికాకు కలిగింది. కాసేపు దుప్పటీ విసిరేస్తూ, కాసేపు దాన్ని పైకి లాక్కుంటూ, తలమీదకి కప్పుకుంటూ యిటు తిరిగింది, అటు తిరిగింది. ఆఖరికి ఆమె నిద్రపోవడానికి సహకరించే పరిచితమైన దృశ్యాన్ని స్ఫురణకు తెచ్చుకుంది. తను చిళ్లపెంకుల్ని తేటగా వున్న నీటిమీదకి విసిరితే, యింకా యింకా పెద్దవవుతున్న అలల వృత్తాలకేసి చూస్తూ కూచున్నట్టు వూహించుకుంది. యీ సమాచారంకోసం నిద్రచూస్తూ వున్నట్టు వుంది. అది వచ్చింది, తల్లింపు వేపున వున్న మేరీతోటి గుసగుసలాడుతూ, ఆమె చిరునవ్వుని మన్నిస్తూ, చుట్టుతా వున్న ప్రతిదాంతోటీ "ష్" అని అంటోంది. అస్సాల్ తక్షణం నిద్రలోకి జారిపోయింది. తన కిష్టమైన కలని కంది: చెట్లు పుష్పించడం, ఒక తపన, మనోహరత్వం, పాటలు, వింతదృశ్యాలు, నిద్రనుంచి లేచాక వాటిల్లోనుంచి సంతోషం జల్లు మనేటట్టు తన కాళ్ల దగ్గర్నుంచి గుండెలదాకా లేచేటువంటి నీలినీళ్ల మిలమిలని మాత్రం గుర్తుకు తెచ్చు కుంటుంది. దీన్ని అంతట్నీ గురించీ కలగని, ఆమె ఆ అసంబద్ధ ప్రపంచంలో యింకొంచెం సేపు వుండి అప్పుడు పూర్తిగా లేచి కూచుంది.

ఆమె అసలు నిద్రేపోలేదు, అసలు నిద్రపోనట్టే వుంది. ఒక నూతనత్వ భావన, సంతోష భావన, కార్యా చరణ కాంక్ష ఆమెలో ఉబికాయి. కొత్త గదిని పరీక్షిస్తున్న వాడి లాగా ఆమె కళ్లతో చుట్టుతా చూసింది. ప్రభాతం తొంగి చూసింది — వెలుతురుతోటి పూర్తి స్వచ్ఛతతో కాదు, ఒక నీరస యత్నంతో. దానిగుండా చుట్టూ వున్నదాన్ని ఎవరేనా గ్రహించగలరు. కిటికీ మట్టు నల్లగా వుంది. పైన వెలుతురుగా వుంది. బయట, కిటికీ చట్రపు అంచున వేగుచుక్క మెరిసింది. మళ్లీ తను నిద్రపోలేదని తెలుసుకుని అస్సాల్ బట్టలు వేసు

 కుని కిటికీ దగ్గరికి వెళ్లి, కొక్కెం యెత్తి దాన్ని తెరిచింది. శ్రద్ధగా, స్పష్టంగా వున్న నిశ్శబ్దం బయట ఆవరించుకుని వుంది. అది అప్పుడే దిగినట్టుగా వుంది. నీల ప్రత్యూషంలో పొదలు కంపించాయి; దూరంలో చెట్లు నిద్రపోతున్నాయి. గాలి భారంగా, మట్టి వాసన వేస్తోంది.

చెయ్యి చట్రంపైన ఆన్చి ఆమె బయటికి చూసి చిరునవ్వు నవ్వింది. హఠాత్తుగా సుదూర ఆమంత్రణానికి చేరువైంది యేదో లోపలినుంచీ బయటినుంచీ ఆమెని కదిపింది. ఆమె స్పష్టంగా వుండే వాస్తవంనుంచి యింకా స్పష్టమైన దానికీ, యింకా అసందిగ్ధమైన దానికీ మరో సారి జాగృతం అయినట్లైంది. ఆ క్షణంనుంచీ ఆమె చైతన్యపు హర్షోత్సేక సంపదకి చిక్కింది. అర్థం చేసుకుంటూ మనం మిగతా వాళ్లు అన్న మాటలని వింటాం. కాని ఆ అన్నమాటలనే వల్లించమంటే వాటిని మరోసారి భిన్నంగా నూతన అర్థంలో గ్రహిస్తాం. ఆమె కూడా యిప్పుడు దాన్ని అనుభవించింది.

పాతదే గాని తను వేసుకుంటే నిత్య నూతనంగా వుండే పట్టు రుమాలుని తీసుకుని, ఆమె దాన్ని చుబుకం కింద ఆన్చిపట్టుకుని ఒక చేత్తోటి, తలుపు వేసి రోడ్డుమీదకి దిసపాదంతోనే దూసుకుపోయింది. అంతా నిర్జనంగా నిశ్చలంగా వున్నా ఒక బృంద స్వరమేళనంలాగా, వినగలిగేటట్టుగా ఆమె గింగుర్లెత్తింది. ప్రతీదీ ఆమెని సంతోష పరచింది, ప్రతీదీ ఆమెకి కన్నుల పండువుగా వుంది. వెచ్చటి ధూళి ఆమె దిసపాదాల్ని గిలిపెట్టింది. గాలి తేటగా, శ్వాసించడానికి సంతోషంగా వుంది. తేటపడే ఆకాశపు ప్రత్యూష సంధ్యలో యిళ్ల కప్పులు, మేఘాలూ నల్లని ఆకృతిలో రూపుకడుతున్నాయి. కంచెలు, అడివి గులాబీలు, తోటలు, వనాలు, అస్పష్టంగా కనిపించే రోడ్డు అన్నీ జోగుతున్నాయి. ప్రతి దాంట్లోనూ పగటికంటే భిన్నమైన పద్ధతి — అదే, కాని అంతకు ముందు లేని ఒక సారూప్యతతోటి వుండి, కనిపించింది. ప్రతీదీ కళ్లు తెరుచుకుని నిద్రించింది, ఆ వెళ్లే పిల్లని దొంగగా పరిశీలిస్తూ.

ముందుకుపోయే కొద్దీ ఆమె నడక వేగవంతం చేసింది, వూరిని వెనక వదిలెయ్యాలన్న తొందరలో. కపేర్లా అవతల పచ్చిక మైదానాలు వున్నాయి. పచ్చికబీళ్ల అవతల హేజెల్ పొదలూ, బూరుగలూ, చెస్ట్‌నట్ చెట్లూ తీరంవార ఏటవాలుల్లో చుక్కల్లా వున్నాయి. రోడ్డు ఆఖరైపోయి, మొక్కా మోడీసా పెరిగిన దారిగా కొనసాగిపోతూ వున్న చోట, పట్టుకుచ్చులాంటి బొచ్చున్న చిన్న నల్లని కుక్క, తెల్లటి రొమ్మూ మాట్లాడాలని ఉద్రేకించిన కళ్లూ వున్నది, మెల్లిగా అస్సోల్ కాళ్లకి చుట్టుకుని తిరిగింది. ఆ కుక్క అస్సోల్‌ని గుర్తుపట్టి తడవతడవకీ గునుస్తూ, టక్కులమారిగా శరీరాన్ని మెలితిప్పుతూ, ఆ పిల్లతోటి యేదో "నువ్వు" "నేను" అన్నంత స్పష్టమైన దాన్ని గురించి నిశ్శబ్దంగా అంగీకరిస్తున్నట్టు ఆమె పక్కనే నడిచింది. దాని సంభాషణాత్మక నేత్రాలు చూసి మాట్లాడానికి వీల్లేని రహస్య కారణంవల్ల కాకపోయినట్లైతే అది మాట్లాడి వుండేదని అస్సోల్‌కి నమ్మకం కలిగింది. తన సహచరుని చిరునవ్వు గ్రహించి ఆ కుక్క ముట్టెని ఉల్లాసంగా మెలితిప్పి, తోక ఆడించి, ముందు గెంతుతూ పరిగెత్తింది. కాని యేం పట్టనట్టు హఠాత్తుగా చతికిల పడిపోయి, చిరస్థాయిగా వుండే తన శత్రువు జోరీగ కొరికిన చెవిని బరుక్కుని, తిరిగి పరిగెత్తిపోయింది.

అస్సోల్ తనమీద మంచు చిమ్మిన పొడుగాటి పచ్చికబీటి గడ్డిలోకి వెళ్లింది. చెయ్యి చాచి, అరచెయ్యి వాటి రెమ్మల గుత్తులమీద పెట్టి ఆమె ఆ స్పర్శకి చిరునవ్వు నవ్వుతూ నడిచి వెళ్లిపోయింది. ఆ పువ్వుల ప్రత్యేక వదనాల్లోకి కాండాల గజిబిజిలోకి తొంగిచూస్తూ ఆమె పూర్వవృత్తాంతాలని — దాదాపు మానవ భంగిమల్ని, ప్రయత్నాలని, కదలికల్ని, కవళికల్ని, హావభావాల్ని స్పష్టపరచుకుంది. పొలంలోని చుంచుల వూరేగింపునిగాని, ఎలుకల నాట్యంగాని, నిద్రపోయే మిడతని తన బెదిరింపులతో హడలగొట్టే ముళ్లపంది ముతక వికార చేష్టలు గాని ఆమెని ఆశ్చర్యపరిచి వుండేవి కాదు. నిజానికి ఒక ముళ్లపంది బూడిదరంగు బంతిలా చుట్టుకుని ఆమె దారిలో దొర్లిపోయింది. అది కాలినడకన పొయ్యేవాణ్ణి హెచ్చరిస్తూ శకటం "హంవ్, హంవ్" మన్న

ట్టుగా గు(రుమంది. తను చూసి అర్థం చేసుకున్న వాటితో అస్సాల్ మాట్లాడింది. "అయ్యో, పాపం!" అందామె అరుణవర్ణపు, కీటక భక్షిత వర్ణశోభిత పుష్పాన్ని చూసి, "నువ్వు కాసేపు కొంపదగ్గర వుండు" – అంది, దారిలో చిక్కుకుని ఆ రకంగా వచ్చేపొయ్యే వాళ్ల బట్టల రాపిడికి ఆకులన్నీ వూడిపోయిన పొదని చూసి. ఒక పెద్ద కందిరీగ ఒక నీలఘంటం పువ్వుని కిందకి లాగుతూ, జారిపోతూవున్నా కాని వదలకుండా పట్టుకుంటూ వుంది. "యీ బొండాం (ప్రయాణీకుణ్ణి విదిలించుకో" అని అస్సాల్ పువ్వుకు సలహా యిచ్చింది. నిజంగానే కందిరీగ పట్టుజారిపోయి, జుమ్మంటూ యెగిరిపోయింది. ఆ రకంగా దడదడ గుండె కొట్టుకుంటూ వుంటే, వణుకుతూ, యెర్రబారి ఆమె ఒక గుట్ట పార్శ్వాన్ని సమీపించి, మైదానపు బాహిరంనుంచి ఒక పొద మరుగున వుండి పోయింది. అక్కడ ఆమె అసలైన మిత్రులు – ఆమెకి తెలుసు తనతో కడుపు నిండుగా మాట్లాడే మిత్రులు – ఆమెని పరివేష్టించారు.

ఆ మిత్రులు పెద్ద పాత చెట్లు. సుగంధ భరిత కాషాయ మొక్కలూ, హేజెల్ పొదలూ మధ్య పెరిగిన చెట్లు. వంగిన వాటి శాఖాగ్రాలు పొదల అంచుల్ని అలవోకగా తాకుతున్నాయి. పెద్ద చెస్ట్‌నట్ చెట్ల ఆకుల శిష్ట గంభీరతనుంచి తెల్లని పువ్వుల శంకువులు పొడిచాయి. వాటి సుగంధం మంచుతోటీ జీవరసంతోటీ మిళిత మైంది. చెట్ల వేళ్లు ఉబికి వుండటంతోటి దారి అల్లిబిల్లిగా అల్లుకుని ఒక చోట దిగిపోయి, ఒక చోట పైకి యెక్కి వుంది. అస్సాల్‌కి అక్కడ హాయి అనిపించింది. ఆమె చెట్లని అవి మనుషులైనట్టు అభినందించింది, అంటే వాటి వెడల్పాటి ఆకుల్ని అదిమింది. తనలో తనే గొణుక్కుంటూనో లేకపోతే పైకే అంటూనో ఆమె నడుచుకుంటూ పోయింది: "యిక్కడున్నావ్! యిక్కడ నువ్వా. అబ్బ యెంత మంది వున్నారు, నేస్తాలూ! నాకు హడావుడిగా వుంది, బాబులూ, నన్ను పోనివ్వండి. మిమ్మల్నందర్నీ గుర్తుపట్టాను, మిమ్మల్ని గుర్తుంచు కుంటాను, గౌరవిస్తాను." ఆమె "బాబులు" ఆమెని ఘనంగా తాకారు, తమకి చేతనైనంతగా– తమ పత్రాల తోటి – సన్నిహితత్వపు భావనతోటి కీచుమన్నారు, జవాబుగా. కాళ్లు బురద అయిపోయి, ఆమె సముద్రానికి యెత్తులో కొండమీదకి నడిచి అంచుదగ్గర నుంచుంది. గబగబా నడిచి రావడంవల్ల ఆయాసంగా వుంది. ఒక గాఢమైన, అజేయమైన విశ్వాసం ఆమెలో హర్షంతో ఉబికి ఉప్పొంగింది. ఆమె చూపు దాన్ని దిజ్మండలం అవతలికేసి పరిచింది, అక్కణ్ణుంచి అది తోసుకువచ్చే అలల మంద తరంగించడంలో, నిబ్బరమైన రాకడలో సగర్వంగా వుంటూ తిరిగి వచ్చింది.

యీ లోపున దిజ్మండల రేఖతోటి బంగారు సూత్రంతో కుట్టిన సముద్రం యింకా నిద్రిస్తూనే వుంది. కొండ దిగువన తప్ప, నీరు లేచి పడుతూనే వుంది. తీరం దగ్గర నిద్రించే సముద్రపు ఉక్కుపలిత వర్ణం నీలంగా శ్యామలంగా అయింది బాగా దూరంలో. బంగారు సూత్రానికి అవతల, మండుతూ, వెలుతురు కిటికీ ప్రకా శించింది. తెల్లటి మేఘాలకి యిప్పుడు గులాబీవర్ణం తగిలింది. సున్నితమైన, దేవలోక వర్ణాలు వాటిలో మెరి శాయి. దూరపు శ్యామలవర్ణంలో చలించే హిమశ్వేతవర్ణం పరుచుకుంది. ఫేనం మిలమిలలాడి, రక్తారుణిమ చెదరి, బంగారు సూత్రం వారే వెలుగుతూ, సముద్రంమీదుగా అరుణవర్ణ తరంగాలని అస్సాల్ పాదాల దగ్గరకి తీసుకువచ్చింది.

ఆమె కూర్చుని కాళ్లు చేరదీసుకుంది. ఆ సంద్రంకేసి ఆనుకుని పెద్దవైన కళ్లతోటి – ఆ కళ్లల్లో పెద్ద వాళ్లకి సంబంధించినదేదీ మిగలకుండా – చిన్న పిల్లల కళ్లతోటి, దిజ్మండలం కేసి చూసింది. ఆమె అంత కాలం అంత పరితాపంగా (ప్రతీక్షిస్తూ వున్న (ప్రతీదీ, (ప్రపంచం కడన జరుగుతూ వుంది. మరూర ఆగాధా ఆ నేలలో ఆమె సముద్రాంతర్గత పర్వతాన్ని వూహించుకొంది; దాని పార్శ్వాలనుంచి సముద్రపు వాచువాళ్లు పాముల్లా తేలియాడుతున్నాయి; అంచున యీనె పొదుచుకుని వచ్చిన గుండ్రటి ఆకుల మధ్యనుంచి పింత

 పుష్పాలు విరిశాయి. మహాసముద్రపు ఉపరితలంమీద పై ఆకులు తళతళలాడాయి. అస్సోల్‌కి తెలిసింది తెలి యని వాడికి వూరికే మెరుపు, మిలమిల మాత్రమే కనిపిస్తాయి.

సముద్రపు నాచులోనుంచి ఒక ఓడ లేచింది. అది పైకి వచ్చి, సూర్యోదయ మధ్యంలోనే సరిగ్గా ఆగింది. అంత దూరంనుంచి అది మేఘాలంత స్పష్టంగా గోచరమవుతోంది. సంతోషాన్ని ఉత్ఫుల్లం చేస్తూ అది ద్రాక్షసారాయిలాగా, గులాబీలాగా, రక్తంలాగా, అధరాల్లాగా, ఎర్రటి ముఖమలులాగా, అరుణ జ్వాలలాగా ప్రజ్వ లించింది. ఆ ఓడ తిన్నగా అస్సోల్‌కేసే వస్తోంది. దాని బలిష్ఠమైన కైవర్తక తాడనం వల్ల ఫేన పక్షాలు రెండు యేర్పడుతున్నాయి. నుంచుని ఆ పిల్ల చేతుల్ని తన వక్షంమీద అదుముకుంది, కాని ఆ మంత్రక్రీడ తేలికైన తరంగాలైంది: సూర్యుడు ఉదయించాడు, కాంతిమయమైన నిండుతనం యింకా అలసత్వంగా వుండి, నిద్రించే భూమిమీద పరుచుకున్న ప్రతి దాన్నుంచీ ముసుగులు చీల్చేసింది.

ఆమె నిట్టూర్చి చుట్టూ చూసింది. సంగీతం అయిపోయింది, కాని అస్సోల్ యింకా దాని గింగుర్లెత్తే బృందగానపు కనికట్టులోనే వుంది. యీ అనుభూతి క్రమేపీ నీరసపడి, అప్పుడొక స్మృతి అయి, ఆఖరికి వూరికే అలసట అయింది. ఆమె గడ్డిమీద వాలింది, ఆవులించింది, ఆహ్లాదకరంగా కళ్లు మూసుకుని నిద్ర పోయింది — పసిగుడ్డులాగా యే చీకూ చింతా లేని గాఢమైన నిద్ర.

తన దినపాదపు మడమమీద పాకే యీగవల్ల ఆమెకి మెలుకువ వచ్చింది. అస్సోల్ చిరాగ్గా కాలు జాడించు కుని లేచింది, కూర్చుని చెదిరిన జుట్టు వెనక్కి ముడుచుకుంది. దాంతోటి గ్రే ఉంగరం బయటపడింది. అదేదో వేళ్లమధ్య చిక్కిన గడ్డిపోచ అనుకుని ఆమె వేళ్లని చాచింది. ఏమైనా యీ ఆటంకం తొలగక పోవడంతోటి ఆమె చిరాగ్గా చేతిని కళ్లదగ్గరికి యెత్తి, పైకి ఉబికివచ్చే జలలాగా ఒక్క ఉదుట్న కాళ్లమీద నిలబడింది.

ఎవరి వేళ్లమీదనో అయినట్టుగా, యేమంటే ఆ క్షణంలో ఆమె అది తనదీ అని అనలేదు, గ్రే వుంచిన ప్రకాశమానమైన ఉంగరం తళతళ మెరిసింది. ఆ వేలు తనదైనట్టుగా ఆమె భావించలేదు.

''ఎవరి ఉంగరం యిది? ఎవరీ పరాచికం ఆడింది?'' అని ఆమె అరిచింది. ''నేనింకా నిద్రపోతున్నానా? లేకపోతే యిది నాకు దొరికితే నేను మర్చిపోయానా?''

ఉంగరం వున్న కుడిచేతిని ఎడమచేత్తో పట్టుకుని చుట్టూ ఆశ్చర్యంగా చూసింది తన చూపులతో సముద్రాన్నీ పొదలనీ వెదుకుతూ; కాని యెవరూ కదలలేదు, ఎవరూ పొదల్లో దాంకోలేదు, విశాలంగా ప్రకా శించే నీల సముద్రంలోనూ జాడ లేదు. అస్సోల్‌ని ఒక అరుణిమ కమ్మేసింది, ఆమె గుండెలోని స్వరాలు భవి ష్యత్ సూచకమైన ''అవును'' అని గొణుగుతున్నాయి. జరిగిందానికి సమాధానం లేదు, కాని ఆమె దాన్ని తన వింత అనుభూతిలో ఆలోచనలూ మాటలూ లేకుండా చూసింది. ఆ ఉంగరం ఆమెకి యిప్పుడు ప్రియమైంది అయింది. దాన్ని వేలినుంచి తీసేస్తూ వుంటే ఆమె కంపించింది, దొన్నెలాగా వున్న తన చేతిలో దాన్ని నీళ్లలాగా పట్టుకుని తన ఆత్మతోటి, హృదయంతోటి, యౌవనపు అపరిమిత ఆనందంతోటీ, స్పష్టమైన మూఢనమ్మ కంతోటీ — పరీక్షించింది, అప్పుడు దాన్ని బాడీలో దొపుకుని, అస్సోల్ ముఖాన్ని చేతుల్తో కప్పేసుకుంది. ఆ వదనంనుంచి తోసుకురావడానికి ఒక చిరునవ్వు తన్నుకు లాడుతోంది. ఆమె తలకిందికి దించి, మెల్లిగా రోడ్డుమీద యింటి దారి పట్టింది.

ఆ రకంగా, చదువూ సంధ్యా వున్నవాళ్లు చెప్పినట్టు, గ్రే, అస్సోల్ లిద్దరూ ఒకళ్లనొకళ్లు, అంత అని వార్యమైన వేసవి ఉదయాన, యాదృచ్ఛికంగా కలుసుకున్నారు.

# యుద్ధానికి సన్నాహం

గ్రే "సీక్రెట్" నౌక డెక్కుమీదకి తిరిగివచ్చాక, కొన్ని నిముషాలు, చేతిని తలమీద ముందుకీ వెనక్కీ రాసుకుంటూ విచిత్రంగా నుంచుండి పోయాడు. అది చాలా గందరగోళ పడిపోయినట్టున్న స్థితిని తెలియచేస్తుంది. పరధ్యానం, ఉద్రేకాలకి ముసుగు భంగిమ, నిద్రలో నడిచేవాడి అర్థరహిత మందహాసంలో అతని ముఖంమీద ప్రతిఫలించింది. అతని సహచరుడు, పాంటెన్, ఆ క్షణంలో చేప వేపుడు ప్లేటు తీసుకుని అటు వస్తున్నాడు. గ్రేని చూడగానే అతను కేప్టెన్ వున్న వింత స్థితిని గమనించాడు.

"మీకు దెబ్బ యేమీ తగల్లేదు కదా, ఏమండీ?" అని అతను హెచ్చరికగా అడిగాడు. "మీరు యెక్కడికి వెళ్ళారు? ఏం చూశారు? వాస్తవానికి అది నేను అడక్కూడ దనుకోండి. మనకి ఒక ఏజెంటు లాభసాటిగా వుండే సరుకు బోనసుతో సహా యిస్తానన్నాడు. కాని మీరేంటి అలా వున్నారు?"

"అబ్బే, ఏం లేదు" అన్నాడు గ్రే నిట్టూరుస్తూ, యేదో తను వదులైపోయినట్టు. "అదే కావాలనుకున్నాను, నీ సాదా, తెలివైన స్వరం వినాలనుకున్నాను. చల్లని నీటి తుంపర లాంటిది అది. సిబ్బందితో చెప్పు, లంగరు ఎత్తుతున్నాం యివాళ అనీ, యిక్కడికి పదిమైళ్ల దూరంలోని లిలియన్‌కి వెడుతున్నాం అనీనీ. నదీ గర్భం అంతా చట్టుగా వుంది. వచ్చి పటం తీసుకో. మనకి దారి చూపే మాలిమి అక్కర్లేదు. ప్రస్తుతానికి అంతా యింతే.... ఆఁ, ఆ సరుకు అవసరం లేదని ఏజెంట్‌తో చెప్పు. నేను బస్తీకి పోతున్నాను. సాయంత్రం దాకా అక్కడ వుంటాను."

"కాని ఏం జరిగింది?"

"ఏం లేదు, పాంటెన్. ప్రశ్నలుండ కోడదనే నా కోరికని దృష్టిలో పెట్టుకో, సమయం వచ్చినప్పుడు నేనే అన్నీ చెవుతాను. మనం మరమ్మత్తుల కోసం ఆగుతామనీ, స్థానిక రేవు నిండుగా వుందనీ సిబ్బందికి చెప్పు."

"అలాగే నండి" అన్నాడు పాంటెన్ చకితుడైపోయి, గ్రే వెనక్కి తిరిగి వెళ్లిపోతూ వుంటే. "ఆయ్, ఆయ్. అలాగేనండి" అన్నాడు.

కేప్టెన్ ఆజ్ఞలు తెలుస్తూనే వున్నప్పటికీ కూడా అతని సహచరుడు మీది గుడ్లు పెట్టుకుని చేప ప్లేటుని పట్టుకెడుతూ తన గదిలోకి దూసుకుపోయాడు, గొణుక్కుంటూ "నీకు గందరగోళం అయిపోయింది, పాంటెన్. అతనేమన్నా దొంగ వ్యాపారంలోకి దిగుతాడా యేమిటి? సముద్రపు దొంగల జెండా ఎగరేస్తాడా?" అనుకున్నాడు. దీంతోటి పాంటెన్ విపరీతమైన వూహలతోటి గజిబిజి అయిపోయాడు. అతను తత్తరపాటుతో చేపని కబళిస్తూ వుంటే గ్రే తన గదిలోకి వెళ్లి కొంత సొమ్ము తీసుకుని, సముద్రపు పాయని దాటి లిస్పలోని కొట్లదగ్గర తేలాడు.

ఏమైనా అతను యిప్పుడు నిశ్చయంగా నిబ్బరంగా చరించాడు, యీ అద్భుతమైన ప్రయాణంలో తను చెయ్యబోయేదాన్ని గురించిన సూక్ష్మ వివరాలు కూడా తెలుసుకుని వున్నాడు. ప్రతి చలనం — ఆలోచన, కదలిక — సృజనాత్మక క్రియ తాలూకు సంస్కృతమైన ఆనందంతో అతన్ని వెచ్చబరిచింది. అతని పథకం తక్షణం స్పష్టంగా రూపు తీసుకుంది. పాలరాయిని అద్భుతమైన ప్రకాశంతో శోభింప చేసేటటువంటి ఉలి కడపటి దెబ్బలాగా రూపాంతరం చెందింది అతని జీవిత అవగాహన.

తన అభిరుచికి సంబంధించి ప్రత్యేకం పట్టుబడుతూ, యెందుకంటే తనకి అవసరమైన కచ్చితపు వర్ణఛాయని గురించి అతనికి తెలుసు కాబట్టి, మూడు దుకాణాలు తిరిగాడు. మొదటి రెండు దుకాణాల్లోనూ

 వె్రి రంగులున్న పట్టు అతనికి చూపించారు, అవి బైతులకి నచ్చుతాయి. మూడో దుకాణంలో అతనికి వూహాత్మక వర్ణ శోభితమైన నమూనాలు కనిపించాయి. దుకాణం మనిషి పాత నిలవలనుంచి బట్టల్ని తీసి పరిచేస్తూ ఉల్లాసంగా కలదిరిగేశాడు. కాని గ్రే స్తన శల్య పరీక్ష చేస్తున్నట్టు గంభీరంగా వున్నాడు. అతను ఓపిగ్గా మడతలు విప్పి వాటిని పక్కన పెట్టి, కలిపి తోసి, చుట్టలు విప్పి వెలుతుర్లో చూసి ఎన్ని ఎరుపు ముక్కల్ని చేరేశాడంటే కౌంటర్ దగ్గర అవి గుట్టగా పడి జ్వాలలా మండడానికి సిద్ధంగా వున్నట్టున్నాయి. ఒక ఎరుపు జాలు గ్రే బూట్ల అంచున పడింది. ఎరుపు ప్రతిఫలనం అతని చేతులమీదా, ముఖంమీదా ప్రకాశించింది. యే మాత్రం సిల్కు అయినా గానీ అతనికి ఆ తిరగ తోడేసిన దాంటో లేతయెరుపు, గులాబీ, ముదురు కెంపు కనిపించాయి. ధగద్ధగాయమానంగా మరిగే ఎరుపు రంగు మద్యం, నారింజ, మబ్బుగా వుండే కపిల అరుణం కనిపించాయి. యిక్కడ అన్ని సాంద్రతల, శక్తుల ఛాయలు, వాటి భావనాత్మక సంబంధంలో ''రమణీయం'' ''ఆశ్చర్యం'' ''అద్భుతం'' ''దివ్యం'' లాంటి పదాలలాగా వున్నాయి. ఆ మడతల్లో కంటి చూపు భాషకి అందని పూర్వసూచితాలు దోగాడాయి, కాని అసలైన అరుణ స్వరం కేప్టెన్‌కి కొంత సేపటిదాకా చిక్కలేదు. దుకాణం అతను తెచ్చిన బట్టలు బాగున్నాయి, కాని కచ్చితమైన ''అవును'' అనే అభిప్రాయాన్ని రాబట్టలేకపోయాయి. ఆఖరికి ఒక రంగు నివ్వెరపోయిన ఆ కొనుగోలుదారుడి దృష్టిని ఆకట్టుకుంది. అతను కిటికీ దగ్గర చేతుల కుర్చీలో కూర్చుని, ఆ రెపరెపలాడే గుట్టలోనుంచి పొడుగాటి పీలికని తీసి తన మోకాళ్లమీద పడేసుకుని, పైపు పళ్లమధ్య బిగించుకుని వెనక్కి వాలి, సాలోచనగా నిశ్చలం అయిపోయాడు.

ప్రభాత అరుణ కిరణంలాగా పరమ స్వచ్ఛంగా వున్న ఆ రంగు, సంపూర్తిగా ఉన్నత సంతోష రాజ చిహ్నాంకిత శోభితమై నిండి, కచ్చితంగా గ్రే అన్వేషించే సగర్వ వర్ణమే అయింది. దానిలో జ్వాల, కనకాంబరం, కపిలం, కెంపుల మిశ్రితం లేదు. నీలిమగాని, ఛాయగాని అందులో లేవు – ఏ అనుమానం కలిగించేదీ లేదు. ఆధ్యాత్మిక ప్రతిఫలన తాలూకు మోహనత్వంతో కూడిన చిరునవ్వులా అది ప్రకాశించింది. గ్రే తన ఆలోచనలో యెంత నిమగ్నుడైపోయాడంటే, తన మోచేతి దగ్గరే, వేటకుక్కలాంటి చురుకుదనంతోటి నుంచుని వాటిని చూపిస్తూన్న, దుకాణం మనిషిని గురించి మర్చేపోయాడు. అలా నిరీక్షిస్తూ వుండటంతోటి విసుగొచ్చి, అతను ఒక ముక్కని కత్తిరించే చప్పుడు చేస్తూ గ్రే దృష్టిని ఆకట్టాడు.

''చూసినవి చాలు'' అన్నాడు గ్రే నుంచుంటూ. ''యీ పట్టుని తీసుకుంటున్నాను.''

''మొత్తం తానంతానా'' అని అడిగాడా వ్యాపారి, అనుమానంగా. కాని గ్రే అతని నుదుటి కేసి నిశ్శబ్దంగా చూశాడు. ఆ చూపు ఆ వ్యాపారిని అనువుగాని చనువుని తీసుకునేటట్టు చేసింది. ''ఎన్ని మీటర్లు అయితే?''

గ్రే తల పంకించాడు అతన్ని ఆగమంటున్నట్టుగా. అప్పుడు పెన్సిలుతోటి తనకి కావాల్సిన కొలత కాగితం ముక్కమీద వేశాడు.

''రెండు వేల మీటర్లు'' అతను అరలని సందిగ్ధంగా పరిశీలించాడు. ''రెండు వేల మీటర్ల కంటె యెక్కువ లేదు.''

''రెండు?'' అన్నాడు దుకాణం అతను టపాకాయపేలినట్టు గెంతి. ''వేలు? మీటర్లు? అయ్యా, కూర్చోండి, కేప్టెన్‌గారూ. సరి కొత్త సరుకు వచ్చింది, చూస్తారా, కేప్టెన్? మీ యిష్టం. అగ్గిపుల్ల గియ్యానా అండి? మంచి ఒకటో రకం పొగాకు వుందండి, కావాలా? రెండు వేలు... రెండు వేలు... ధర...'' అతను ధర యేదో చెప్పాడు గాని సాదాగా ''అవును'' అనడానికీ, ప్రమాణం చెయ్యడానికీ వున్నంతగానే అతను చెప్పిందానికీ వాస్తవమైందానికీ సంబంధం వుంది. కాని గ్రే తృప్తిపడ్డాడు యేమంటే అతను దేన్ని గురించీ బేరమాడేటట్టు

లేడు. ''అద్భుతమైన, సాటిలేని సిల్కు'' షాపు అతను అంటున్నాడు, ''అసలు నాణ్యంలో దీటు లేనిది. యిలాం 
టిది మీకు యిక్కడ తప్ప యింకెక్కడా దొరకదు.''

ఆ మనిషి కీర్తించడం ముగిసిపోయాక, గ్రే ఆ పట్టుకి, దుకాణం సేవలతో సహా, సొమ్ము చెల్లించి దాన్ని అందజేసే యేర్పాటు చేసి, అక్కణ్ణుంచి వెళ్ళిపోయాడు. అతనేదో చైనా చక్రవర్తి అయినట్టు అట్ట హాసంగా దుకాణం యజమాని అతన్ని వాకిలిదాకా సాగనంపాడు. యీ లోపున యెక్కడ్నో దగ్గర్లో, వీధి సంగీత వాయిద్యకారుడెవరో తన సెల్లో* శ్రుతి చేసి దానిమీద కమాను ఆడిస్తూ విచారంగా అద్భుతంగా దాన్ని మోగే టట్టు చేస్తున్నాడు. అతని నేస్తం, వేణువు వాయించేవాడు, యీ తీగల గానానికి కలస్వన గళమైన ఊళని కురిపిస్తున్నాడు. ఎండ మత్తులో వున్న పెరటిని నింపిన ఆ సాదా పాట గ్రే వీనులసోకింది, తక్షణం యేం చెయ్యాలో అతనికి తెలిసింది. వాస్తవానికి మధ్యనంతా అతను ఆధ్యాత్మిక దివ్య దృష్టి తాలూకు శుభసూచక ఉన్నత స్థానంలో వున్నాడు. అక్కడినుంచి యదార్థం అందించే ప్రతీ సూచన, ప్రేరేపణ స్పష్టంగా పరిశీలింప గలుగుతున్నాడు. దారిన పోయే వాహనాల శబ్దంలో మునిగిపోగా మిగిలిన యీ స్వరాలని విన్నాక అతను పెల్లుబికిన అతిముఖ్యమైన అనుభూతుల, ఆలోచనల అంతరంగంలోకి, తన స్వభావానికి అనుగుణంగా యీ సంగీతంతో వుండేటట్టుగా, ప్రవేశించి తను అనుకున్నది యెంతగా యెలా తేలుతుందో ముందే దర్శించగలిగాడు. సందు దాటి గ్రే ఆ సంగీతం వస్తూవున్న యింటి గేటులోకి వెళ్ళాడు. యీ పాటికి వాయిద్యకారులు ముందుకు పోవడానికి సిద్ధమవుతున్నారు. వేణువు వూదే పొడుగాటి మనిషి బతికి చెడ్డవాడు. అతను నాణేలు విసురుతూ వున్న కిటికీల కేసి కృతజ్ఞతా సూచకంగా టోపీ వూపాడు. సెల్లో తన యజమాని భుజంమీద మళ్ళీ వేలాడు తోంది. అతను చెమ్మగా వున్న తన నుదుటిని తుడుచుకుంటూ వేణువు వాయించే అతనికోసం చూస్తున్నాడు.

''ఓయ్! నువ్వా, జిమ్మర్!'' అన్నాడు గ్రే అతన్ని గుర్తుపట్టి. అతను ''సొమ్ము పెడితే షోకు'' అనే బార్‌లో అద్భుతంగా వాయించి, సాయంత్రం వేళల్లో సరంగుల్ని వినోదింపచేస్తాడు. ''ఏమిటి నీ వాయులీనం వదిలేశావ్?''

''కేప్టెన్‌గారూ'' అని సొగసుగా అభ్యంతరం చెప్పాడు జిమ్మర్. ''కాస్త చప్పుడు చేసి కిర్రుకిర్రు లాడే దేన్నైనాగానీ నేను వాయిస్తా. నా యౌవనంలో నేనో సంగీత విదూషకుణ్ణి. యిప్పుడు నేను కళకోసం కాంక్ష పెంచు కున్నాను. నా ప్రతిభని దుబారా చేసేసానని యిప్పుడు భారమైన హృదయంతో గుర్తిస్తున్నాను. అందుకని యీ మధ్యన వచ్చిన దురాశ కారణంగా యిప్పుడు నేను రెండింటినీ యేక కాలమందే యిష్టపడతాను: సెల్లోనీ, వాయులీనాన్నీ. సెల్లోని పగలూ వాయులీనాన్ని సాయంత్రమూ వాయిస్తా ఆ రకంగా నేను విలపిస్తున్నట్టూ, పోగొట్టుకున్న ప్రతిభకి దుఃఖిస్తున్నట్టూ కనిపిస్తా. కొంచెం మద్యం యిప్పిస్తారా? వూఁ! సెల్లో నా కార్‌మెన్,** కాని వాయులీనం....''

''నా అస్సోల్'' అన్నాడు గ్రే.

జిమ్మర్ దీని అర్థం గ్రహించలేదు.

''అవును'' అని అతను బుర్ర వూపాడు. ''తప్పెట్లమీదగాని యిత్తడి బూరాలమీదగాని వాయించే సోలో మళ్ళీ యింకోటి. యేమైనా, నా కేంటి పట్టింపు? కళా విదూషకుల్ని కోణంగి చేష్టలు చేసి మూతి ముడు చుకోనివ్వండి — వాయులీనంలోనూ, సెల్లోలోనూ గంధర్వులు కాపరం వుంటారండీ.''

''మరి నా తూతూల్లో యేమిటి వుంది?'' అన్నాడు వస్తూ, వేణువు వాయించేవాడు. అతను నీలం కళ్ళూ, వుంగరాలు తిరిగిన రాగి గడ్డమూ వున్న పొడుగాటి మనిషి. ''ఏం, చెప్పు.''

---

* మోకాళ్ళ దగ్గర పెట్టుకుని వాయించే నాలుగు తీగల పెద్ద రకపు వాయులీనం. — సం.

** కార్‌మెన్ — ప్రముఖ సంగీతకారుడు బీజె రాసిన ఒక ఒపెరాలోని నాయిక పేరు. — సం.

"అదంతా పొద్దుటినుంచీ నీకు తాగడానికి యెంత వుందీ అన్నదానిమీద **ఆధారపడి వుంటుంది. ఒకో** అప్పుడు పక్షి, ఒకో అప్పుడు మద్యం పొగలు. కేప్టెన్‌గారూ, నా మిత్రుడు **దూన్ అండి. మీరు పాపం చేసే**టప్పుడు యెలా డబ్బు వెద జల్లేస్తారో దాన్ని గురించి అతనికి చెప్పానండి. మీరంటే వెర్రెత్తి పోతున్నాడనుకోండి, చూడని దృశ్యం కదా."

"అవునండి" దూన్ అన్నాడు. "నాకు వైభవోపేత చేష్టలన్నా, దాతృత్వమన్నా యిష్టం. కాని నేను జిత్తులమారిని, అంచేత నేను వెర్రిగా ఉబ్బెయ్యడాన్ని నమ్మకండి."

"సరే బాగుంది" అని గ్రే చిరునవ్వు నవ్వాడు. "నాకు కొంచెం అవ్యవధిగా వుంది. వున్న వ్యవహారం తొందరది. మీరు కొంత సొమ్ము చేసుకునే అవకాశం చూపిస్తాను. ఒక మేళం తయారు చేసుకోండి కాని శవసంగీతం వాయిస్తూ అసలు సంగీత జ్ఞానం మర్చిపోయిన వాళ్లతోటీ — యింకా అధ్వాన్నం — భోజనరాయుళ్ల గుడగుడలో సంగీత ఆత్మని మరిచిపోయి, మెల్లిగా తమ అయోమయపు స్వరాలతో ప్రదర్శనశాలమీద పీనుగ పొర్లను కప్పే బాపతు వాళ్లతోటీ కాదు — వద్దు. సాదాజనుల హృదయాలని కదిలించే వాళ్లని, మీలా తిరిగే వాళ్లని మీ మిత్రుల్ని పోగుచెయ్యండి. సముద్రమూ, ప్రేమా పండితమ్మన్యులని తట్టుకోలేవు. మీతో కాసేపు పానగోష్ఠి చేసి ఒక సీసా కాళీచేద్దును గాని, నేను వెళ్లిపోవాలి. నాకు చాలా పనుంది. యిదిగో యిది తీసుకుని "అ" అనే అక్షరం కోసం తాగండి. నేను చెప్పింది మీకు అంగీకారం అయితే సాయంత్రం "సీక్రెట్" నౌక దగ్గరికి రండి. మొదటి కట్టదగ్గర లంగరు దిగి వుంటుంది అది."

"అభేష్!" అన్నాడు జిమ్మర్, గ్రే చక్రవర్తిలాగా ముట్టచెప్పతాడని తెలిసి. "దణ్ణంపెట్టు, దూన్, 'వూ' అని సంతోషంతో నీ టోపీ వూపు. కేప్టెన్ గ్రే పెళ్లి చేసుకోవాలని తీర్మానించుకున్నాడు."

"అవును" గ్రే మామూలుగా అన్నాడు. "ఆ వివరాలన్నీ ఓడమీద చెప్తా. నీకు సంబంధించి..."

"యిది 'అ' కోసం!" అని దూన్, జిమ్మర్‌ని మోచేత్తో పొడిచి గ్రే కేసి కన్ను గీటాడు. "కాని... వర్ణమాలలో చాలా అక్షరాలున్నాయి! మరి 'క్ష' కోసం కూడా మాకేదేనా దయచెయ్యరా?"

గ్రే వాళ్లకి యింకొంచెం సొమ్ము యిచ్చాడు. ఆ వాయిద్యగాళ్లు వెళ్లిపోయారు. అప్పుడతను ఒక కమీషన్ ఏజెంట్ దగ్గరికి వెళ్లి ఆరు రోజుల వ్యవధిలో పూర్తయిపోయే హడావుడి పనిని రహస్యంగా, కొంచెం నదురుగా వుండే సొమ్ముకే కుదిర్చాడు. గ్రే తన ఓడదగ్గరకి తిరిగివచ్చేటప్పటికి ఏజెంట్ స్టీమ్‌బోటు యెక్కుతున్నాడు. సాయంత్రానికి పట్టు చేరింది; లెతికా యింకా రాలేదు. వాయిద్యకారులూ రాలేదు. గ్రే పాంటెన్‌తో మాట్లాడ్డానికి వెళ్లాడు.

గ్రే అదే సిబ్బందితోటి కొన్ని యేళ్లు ప్రయాణం చేస్తున్నాడు. మొదట్లో కేప్టెన్ తన తిక్క ప్రయాణాల తోటీ, బస చెయ్యడాలతోటీ — ఒకో అప్పుడు అవి నెలల తరబడి వుండేవి — అది కూడా అసలు వ్యాపారంగాని, జనంగాని లేని స్థలాల్లో అలా చేసి, సిబ్బందికి గందరగోళం కలిగించాడు. కాని క్రమేణా వాళ్లు గ్రేగారి "గ్రే సిద్ధాంతం"తోటి ఉత్తేజితులయ్యారు. తరచుగా అతను మంచి లాభసాటి రవాణాని వూరికే సరుకు తనకి బాగా లేదనిపించినంత మాత్రాన వదులుకుని అడుగుబరువుతోటే ప్రయాణం చేసేవాడు. వూరికే పడివుండి, నిస్తబ్ధ అవసరపు నిర్జీవ చిత్రాలని ఉద్భూతం చేసే సబ్బు, మేకులు, యంత్ర భాగాలు లాంటి వాటిని తీసుకెళ్లమని అతనికి ఎవరూ కూడా చెప్పలేరు. కాని అతను యెప్పుడూ కూడా పళ్లూ, పింగాణీ, జంతువులు, సుగంధద్రవ్యాలు, తేయాకు, పొగాకు, కాఫీ, పట్టు, నల్ల విరుగుడు చేవ, మంచి గంధం, టేకులాంటి అరుదైన కలప రకాలు తీసికెళ్లడానికి సిద్ధంగా వుండేవాడు. యిదంతా అతని భావనాత్మక కులీనత్వంతోటి, ఒక వర్ణనీయ వాతావరణాన్ని సృష్టిస్తూ, సరితూగి వుండేది. అలాంటి సహజ స్వభావంతో తీర్చిదిద్దిన "సీక్రెట్" నౌక సిబ్బంది సాదా, సామాన్య లాభం అనే పొగ కమ్ముకుపోయిన మిగతా నౌకలని చిన్న చూపు చూడ్డంలో

వింతేమీ లేదు. అయినా కూడా ఈ సారి గ్రే వాళ్ల ప్రశ్నార్థక దృక్కుల్ని గమనించాడు: పరమ మొద్దు నావి కుడికి కూడా తెలుసు వన్య నదిలో ఓడని మరమ్మత్తుల కోసం వుంచక్కర్లేదని.

పాంటెన్ మామూలుగానే గ్రే ఆజ్ఞల్ని వాళ్లకి అందజేశాడు. గ్రే లోపలికి వచ్చేటప్పటికి అతగాడు ఆరవ చుట్ట తగలేస్తూ, అంత పొగతోటి దిమ్మెక్కిపోయి కుర్చీలమీద దొర్లుతూ, గదిలో అటూ యిటూ పచారుచేస్తున్నాడు. సాయంత్రం అవుతోంది. ఓడ తెరిచిన గవాక్షంగుండా బంగారు కాంతిరేఖ దూసుకుని వస్తోంది. కేప్టెన్ టోపీమీద మెరుగుపెట్టిన జీరా అందులో తళతళలాడుతోంది.

''ప్రతీదీ ఓడ తీరులోనే వుంది'' అన్నాడు పాంటెన్ ముటముటలాడుతూ. ''మీరు కావాలంటే మనం యిప్పుడు లంగరెత్తచ్చు.''

''యీ పాటికి నన్ను గ్రహించివుండాలి నువ్వు'' అన్నాడు గ్రే దయగా. ''నేను చేస్తున్నదాంట్లో నిగూఢ మైందేమీ లేదు. లిలియన్‌లో మనం లంగరు దించిన వెంటనే నీకు సమస్తమూ చెప్తాను. అంచేత నువ్వు చవకబారు చుట్టలమీద అన్ని అగ్గి పుల్లలు తగలేసుకోనక్కర్లేదు. వెళ్లి లంగరు యెత్తు.''

పాంటెన్ యిబ్బందిగా చిరునవ్వు నవ్వి, కనుబొమలు గీరుకొన్నాడు.

''అవును. నాకు తెలుసు. నేను తెలుసుకోలేదని... సరే.''

అతను వెళ్లిపోయింతర్వాత గ్రే కొంచెం సేపు నిశ్చలంగా ఓరగా తెరిచిన తలుపులోనుంచి బయటికి చూస్తూ కూర్చుని వుండిపోయాడు. అప్పుడు తన గదికి వెళ్లిపోయాడు. అక్కడ మొదట అతను కూర్చుండి పోయాడు. అప్పుడు బరువుల్ని పైకి చేదేయంత్రం భారమైన గొలుసుని లాగే ధ్వనిని విని, పైకి అల్కావ్ డెక్కుమీదకి వెడదామనుకుని మళ్లీ ఆలోచనా మగ్నుడైపోయి, తన బల్ల దగ్గరికి తిరిగివచ్చాడు. అక్కడ తన వేలిని తైలవస్త్రం పైన అడ్డంగా గీశాడు. తలుపుమీద ముష్టితాకిడి అతన్ని చలచిత్త ధ్యానంనుంచి మళ్లించింది. అతను తలుపు తీశాడు, లెతికా లోపలికి వచ్చాడు. ఆ నావికుడు, గట్టిగా ఒగురుస్తూ, ఆఖరి క్షణంలో ఉరిశిక్షని తప్పించిన వార్తాహరుడిలాగా చూస్తూ అక్కడ నుంచున్నాడు.

''కొయ్యమీద నేను నుంచున్న చోటనుంచి నాలో నేనే అనుకున్నాను 'పావ్రోయ్ లెతికా గబగబా' అని, యిక్కడ బరువులని చేదేయంత్రం చుట్టూ మన జనం నుంచుని నాట్యం చేస్తూ వుండడం చూసి. నాది గద్ద చూపు. ఎగురుకుంటూ వచ్చేశాను. తండేలు వెనక్కాల యెంత ఆయాస పడిపోయానంటే అతగాడు వీరసపడి చెమటలు కక్కాడు. నన్ను వెనక వదిలేద్దా మనుకున్నారా, కేప్టెన్?'' అని అడిగాడు.

''లెతికా'' అన్నాడు గ్రే, రక్తారుణమైన అతని కళ్లకేసి చూస్తూ. ''యీ ఉదయంలోపునే వస్తావని చూశాను. నెత్తిమీద చన్నీళ్లు పోసుకున్నావా?''

''ఆఁ. కాని సరుకు గొంతుకు దిగిపోయినంత కాదు. కాని పోసుకున్నాను. ప్రతీదీ నిర్వర్తించాను.''

''ఏదీ చెప్పు.''

''మాట్లాడి లాభంలేదు కేప్టెన్. యిదుగో యిక్కడ అంతా రాసివుంది. చదవండి. నాకు చేతనైనంత చేశాను. పోతున్నాను.''

''ఎక్కడికి?''

''మీ చూపుల్ని బట్టి తగినన్ని చన్నీళ్లు నెత్తిమీద పోసుకోలేదని నేను గ్రహించగలుగుతున్నాను.''

అతను వెనక్కి తిరిగి గుడ్డివాడిలా వింత కదలికతో నిష్క్రమించాడు. గ్రే ఆ కాగితం తెరిచాడు. వంగి పోయి వంకరగా వున్న కంచెలాగా రాసిన కొక్కిరి గీతలకి పెన్సిలు ఆశ్చర్య పోయివుంటుంది. యిదీ లెతికా రాసింది:

''ఆజ్ఞమేరకి నేను సాయంత్రం అయిదు తర్వాత వీధిలో పోయాను. బూడిద రంగు కప్పు వున్న ఒక యింటికి అటూ యిటూ రెండు కిటికీలు వున్నాయి; దానికి కాయగూరల తోట వుంది. ప్రస్తుతం చర్చనీయ

 వ్యక్తి రెండు సార్లు యువతలికి రావడం జరిగింది. ఒక సారి నీళ్లకి, యింకో సారి పొయ్యి రాజేసుకోవడానికి. చీకటి పడ్డ తర్వాత కిటికీలో నుంచి చూడగలిగాను, కాని తెరలుండటం వల్ల యేమీ కనిపించలేదు.''

ఆ తర్వాత సంసార పక్షంగా వుండే కొన్ని గుర్తులు వున్నాయి. సారా తాగుతూ సంభాషణలో లెతికా వాటిని ఏరుకుని వుంటాడు యేమంటే ఆ జ్ఞాపిక వున్నట్టుండి యీ మాటలతో ముగిసిపోయింది: ''నా బరాతం సరిపెట్టడానికి కొంచెం చేర్చాల్సి వచ్చింది.''

యేమైనా ఆ చీటీ సారాంశం మొత్తం విషయాల్ని తేటతెల్లం చేసింది. గ్రే ఆ కాగితాన్ని బల్లమీద పెట్టి, కాపలా మనిషిని పిలిచి పాంటెన్‌కి కబురుపెట్టాడు, కాని తండేలు ఆట్‌వుడ్, పైకి మడుచుకున్న చొక్కా చేతుల్ని గబగబ కిందికి విప్పుకుంటూ తయారయాడు.

''మనం కట్టదగ్గర కట్టేసి వున్నాం. మీ ఆజ్ఞలేమిటో కనుక్కుని రమ్మని పాంటెన్ నన్ను పంపించాడు. కొంతమంది మనుషులెవరో కొమ్ము బూరాలతోటీ, మద్దెళ్లతోటీ మిగతా వాయులీనాలతోటీ వచ్చారు. వాళ్లతో జగడంలో వున్నాడు. మీరు వాళ్లని ఓడమీదకి రమ్మని చెప్పారా? పాంటెన్ మిమ్మల్ని రమ్మంటున్నాడు. తన తల తిరిగిపోతోందని అతను అంటున్నాడు.''

''అవును, ఆట్‌వుడ్. నేను ఆ వాయిద్యకారుల్ని ఓడమీదకి రమ్మని పిలిచాను. వాళ్లని సిబ్బంది బసలోకి పొమ్మని చెప్పు యీలోపున. వాళ్ల సంగతి తర్వాత చూద్దాం. వాళ్లతోటీ సిబ్బందితోటీ నేను డెక్కుమీదకి పదిహేను నిముషాల్లో వస్తానని చెప్పు. నువ్వూ, పాంటెన్ కూడా నేను చెప్పేది వింటారని అనుకుంటాను.''

ఆట్‌వుడ్ ఎడమ కనుబొమని ముడిచాడు. అతను తలుపుదగ్గర కొన్ని క్షణాలు నిలిచి, తర్వాత జారిపోయాడు. గ్రే తర్వాత పది నిముషాలు ముఖాన్ని చేతులతో కప్పుకుని గడిపాడు. అతను దేనికీ సన్నద్ధం అవడం లేదు, యేమీ గుణించుకోవడమూ లేదు. కొంచెం సేపు నిశ్శబ్దంగా వుందామని అతనికి అనిపించిందంతే. యీ లోపున ప్రతి ఒక్కళ్లూ అతనికోసం ఆత్రుతతోటీ వూహలతో నిండిన కుతూహలంతోటీ నిరీక్షిస్తున్నారు. అతను వచ్చాడు. అసాధారణమైన విషయాలని వేటినో ఆశిస్తూన్న వాళ్ల ముఖాల్ని చూశాడు. కాని జరగబోయేది మామూలు విషయంగా అతను పరిగణిస్తున్నాడు కాబట్టి, యీ పై మనుషుల ఉద్వేగం అతనిలోనే, ఒక చిరాకు ద్యోతకమయ్యేట్టు ప్రతిబింబించింది.

''యిది అసాధారణమైందేమీ కాదు'' అన్నాడు గ్రే వారధి నిచ్చెనమీద కూర్చుంటూ. ''మోకులు మార్చుకునే దాకా మనం నదిమీదే వుందాం. యిక్కడికి తెచ్చిపెట్టిన ఎర్ర పట్టుని మీరంతా చూశారు. తెర చాపలు చేసే బ్లెంట్ మన 'సీక్రెట్'కి కొత్త తెరచాపలు చేసే పనిలో వుంటాడు. అప్పుడు ప్రయాణం మొదలు పెడదాం. ఎక్కడికైందీ నేను చెప్పలేను. యేమైనా యిక్కణ్ణుంచి దూరం కాదు. నేను మా ఆవిడ కోసం పోతున్నాను. ఆమె యింకా నా భార్య కాదు, కాని అవుతుంది. నేను ఓడమీద ఎర్ర తెరచాపలు కట్టాలి, యేమంటే ఒప్పందం ప్రకారం అప్పుడు ఆమె దూరంనుంచి మనల్ని గుర్తుపడుతుంది. అదీ సంగతి. ఏం, యిందులో మర్మగర్భితమైంది యేమీ లేదు, మీకు తెలుసు. యింక దాన్ని గురించి యేమీ చెప్పం.''

''నిజం'' అన్నాడు ఆట్‌వుడ్, సిబ్బంది చిరునవ్వు ముఖాల కేసి చూసి, వాళ్లు సంతోషభరితమైన సంభ్రమంతో వున్నారనీ, కానీ మాట్లాడే సాహసం చెయ్యడం లేదనీ గ్రహించి. ''అంచేత అదీ, యేం కేప్టెన్.... నిర్ణయించడానికి మేం తగం. మేం వూరికే శిరసా వహిస్తాం. ప్రతీదీ మీరు కోరినట్టే జరుగుతుంది. మా అభినందనలు అందజేస్తున్నాం.''

''కృతజ్ఞతలు'' గ్రే ఆ తండేలు చేతిని అదిమాడు, కాని అతగాడు అతీంద్రియ ప్రయత్నంతోటి ఆ కరచాలనానికి యెంత దృఢంగా బదులు యిచ్చాడంటే కేప్టెన్ లొంగాల్సి వచ్చింది. ఆ తర్వాత సిబ్బంది,

అభినందనలని తెలియచేసే మాటల్ని గొణుగుతూ, ఒకడి ఆదరపూర్వక చిరునవ్వు తర్వాత యింకొకడు ఆదర పూర్వక చిరునవ్వుతోటి వచ్చారు. ఎవళ్ళూ అరవలేదు, ఎవళ్ళూ ఉల్లాసం వ్యక్తం చెయ్యలేదు యేమంటే వాళ్ళకి కేప్టెన్ ఉపన్యాసంలో చాలా ప్రత్యేకమైందేదో గోచరించింది. పాంటెన్ అమ్మయ్య అని నిట్టూర్చి, తేట పడ్డాడు — అతని గుండెలమీద వున్న బరువు కరిగిపోయింది. ఓడ వడ్రంగి ఒక్కడే అసంతృప్తుడైనట్టు కనిపించాడు. అతను నిరుత్సాహంగా గ్రే చేతిని ఆస్ఫాలించి, ముసురు మూతితోటి అన్నాడు:

''అసలు దీన్ని గురించి యెలా అనుకోగలిగారు, కేప్టెన్?''

''యిది నీ గొడ్డలి దెబ్బలాంటిది. జిమ్మర్! ఏరీ, నీ కుర్రాళ్ళు?''

ఆ వాయులీనకారుడు, వాయిద్యగాళ్ళని వీపులమీద చరుస్తూ ఆ గుంపులోనుంచి మురికి బట్టలేసుకున్న వాళ్ళని యేడుగురిని ముందుకు తోశాడు.

''యిదుగోనండి. యిది తుత్తార. వీడు వాయించడు, పేలుస్తాడు. గడ్డంలేని యీ కుర్రాళ్ళు బాకా వూత్తారు. వీళ్ళు వూత్తూవుంటే ప్రతి వాళ్ళకీ యుద్ధంలోకి పోదామనిపిస్తుంది. యింకా సన్నాయి, తూతూబాకా, వాయులీనం వున్నాయి. వాళ్ళంతా ఉత్సాహభరితమైన నాయకుణ్ణి, అంటే నన్ను, అనుసరించి రావడంలో సిద్ధహస్తులు. మా మజామేళానికి ముఖ్యుడున్నాడు — ఫ్రిట్స్, భేరీ వాయిద్యకాడు. మీకు మృదంగం వాళ్ళు మామూలుగా నిరుత్సాహంగా వుంటారు, కాని యితను మాత్రం హుందాగా, ఔత్సుక్యంతోటి వాయిస్తాడు. అతను వాయించడంలో మనసు విప్పుకుని వున్నదీ, భేరీ కొట్టే కర్రలాంటి నిదానమైందీ యేదో వుంది. యింకా యేమన్నా మిగిలిందా, కేప్టెన్ గ్రే?''

''అద్భుతం. సామాన్ల గదిలో ఓ జాగా మీకోసం కేటాయింపు అవుతుంది. మరిప్పుడది వినోద గీతాల తోటే, విళంబితాలతోటే, షడ్జమాలతోటే నిండిపోతుంది. మీమీ స్థానాలకి వెళ్ళండి. వదులు, ఓడని ముందుకు పోనీ, పాంటెన్. నిన్ను రెండు గంటల్లో వదిలేస్తాను.''

అతని చైతన్యాన్ని యెన్నడు వదలివుండని ఆంతరంగిక సంగీతం అనుసరించి, నాడులని స్పందన వదిలి వుండనట్టుగా, యీ రెండు గంటలూ గడిచిపోవడం అతను గమనించలేదు. అతనికి వున్నదల్లా ఒకే ఆలోచన, ఒకే కోరిక, ఒకే గమ్యం. కార్యాచరణశీలిగా అతను తన మనోనేత్రం ముందు సంఘటనలని దర్శించాడు, ఒక్క దానికే విచారిస్తూ. దాన్ని గళ్ళబోర్డుమీద పావుల్ని కదిపినంత సులభంగా వేగంగా కదపలేమే అని. పైకి కనిపించే అతన్ని ప్రశాంతతలోని యేదీ అతని అంతర్గత ఉద్వేగాన్ని తెలియజెయ్యడం లేదు. పైన ఒక పెద్ద గంటని మోగిస్తున్నట్టుగా ఆ ఉద్వేగపు నాదం అతని నాడులన్నిటా బధిరం కావించే ఉద్విగ్న రోదనని చేస్తోంది. ఆఖరికి అది అతను లెక్కపెట్టుకునేటట్టు చేసింది: ''ఒకటి.... రెండు.... ముప్పై'' — అలాగ, అతను ''ఒక వెయ్యి'' అనే దాకా. యీ మానసిక అభ్యాసానికి గుణం కనిపించింది: అతను ఆఖరికి ఆ పథకాన్ని గురించి ఒక నిస్సంగత్వ ధోరణి అవలంబించగలిగాడు. అస్సాల్ మనిషిగా యెలాంటిదీ అని వూహించుకోను కూడా లేనందుకు, యేమంటే అతను ఆమెతో అసలు మాట్లాడలేదు కనక, కొంచెం ఆశ్చర్యపడ్డాడు. అసంపూర్తిగానే అయినా కూడా ఆ వ్యక్తిని గురించి తను వూహించుకోగలిగినట్లయితే, ఆ వ్యక్తి వదనంమీద కవళికని అనుకరిస్తే ఆ వ్యక్తిని అర్థంచేసుకోవచ్చని అతనో సారి చదివాడు. గ్రే కళ్ళు ఆఖరికి తమకి పరాయిదైన వింత ధోరణిని వహించ నారంభించాయి. మీసం కింద పెదాలు నీరసమైన, పిరికి చిరునవ్వుతో మెలి తిరుగుతున్నాయి. అతను హఠాత్తుగా పగలబడి నవ్వి పాంటెన్‌ని వదిలిపెట్టడానికి వెళ్ళాడు.

చీకటిగా వుంది. పాంటెన్ చొక్కా కాలరు యెత్తుకుని వున్నాడు. దిక్సూచికి అటూ యిటూ నడుస్తున్నాడు, చుక్కాని తిప్పేవాడితో చెబుతూ:

''ఎడంవేపు నాలుగో వంతు. ఎడంవేపు. ఆగు. ఒక పావు యెక్కువ.''

 ఓడ "సీక్రెట్" గాలికి అనుగుణంగా సగం తెరచాపలు యెత్తి ప్రయాణిస్తోంది.

"మీకు తెలును కదా, నాకు తృప్తిగా వుంది" పాంటెన్ గ్రేతో అన్నాడు.

"దేనివల్ల?"

"మీరెప్పుడూ అంతే. నాకిప్పుడు తెలిసింది. సరిగ్గా నాకది వారధిమీదనే తట్టింది." అతను దొంగ చూపుతో కన్ను గిలికాడు, అతని పైపు నిప్పులో అతని చిరునవ్వు వెలిగింది.

"నువ్వు చెప్పటం లేదు?" అన్నాడు గ్రే, అతను దేన్ని ఉద్దేశిస్తున్నాడో హఠాత్తుగా అర్థం చేసుకుంటూ. "నీకు తెలిసిందేమిటి?"

"దొంగగా తీసుకుపోడానికి యిదే ఉత్తమ మార్గం. యిష్టమైన యెలాంటి తెరచాపనేనా ఎవడేనా తీసుకోవచ్చు. మీరు మేధావులు, గ్రే."

"పాపం పాంటెన్!" అన్నాడు కెప్టెన్ నవ్వులో కోప్పడలో తెలీక. "నీ వూహ యుక్తివంతమైందే కాని దానికి యే రకమైన ఆధారమూ లేదు. పోయి పడుకో. నువ్వు తప్పు అని రాసిస్తాను. నేను సరిగ్గా అన్నట్టే చేస్తున్నాను."

అతన్ని పంపేసి తను మార్గాన్ని సరిజూసుకుని కూర్చున్నాడు.

# అస్సోల్ ఒంటరిగా వుంటుంది

లాంగ్‌రెన్ ఆ రాత్రి సముద్రంమీద గడిపాడు. అతను నిద్రపోనూ లేదు, చేపలు పట్టనూ లేదు. ఒక ప్రత్యేక గతి అంటూ లేకుండా, నీటి తపతపని వింటూ, నిశీధిలోకి చూస్తూ, గాలికి ముఖాన్ని యెత్తి, ఆలోచిస్తూ పడవని నడుపుకుని పోయాడు. అతని జీవితంలోని అత్యంత కష్టకాలంలో యీ యేకాంత సంచారాలంతగా మరేదీ అతనికి స్వాస్థ్యం చేకూర్చలేదు. నిశ్చలత, ఏకాంతమూనే అతని ఆంతరంగిక ప్రపంచంలోని అతి నీరసమైన, అతి అస్పష్టమైన స్వరాలని స్పష్టంగా ధ్వనించేందుకు అతనికి అవసరమైనవి. యీ రాత్రి అతని ఆలోచనలు భవిష్యత్తును గురించీ, దారిద్ర్యాన్ని గురించీ, అస్సోల్ గురించీ వున్నాయి. కొద్ది కాలానికే అయినా గానీ ఆమెని వదిలిపెట్టడం, అతనికి దుర్భరం. దీనికి తోడు మానిన వుండుని రేపినట్లవుతుంది. ఓడ ఉద్యోగంలోకి చేరింతర్వాత బహుశా తను మళ్లీ కపేర్నాలో తన ప్రియబాంధవి యెన్నడూ చనిపోలేదనీ, నిరీక్షిస్తోందనీ వూహించుకుంటాడు — తిరిగి వచ్చి అతను నిర్జీవపుటాశతో కూడిన దుఃఖంలో యింటిని సమీపిస్తాడు. మేరీ యిక గుమ్మంలోకి రాదు. అతను అస్సోల్‌కి తిండి సమకూర్చదలచుకున్నాడు. అంచేత ఆమెకోసం తన బాధ యేం చెయ్యమని అపేక్షిస్తే అది చెయ్య సంకల్పించుకున్నాడు.

లాంగ్‌రెన్ తిరిగి వచ్చేటప్పటికి ఆ పిల్ల యింటికి రాలేదు. ప్రాతఃకాలమే ఆమె షికారు వెళ్లడం అతనికి బాధకలిగించలేదు. కాని యిప్పుడు అతని నిరీక్షలో ఒక ఆతృత జాడ గోచరించింది. అటూ యిటూ పచారుచేస్తూ అతను మలుపు తిరిగి హఠాత్తుగా అస్సోల్‌ని చూశాడు. వేగంగా నిశ్శబ్దంగా ఆమె ఒక్క మాట కూడా అనకుండా అతని దగ్గరకు వెళ్లి, తన ఉద్వేగంలో ప్రతిబింబించిన కాంతివంతమైన కవళికతోటి అతన్ని దాదాపు భయపెట్టేసింది. ఆమెలోని ద్వితీయ జీవి బయటకి వచ్చినట్లైంది — నిజమైన జీవి, దానికి ఒక వ్యక్తి కళ్లే మామూలుగా సాక్షి. ఆమె నిశ్శబ్దంగా, లాంగ్‌రెన్ ముఖంలోకి యెంత వింతగా చూసిందంటే అతను గబగబా అడిగాడు:

"వంట్లో బాగా లేదా?"

ఆమె వెంటనే జవాబు చెప్పలేదు. అతని మాటల అర్థం ఆఖరికి తన చెవులకి అందగానే, ఒక కొమ్మ చేత్తో ముట్టుకుంటే కదిలినట్టుగా అస్సాల్ కంపించింది. దీర్ఘ, సమతర ప్రశాంత విజయ హాస ప్రతి ధ్వనిలా నవ్వింది. ఆమెకి చెప్పాల్సింది యేదో వుంది. కాని, యెప్పటిలాగానే, అది యేమిటై వుండేదీ ఆమె ఆలోచించుకో నక్కర్లేకపోయింది. ఆమె అంది:

''వుహుం. బాగానే వుంది. నా కేసి అలా చూస్తున్నావేం? నేను ఆనందంగా వున్నాను. నిజంగా, ఒట్టు. యీ రోజు యెంతో బావుండబట్టే. నువ్వేమనుకున్నావ్? నీ చూపునిబట్టి నువ్వేదో అనుకున్నట్టే వుంది.''

ఆమెని తన ఒళ్లో కూర్చోబెట్టుకుంటూ లాంగ్‌రెన్ అన్నాడు: ''నేను యేమనుకుంటే యేం, నేనెందుకు యిలా చేస్తున్నానో నువ్వు అర్థం చేసుకుంటా వనుకుంటాను. మనకి జీవనాధారం లేదు. నేను దూరం ప్రయాణం చేస్తూపోను. కాని కిస్సేత్‌కీ లిస్‌కీ మధ్య తిరిగే మెయిల్‌బోటులో చేరతాను.''

''అలాగే'' అందామె దూరంనుంచి అంటున్నట్టు, అతని చింతల్ని బాధల్ని పంచుకుంటున్నట్టు, కాని తన ఆనంద అనుభూతిని అణుచుకోలేని అశక్తతకి ఆశ్చర్యపడింది. ''నిజంగా దారుణం. నేను ఒక్కత్తినీ వుండాలి. త్వరగా వచ్చెయ్యి.'' యిలా అంటూ ఆమె అణుచుకోలేని చిరునవ్వుతో వికసించింది. ''త్వరగా, నాన్నా, నేను నీకోసం చూస్తూ వుంటాను.''

''అస్సాల్'' అన్నాడు లాంగ్‌రెన్ ఆమె ముఖాన్ని పుచ్చుకుని తన కేసి తిప్పుకుంటూ, ''చెప్పమ్మా, యేం జరిగింది'' అని అడిగాడు.

అతని భయాన్ని పోగొట్టాలని ఆమెకి అనిపించింది. తన ఉల్లాసాన్ని అదిమి పెట్టుకుని, నూతన జీవంతో మిలమిలలాడే కళ్లుతప్ప, మిగతా అంతా గంభీరంగా ధ్యానపూరితమైపోయింది.

''తమాషాగా వున్నావు. యేమీ లేదు. నేను కాయలు యేరుకుంటున్నాను.''

తను తన ఆలోచనల్లో అంతగా మునిగిపోయి వుండకపోతే లాంగ్‌రెన్ దీన్ని నిజంగా నమ్మి వుండేవాడు కాదు. అప్పుడు వాళ్ల సంభాషణ వ్యవహారవతుగానూ, వివరంగానూ తయారైంది. ఆ నావికుడు కూతుర్ని తన సంచీ సర్దమనీ, తనకేం కావాలో అన్నీ వివరించి, కొన్ని హెచ్చరికలు చేశాడు:

''నేను ఓ పది రోజుల్లో వచ్చేస్తాను. నా తుపాకీ తాకట్టు పెట్టే యింట్లోనే వుండిపో. ఎవళ్లేనా నిన్ను విసిగిస్తే 'లాంగ్‌రెన్ త్వరలోనే వస్తాడు' అని చెప్పు. నన్ను గురించి ఆలోచించద్దు, బాధపడవద్దు. నాకేం భయంలేదు.''

అతను భోజనం చేసి, ఆమెని గట్టిగా ముద్దుపెట్టుకుని, సంచీ భుజాన్న తగిలించుకుని, పట్నానికి పోయే రోడ్డెక్కాడు. అతను మలుపుతిరిగే దాకా అస్సాల్ అతని కేసే చూస్తూ అప్పుడు యింట్లోకి పోయింది. ఆమె చెయ్యాల్సిన యింటి పనులు యెన్నో వున్నాయి. కాని అన్నిటినీ మరిచిపోయింది. ఆమె చుట్టూ కొంచెం ఆశ్చర్య కరమైన ఆసక్తితోటి చూసింది, తనేదో ఆ యింటికి పరాయిదైనట్టు. ఆ యిల్లు ఆమెకి వూహ తెలిసినప్పటి నుంచీ తన చిత్రాన్ని ఆమెలో ప్రతిష్ఠించే వుంది. మరొక భిన్న తరహా జీవితం గడిపి చాలా కాలం తర్వాత తన స్వస్థలాన్ని తిరిగి దర్శించినట్టుగా యిప్పుడు కనిపించింది. తన యీ తిరస్కారంలో యేదో అనుచితమైంది, దోషపూరితమైంది వున్నట్టు ఆమెకి అనిపించింది. లాంగ్‌రెన్ ఆటబొమ్మలు తయారు చేసే ఒక ఓడ వెనక తట్టుకి చుక్కాని అతికించ ప్రయత్నించే బల్ల దగ్గర కూచుంది. ఆ వస్తువుల కేసి చూస్తూ ఆమె తనకి తెలియకుండానే వాటిని వాటి అసలు ప్రయాణంలోనూ, ఉత్సాహంలోనూ వూహించుకుంది. ఆ రోజు ఉదయం జరిగినదంతా, కంపించే ఉద్రేకంతో, ఆమెలో మళ్లీ తరంగించింది, సూర్యుడంత పెద్ద బంగారు ఉంగరం సముద్రం అవతలినుంచి ఆమె కాళ్లమీద పడింది.

ఆమె యింట్లో వుండలేకపోయింది. బయటికి వచ్చి లిస్ కేసి బయల్దేరింది. ఆమెకి అక్కడ పనేలేదు.

 ఎందుకు పోతున్నదీ తెలియమూ తెలీదు, అయినా పోకుండా వుండలేకపోయింది. రోడ్డుమీద యేదో దారి అడిగే మనిషి తటస్థపడ్డాడు. ఆమె అతనికి అన్నీ వివరంగా చెప్పింది. ఆ సంఘటనవి వెంటనే మరిచిపోయింది.

తన మృదువైన ధ్యాసనంతటినీ పూర్తిగా అకట్టుకున్న పక్షిని తను తీసుకుపోతున్నట్టుగా ఆ దీర్ఘ పథం జారిపోయింది. పట్టణాన్ని సమీపించాక ఆమె దృష్టి పెద్ద చౌకులోని గోల వల్ల యేమారింది, కాని దానికి ఆమెమీద పూర్వపు అధికారం లేదు. అప్పట్లో అది ఆమెని బెదిరించి, లొంగదీసి నిశ్శబ్దంగా పిరికిదానిలా చేసేది. ఆమె దాన్ని ప్రతిఘటించింది. ఆమె చౌకు వృత్తాన్ని చెట్ల నీలి నీడలని దాటుతూ, దారిన పోయేవాళ్లకేసి విశ్వసనీయంగా తేలిగ్గా చూస్తూ, స్వయం భావనా రహితంగా, నెమ్మదిగా నడుస్తూ, ధైర్యంగా నిదానంగా నడిచి వెళ్లింది. ఆలోచనలో నిమగ్నమైపోయి, నానావిధ జనుల మూకలో నడిచి వెడుతూ అసాధారణంగా కనిపించే ఆడపిల్ల, యిక్కడ ఆగంతుకురాలు, జాగ్రత్తగా గమనించే వాడి దృష్టికి అందుతుంది. చౌకులో ఆమె నీటిజల దగ్గర చెయ్యి చాచి మిలమిల మెరుస్తూ చిందే నీటిలో వేళ్లు పెట్టింది. అప్పుడు కూర్చుని, కాసేపు విశ్రాంతి తీసుకుని అప్పుడు మళ్లీ అడివిలోకి పోయే రోడ్డుమీదకు వచ్చింది. ఆమె ఆ దారిలో ఉల్లాసభరితంగా వెళ్లింది. పగటి అద్దాల మెరుపుల స్థానే నీడల ప్రశాంత ప్రకాశానికి సాయం వేళలో అవకాశం యిచ్చిన సెలయేటి అంత స్వచ్ఛమైన ప్రశాంత మానసిక స్థితిలో వెళ్లింది. గ్రామాన్ని సమీపించి, తన బుట్ట చిగుళ్లు తొడుగుతోందని భావించిన, బొగ్గుల మనిషిని చూసింది. అతను తన బండి పక్కన మసితోటీ మట్టితోటీ కమ్ముకుపోయిన యిద్దరు పరాయి వాళ్లతో వున్నాడు. వాళ్లు కోపంగా వున్నారు. అస్సోల్‌కి చాలా సంతోషం వేసింది.

''ఓ, ఫిలిప్, ఏం చేస్తున్నావిక్కడ?''

''యేం లేదు, మిడతా, ఓ చక్రం వదులైంది. దాన్ని బిగించాను. కాసేపు చుట్టకాలుస్తూ నేస్తాలతో మాట్లాడుతున్నాను. ఎక్కడికెళ్లావు?''

అస్సోల్ మాట్లాడలేదు.

''చూడు ఫిలిప్ నువ్వంటే నాకెంతో యిష్టం. అందుకనే నీ ఒక్కడికే నేనీ విషయం చెబుతున్నాను. నేను త్వరలోనే వెళ్లిపోతున్నాను. నేను యింక యెప్పటికీ వెళ్లిపోతానేమో. అయినా యెవళ్లకీ చెప్పకేం?''

''అంటే నువ్వు వెళ్లిపోతావా? యెక్కడికి?'' ఆ బొగ్గుల మనిషి యెంతో ఆశ్చర్యపడి నోరు వెళ్లబెట్టాడు. దాంతోటి అతని గడ్డం అసలు వున్న దాని కంటే యింకా పెద్దదైంది.

''ఏమో నాకు తెలీదు.'' ఆమె బండి నుంచున్న ఎల్మ్ చెట్టు కింద ఖాళీనీ, గులాబీ రంగు సంధ్యలో యెంతో పచ్చగా వున్న గడ్డినీ, ముభావంగా ముడుచుకుని వున్న బొగ్గుల మనుషులనూ నెమ్మదిగా చూసింది. కొంచెం సేపు ఆగి, అంది: ''నాకు తెలీదు. నాకా రోజూ, ఆ క్షణమూ, ఆ మాట కొస్తే యెక్కడికి వెళ్లేదీ కూడా తెలీదు. అంతకంటే నీకు యెక్కువ యేమీ చెప్పలేను. అందుకనే నేను సెలవు అంటున్నాను, ఒకవేళ అయితే అని. నువ్వు యెన్నో సార్లు నన్ను బండిలో యెక్కించుకున్నావు.''

ఆమె పెద్ద మసిబారిన చేతిని తీసుకుని కరచాలనం చెయ్యగలిగింది. బిగుసుకుపోయిన చిరునవ్వులో పనివాడి ముఖం చిట్లింది. ఆమె తల పంకించి, తిరిగి వెళ్లిపోయింది. ఫిలిప్ అతని మిత్రులూ తల తిప్పడానికి ముందే ఆమె మాయమైపోయింది.

''చిత్రంగా లేదూ?'' అన్నాడు బొగ్గుల మనిషి. ''అలాంటి మనిషిని యెవరేనా యెలా అర్థం చేసుకోగలరు? యివాళ ఆమెలో యేదో వుంది... వింతగా వుంది, వూఁ.''

''అవును, నువ్వు అన్నది నిజమే'' రెండో మనిషి ఒప్పుకున్నాడు. ''ఆమె అంటోందా లేక మనల్ని నమ్మించేటట్టు చేస్తోందా చెప్పలేవు. పోన్లే మనకెందుకు.''

''అవున్లే, మనకెందుకు'' అన్నాడు మూడో మనిషి, అలా అని నిట్టూర్చాడు.

అప్పుడు ఆ ముగ్గురూ బండిలోకి యెక్కి, రాతి రోడ్డుమీద చక్రాలు కరకర చప్పుడు చేస్తూ వుంటే, 
ధూళి మేఘంలో మాయమైపోయారు.

# ఎరుపు "సీక్రెట్"

ఉదయం తెల్లగా వున్న ఘడియలు. వింత భూతాలతో కలిసిన సన్నని పొగమంచు ఆ మహారణ్యాన్ని నింపేసింది. అజ్ఞాత వేటగాడొకడు అప్పుడే విడిది మంటని వదలిపెట్టి నదికి సమానాంతరంగా వెడుతున్నాడు. దాని మారుత శూన్యకాంతి చెట్లగుండా మిలమిలలాడుతోంది కాని జాగ్రత్తగా పోయే ఆ వేటగాడు నదిని సమీపించలేదు. ఎందుకంటే కొండల కేసే పోయే ఎలుగుబంటి తాజా జాడలు అతను పరిశీలిస్తున్నాడు.

ఆ చెట్లగుండా అనూహ్యమైన భయకారక యాదృచ్ఛికతతోటి ఒక హఠాత్ శబ్దం దూసుకు వచ్చింది. అది ఒక సన్నాయి పాట. ఆ వాయిద్యకారుడు డెక్కుమీదకి వచ్చి, పూర్తి విచారంగా, శోక పౌనఃపున్యంగా వున్న భాగాన్ని వాయించాడు. దుఃఖాన్ని దాచుకుంటున్న గొంతుకలాగా ఆ శబ్దం కంపించింది. అది ఆరోహణ చేసి విచార కలస్వనంతో మందహాసం చేసి హఠాత్తుగా ఆగిపోయింది. దూర ప్రతిధ్వని అదే శ్రుతిని నీరసంగా రాగం తీసింది.

విరిగిన కొమ్మతోటి జాడలు గుర్తుపెట్టి ఆ వేటగాడు నీటి దగ్గరకు వచ్చాడు. పొగమంచు విడలేదు. నదిమీద మెల్లిగా కదులుతున్న పెద్ద నౌక ఆకారరేఖలని అది మసక కమ్మింది. ముడిచిన తెరచాపలు జీవం పుంజుకున్నాయి. తోరణాల్లా వేలాడుతూ, తెరుచుకుంటూ, తమ పెద్ద మడతల నిస్సహాయ కేడేలతోటి తెరచాప కొయ్యల్ని కమ్ముతున్నాయి. అతనికి గొంతుకలూ అడుగుల చప్పుళ్ళూ వినిపిస్తున్నాయి. తీరంమీదగాలి, వీచడానికి ప్రయత్నిస్తూ, తెరచాపలని యెత్త బోతోంది. ఆఖరికి సూర్యుని వెచ్చదనం ఆశించిన ఫలితాన్ని యిచ్చింది. గాలి ఒత్తిడి యెక్కువ అయింది, పొగమంచుని తొలగించింది, గులాబీల్లాంటి లేత అరుణ రూపాలతో తెరచాప కొయ్యలమీద ప్రసరించింది. తెల్లని కొయ్యలమీదా, మోకులమీదా గులాబీ నీడలు జారాయి. యెత్తిన, పూర్తిగా ఎగురుతున్న, నిజమైన ఆనందపు వర్ణంతో వున్న తెరచాపలు తప్ప ప్రతీదీ తెల్లగా వుంది.

ఒడ్డునుంచి చూసే ఆ వేటగాడు తను చూసేది నిజమేననీ, వాస్తవ భిన్నం కాదనీ నమ్మేదాకా కళ్లు నలుముకున్నాడు. ఆ ఓడ ఒక వంపులో మాయమైపోయింది, కాని అతను చూస్తూ యింకా అక్కడే మంచున్నాడు. అప్పుడు భుజాలు యెగరేసి అతను ఎలుగుబంటి వేటలో పడిపోయాడు.

''సీక్రెట్'' తీరంవారే వున్నప్పుడు గ్రే చుక్కానీ వాణ్ణి విశ్వసించలేక, నీటిలో చట్టు దిబ్బలకి భయపడి తనే చుక్కాని దగ్గర వున్నాడు. అప్పుడే గడ్డం గీసుకుని తితిక్షతోటి మూతి ముడుచుకుని, గొర్రెబొచ్చు బట్టలు తొడుక్కుని మెరిసే కొత్త టోపీ పెట్టుకున్న పాంటెన్ పక్కనే కూచున్నాడు. ముందటి లాగానే అరుణ వైభవానికీ గ్రే ఉద్దేశాలకీ సంబంధం యేమిట్లైందీ అతను చూడలేకపోయాడు.

''చూడు'' అని చెప్పాడు గ్రే. ''మన తెరచాపలు ధగద్ధగాయమానంగా వుంటే, గాలి ఆహ్లాదకరంగా వుండి, ఒక ఏనుగు చిన్న బన్నుని చూసి పొందే ఆనందం కంటే యెక్కువ ఆనందంతోటి నా హృదయం ఉప్పొంగిపోతూ వుంటే, నేను నీకు లిస్ట్‌లో వాగ్దానం చేసినట్టుగా నా ఆలోచనలకి శ్రుతి కూర్చడానికి ప్రయత్నిస్తాను. విన్ను మందుడి కిందనో, మూర్ఖుడి కిందనో నేను జమకట్టడం లేదు గుర్తుంచుకో. ఏం, నువ్వు ఒరవడికి దీటైన నావికుడికి, అలా అంటే అందులో యెంతో వుంది. కాని నువ్వు కూడా యెక్కువమంది లాగానే జీవితపు మందమైన అద్దం గుండా వచ్చే సాదా నిజాల స్వరాలని వింటావు. అవి అరుస్తాయి, కాని నువ్వు వినవు. సౌందర్య

 మైనదని అసాధ్యమైనదని ఎప్పట్నుంచో నమ్మిన విశ్వాసంగా నిలుస్తుంది. కాని వాస్తవానికి అది అందుకో దగిందీ, అవకాశం వున్నదీనీ, విహారయాత్రలాగా. నేను చేస్తున్న రీతిలో, నువ్వు చూస్తున్న రీతిలో, తప్ప మరో విధంగా పెళ్ళిచేసుకోకూడని, చేసుకోలేని అమ్మాయిని నువ్వు చూస్తావు.''

మనకి అంత బాగా తెలిసిన దాన్ని అతను క్లుప్తంగా వివరించి యీ రకంగా ముగించాడు:

''చూశావా యిక్కడ విధి, సంకల్పం, మానవ స్వభావం యెంత సన్నిహితంగా పెనవేసుకుపోయాయో. నా కోసం నిరీక్షించే ఆమెదగ్గరికి, నా కోసం మాత్రమే నిరీక్షించగల ఆమె దగ్గరికి, నేను వెడుతున్నాను. నేను కూడా ఆమెని తప్ప మరొకర్ని కోరటం లేదు. బహుశా యెందుకంటే ఆమె పుణ్యమా అని, నేను ఒక సామాన్య నిజాన్ని తెలుసుకోగలిగాను. ఏమిటంటే అద్భుతాలు అని పిలిచేవాటిని నువ్వే నిజపరచాలి. ఒక వ్యక్తి త్రాణాన్ని విలువైనది అనుకొని దాన్ని పొందాలని అతి ప్రాముఖ్యం వుంచితే ఆ మనిషికి ఆ త్రాణాన్ని యివ్వడం కష్టం కాదు, కాని మనసు ఒక పారిజాత వృక్షంమీద ఆశలు నిలుపుకుంటే — ఒక అద్భుతంమీద ఆశపెట్టుకుంటే యీ అద్భుతాన్ని నిజపరచు చెయ్యగలిగితే.

''ఆ వ్యక్తి అంతరంగమూ మారుతుంది, నీదీ మారుతుంది. జైలు ప్రధాన అధికారి తన యిష్టాపత్తిగా ఒక ఖైదీని విడుదల చేస్తే, ఒక కోటీశ్వరుడు తన రాతగానికి ఒక మందిరాన్నీ, గాయకినీ, యినప్పెట్టెనీ యిస్తే, ఒక రౌతు ఒక దురదృష్ట అశ్వానికి తనని దాటిపోయే అవకాశం యిస్తే — అప్పుడు ప్రతీ వాళ్ళకీ అర్థమవుతుంది యిది యెంత వాచాతీతమైన అద్భుతమో. కాని అంత పరిమాణపు అద్భుతాలూ వున్నాయి: ఒక చిరునవ్వు, సంబరం, క్షమ.... మరి, అదునులో అన్న సవ్యమైన మాట. యిదిగనక వుంటే యెవరికేనా అన్నీ వున్నట్టే. నాకు సంబంధించి మా ఆరంభం — అస్సోల్‌దీ నాదీ — యెప్పటికీ కూడా తెరచాపల అరుణకాంతు లీనుతూనే, ప్రేమ అంటే యేమిటో తెలిసిన హృదయపు లోతులు సృష్టించిన తెరచాపలతో, నిండిపోతుంది. ఏం, అర్థమైందా?''

''ఆఁ, కేప్టెన్'' పాంటెన్ గొంతు సవరించుకుని, చక్కగా మడిచిన, శుభ్రమైన జేబురుమాలుతో మీసాన్ని తుడుచుకున్నాడు. ''నాకు ప్రతీదీ అర్థమైంది. నా హృదయాన్ని స్పందింపచేశారు. నేను లోపలికి వెళ్ళి నిక్సుతోటి నిన్న ఓ ముంత ముంచినందుకు కేకలేసిన దానికి యేమనుకోవద్దని చెపుతాను. అతనికి కొంచెం పొగాకు యిస్తాను. అతను తనది పేకాటలో పోగొట్టుకున్నాడు.''

తన మాటలకి కలిగిన తక్షణ ఆచరణాత్మక ఫలితంతోటి కొంచెం ఆశ్చర్యపోయిన గ్రే సమాధానం యిచ్చే లోపునే పాంటెన్ నిచ్చెన మెట్లుదిగి, దూరంలో నిట్టూర్చాడు. గ్రే భుజంమీదనుంచి చూశాడు. ఎరుపు తెర చాపలు పైన తరంగిస్తున్నాయి. వాటి నడిమికుట్లమీద ఎండ ఎరుపు పొగమంచు లాగా ప్రకాశిస్తోంది. ''సీక్రెట్'' సముద్రం కేసి ఉన్ముఖమై వుంది, తీరంనుంచి కదిలిపోతూ. నాదం చేసే గ్రే హృదయంలో సందేహమే లేదు — ఆత్రుత తాలుకు మందమైన తాకిడిగాని, క్షుద్ర విషయాల తొక్కిడిగాని లేవు. నౌక అంతటి ప్రశాంతంగా అతను స్వర్గసమ లక్ష్యం కేసి వెడుతున్నాడు, మాటలకి ముందు వెళ్ళే ఆలోచనలతోటే అతని మనసు నిండిపోయింది.

మధ్యాహ్నానికి నావికాదళ యుద్ధనౌక వదిలే పొగ తెరలు దిఙ్మండలంమీద ద్యోతకం అయాయి. నౌక తన గతిని మార్చుకుని, ఒక అరమైలు దూరంనుంచి ''తెరచాప ముడిచి ఆగు'' అనే సంకేతం యిచ్చింది.

''వాళ్ళు మనమీద కాల్పులు చెయ్యరు'' అన్నాడు గ్రే. ''మరేం భయపడకండి! వాళ్ళు తమ కళ్ళని నమ్మలేరు.''

తెరచాపలు ముడచమని అతను ఆదేశం యిచ్చాడు. ఏదో అగ్ని ప్రమాదం వున్నట్టుగా పాంటెన్ అరిచి

''సీక్రెట్''ని గాలిలోనుంచి తప్పించాడు. నౌక ఆగింది. ఆ యుద్ధనౌకనుంచి ఒక స్టీమ్‌లాంచి సిబ్బందితోటే, తెల్ల గ్లవ్సులు తొడుక్కున్న లెఫ్టినెంట్‌తోటే వాళ్ల దగ్గరకి వచ్చింది. ఆ లెఫ్టినెంట్ యీ ఓడ పైకెక్కి ఆశ్చర్యంగా పరకాయించి గ్రే ననుసరించి అతని గదిలోకి వెళ్లాడు. ఒక గంట తర్వాత అప్పుడే ఉద్యోగంలో పైకి వెళ్లినట్టుగా చిరునవ్వు నవ్వుతూ, చేతిని కొంచెం యెబ్బెట్టుగా వూపుతూ యివతలికి వచ్చి తమ యుద్ధనౌక కేసి వెళ్లాడు. యీ సారి గ్రే, బైతు పాంటెన్‌మీద కంటే, యెక్కువ విజయం సాధించాడు. యేమంటే ఆ యుద్ధనౌక, కొంచెం ఆగుతూ, ఒక బ్రహ్మాండమైన ఫిరంగి కాల్పుతోటి దిజ్మండలాన్ని మోతెత్తించేసింది. దాని ఎగజిమ్మే పొగ, గాలిలో గొప్పగా మెరుస్తూ వుండే బంతుల్లాగా అలలు లేస్తూ నిశ్చల నీటిమీద చుట్టుకుని పోయింది. నౌకమీద రోజంతా ఒకరకమైన పండగ వాతావరణం వుండింది. ఆ స్థితి కచ్చితంగా అధికారికమైంది కాదు, ఒకరకమైన భక్తి ప్రపత్తితో కూడింది — ప్రేమ చిహ్నం మాటున, దాన్ని గురించే అన్ని చోట్లా మాట్లాడుకుంటున్నారు — అధికారుల భోజనాల గదిమంచి, యింజను గది దాకా. పేలుడు సామాను గదిని పహారా కాసే వాడు అటుపోయే నావికుణ్ణి అడిగాడు:

''ఎలా పెళ్లయింది నీకు టామ్?''

''కిటికీలోనుంచి పారిపోదామని ఆమె ప్రయత్నిస్తూ వున్నప్పుడు గౌను పుచ్చుకుని లాగాను'' అని టామ్ గర్వంగా తన మీసాన్ని మెలితిప్పాడు.

కొంచెం సేపు ''సీక్రెట్'' ఖాళీ సముద్రంమీద సంచారం చేసి గట్టుకనిపించనంత దూరంపోయింది. మధ్యాహ్నం వేళకి దూరపు తీరం వాళ్లకి కనిపించింది. గ్రే టెలెస్కోప్ తీసుకుని కపేర్నాకేసి ఎక్కుపెట్టాడు. కొన్ని యిళ్లకప్పుల వరస లేకపోయినట్లయితే కిటికీ వార పుస్తకం పట్టుకు కూర్చున్న అస్సోల్ అతనికి కనిపించేదే. ఆమె చదువుకుంటోంది. ఒక చిన్న ఆకుపచ్చ పెంకు పురుగు ఆగుతూ, ముందు కాళ్లమీద లేస్తూ, చాలా స్వతంత్రంగా, అణకువగా కనిపిస్తూ పేజీమీద పాకుతోంది. అప్పటికి విసుగ్గా రెండు సార్లు దాన్ని కిటికీ కమ్మిమీదకి తోసెయ్యడం జరిగింది కాని అక్కణ్ణుంచి అదీ మళ్లీ విశ్వాసపాత్రంగా, నిర్భయంగా యేదో చెప్పాల్సిన విషయం వున్నట్టు తిరిగి ప్రత్యక్షమైంది. యీ సారి అది పేజి అంచుని పట్టుకున్న ఆమె చేతిదాకా పాకగలిగింది; అక్కడ అది ''చూడు'' అనే మాటదగ్గర అతుక్కుపోయి, యింకో కొత్త గాలిదెబ్బ కోసం విరీక్షిస్తున్నట్టు సందేహించింది. వాస్తవానికి కొంచెంలో తప్పించుకుంది యేమంటే అస్సోల్ అప్పటికే ''అబ్బ! యీ... చెత్త పురుగు!'' — అని అరిచి, దాన్ని తిన్నగా గడ్డిమీదకి ఉఫ్‌న వూదేద్దామని అనుకునే లోగానే యాదృచ్ఛికంగా ఒక యింటికప్పుమీదనుంచి యింకో యింటి కప్పుమీదకి దృష్టి మళ్లించడంతోటి వీధి చివర నీలి సముద్రం, ఎర్ర తెరచాపలతో ఒక తెల్లటి ఓడ అగుపించాయి.

ఆమె స్పష్టంగా చలించిపోయింది, వెనక్కి ఆనుకుని బిగిసిపోయింది. అప్పుడు గెంతింది, ఆమె హృదయం గిరగిర తిరుగుతూ జారిపోతోంది, ఉత్తేజంతో కూడిన అదిరిపాటుతో ఆపుకోలేని కన్నీటి వెల్లువ కట్ట తెచ్చుకుంది. యీ లోపున ''సీక్రెట్'' ఒక అగ్రం చుట్టు తిరుగుతోంది, దాని ఎడమ భాగం ఒడ్డు కేసి వుంది; లేత నీలపు శూన్యంమీద సంగీతం మెమ్మదిగా గాలిలో తేలుతూ వస్తోంది, ఎరుపు పట్టుకింద వున్న తెల్లని డెక్కుమీదనుంచి. శ్రావ్యమైన స్వరపు సంగీతం ''నింపండి, నింపండి చషకాలు — ప్రేమకోసం చెయ్యాలి పానం మనం...'' అనే ప్రఖ్యాతమైన మాటలని ఓ మాదిరిగా వ్యక్తం చేస్తోంది. సాదాతనంతో ఎగిసి ఎగిసిపడే ఉద్వేగం విరుసుకుని, గర్జించింది.

తను యెలా యింటిని వదిలిపెట్టిందీ అనే ధ్యాసలేకుండా అస్సోల్ సంఘటనల అనివార్యమైన విసురువల్ల కొట్టుకుపోయి సముద్రంకేసి పరిగెత్తిపోయింది. తొలి మలుపు దగ్గర దాదాపు శక్తుడిగి పోయి ఆగింది. ఆమె మోకాళ్లు కొట్టుకుంటున్నాయి, ఆమె ఆయాసపడుతోంది, స్పృహ దారంతో కట్టి చివర వేలాడుతున్నట్టుంది.

 తన నిర్ణయాన్ని పోగొట్టుకుంటానేమోనన్న భయంతోటి నేలమీద కాలు తాటించి స్థిమితపడింది. మధ్య మధ్యనంతా ఒక యింటికప్పో ఒక కంచో ఎర్ర తెరచాపల్ని అనకుండా చేస్తున్నాయి. అప్పుడు అవి యేదో సామాన్య మృగతృష్ణల్లా మాయమైపోతాయనే భయం క్రొద్దీ ఆ దుర్భర ఆటంకాన్ని హడావుడిగా దాటిపోయేది. మళ్లీ ఓడ కనిపిస్తే హమ్మయ్య అనుకుని వూపిరి పీల్చేది.

యీలోపున కపేర్నాలో యెలాంటి సందోహం, కేకలు, ఉద్వేగం చెలరేగాయంటే ప్రఖ్యాతమైన భూకం పాలతో మాత్రమే వాటిని పోల్చవచ్చును. అంతకు ముందెన్నడూ అంతటి పెద్ద ఓడ ఆ తీరానికి రాలేదు. ఆ ఓడకి పరిహాసంలా ధ్వనించేలాంటి రంగున్న తెరచాపలే వున్నాయి. యిప్పుడవి ధగద్ధగాయమానంగా, జీవితం తాలూకు అన్ని నియమాలనీ, యింగితజ్ఞానాన్నీ ఖండించి వేసే సత్యపు అమాయకత్వంతో యెదురులేకుండా పకాశిస్తున్నాయి. ఆడాళ్లు, మగాళ్లు, పిల్లలు ఆదరాబాదరా తీరం కేసి పరిగెత్తున్నారు. వూళ్లోవాళ్లు ఒకళ్ల కేసి ఒకళ్లు కంచెలమీదనుంచి కేకలేస్తున్నారు, ఒకళ్లనొకళ్లు ఢీకొంటున్నారు, తొట్రుపడి తూలిపోతున్నారు. కొంచెం సేపట్లోనే నీటి అంచున ఒక సమూహం చేరింది. ఆ గుంపులోకి అస్సోల్ దూరింది.

ఆమె అక్కడ లేనంత సేపూ ఆమె పేరుని కంపిత, వ్యాకుల ఉద్వేగంతో, ద్వేషసహిత భయంతో కుదిలించారు. ఎక్కువ మాట్లాడింది మగాళ్లే. నిశ్చేష్టితులైన ఆడాళ్లు గాద్గదికంగా వెక్కుతూ, పాముల్లాగా బుసకొడుతూ వున్నారు, కాని యెవత్తేనా ఒకత్తె మాట్లాడనారంభిస్తే — విషం ఆమె తలకి యెక్కేది. అస్సోల్ వచ్చిన క్షణంనుంచీ అందరూ గమ్మునైపోయారు, ఆమె అంటే భయంతోటి ప్రతివాళ్లూ తొలగి పోయారు. ఆమె ఒక్కత్తే వేడిగా కాళీగా వున్న యిసకమీద కూర్చుండిపోయింది. కలవరపడి సిగ్గుతో, ఆనందంతో, ఆ అద్భుతానికి తగ్గని ఎరుపు వున్న వదనంతో నిస్సహాయంగా ఆ యెత్తైన ఓడకేసి చేతులు చాస్తూ వుండి పోయింది.

ఆ ఓడనుంచి తెడ్లపడవ ఒకటి, కంచురంగు తెడ్లవాళ్లతోటి విడివడింది. వాళ్ల మధ్యలో నుంచున్నా డొకతను. అతను తనకు తెలుసునని యిప్పుడామెకి తోచింది. బాల్యంనుంచీ అస్పష్టంగా గుర్తుచేసుకుంది. అతనామె కేసి ఒక చిరునవ్వుతో చూస్తున్నాడు. అది ఆదరించింది, ఆమంత్రణం చేసింది. కాని కడక్షణపు, అర్థరహిత భయాలు అస్సోల్ని పొదివి పట్టుకున్నాయి. ప్రతిదాన్ని గురించీ మృత్యుసమ భీతి — ఒక దోషం, పొరపాటు అవగాహన, ఒక అదృశ్య లేక దుష్ట ఆటంకం — ఆమె ఎగిరి ఎగిరి పడే అలలోకి నడుం వరకూ దూకింది, అరుస్తూ:

''నేను యిక్కడ వున్నాను, నేను యిక్కడ వున్నాను! యిదిగో నేను!''

అప్పుడు జిమ్మర్ కమాను యెత్తాడు — అదే అసలైన శ్రావ్యగీతం ఆ జన సమూహపు నాడులమీద ఝల్లు మంది, కాని యీ సారి అది పూర్తి స్వరంతో, విజయోపేత బృందగానంతో వుండింది. ఉద్వేగంతోటే, మేఘాలా అలలా చలనంతోటే, నీటి తళతళతోటే, దూరం వల్లా ఆమె యేం జరుగుతున్నదీ నిదానించుకోలేకపోయింది: ఆమె తనే, ఆ ఓడ, తెడ్లపడవ — ప్రతీదీ కదలుతోంది, సుడి తిరుగుతోంది, పడిపోతోంది.

కాని ఒక తెడ్డు ఆమె పక్కనే నీటిని తాడించింది. ఆమె తల పైకి యెత్తింది. గ్రే వంగాడు. ఆమె చేతులు అతని పటకాని పట్టుకున్నాయి. అస్సోల్ కళ్లు మూసుకుంది, అప్పుడు గబగబా తెరిచింది, ఆ ఉల్లాస భరిత వదనంకేసి ధైర్యంగా చిరునవ్వు నవ్వింది, ఒగురుస్తూ అంది:

''సరిగ్గా నేను వూహించుకున్నట్టే మీరు.''

''నువ్వూనూ, ప్రియా!'' అన్నాడు గ్రే తడిసిపోయిన తన ఐశ్వర్యాన్ని నీటిలోనుంచి యెత్తుతూ. ''ఆఖరికి వచ్చేశాను. నన్ను గుర్తు పడతావా?''

ఆమె అతని పటకాని పట్టుకుని, పునరుజ్జీవిత ఆత్మతోటి, గట్టిగా మూసుకుని వణుకుతూ వున్న

కళ్లతోటే, తల పంకించింది. ముడుచుకుపోయిన చిన్న పిల్లిపిల్లలాగా వుంది ఆమెలో అంతర్గతంగా ఆనందం. అస్సాల్ కళ్లు తెరిచేటప్పటికి వూగులాడే తెల్లపడవ, అలల మిలమిల, సమీపిస్తూవున్న కదిలే "స్క్రెకెట్" పార్శ్వం అంతా కల. అక్కడ తేజస్సూ, నీరూ గోడమీద ఎండపొడ దోగాడినట్టుగా ఆడుకుంటూ అల్లుకుంటున్నాయి. గ్రే చేతుల పీటచెక్కమీద యెలా ఓడమీదకి తనని మోసుకుపోవడం జరిగిందో ఆమెకి గుర్తులేదు. తివాసీలతోటి అలంకృతమై కప్పివున్న డెక్కు, తెరచాపల ఎరుపు మెరుపులతో నిండిపోయి నందనవనంలా భాసించింది. త్వరలోనే అస్సాల్ తను గదిలో వున్నట్టు గ్రహించింది—యింక అంతకంటే బాగా వుండలేని గదిలో.

అప్పుడు పైనుంచి హృదయాన్ని పిక్కటిల చేస్తూ, యిముడ్చుకుంటూ జయపెట్టే సంగీతం యింకోసారి ఫెళ్లుమంది. అస్సాల్ మరోసారి కళ్లు మూసుకుంది, కళ్లు తెరిస్తే అదంతా మళ్లీ మాయమైపోతుందేమోనని. గ్రే ఆమె చేతుల్ని తీసుకున్నాడు. యిప్పుడు అభయం యెక్కడ వుందో గ్రహించి ఆమె కన్నీటి చారికలున్న తన ముఖాన్ని అంత అద్భుతావహంగా ప్రత్యక్షమైన తన హృదయనాథుని వక్షస్థలంమీద దాచేసుకుంది. గ్రే తను కూడా అవర్ణనీయ, అమూల్య క్షణవు రాకడతోటి, తనకి తప్ప మరెవరికీ చొరసాధ్యం కాని దాంతోటి, విచలితుడై ముప్పిరిగొన్నవాడై మెల్లిగా, చిరునవ్వుతోటి అంతకాలంగా తనని వెంటాడిన ఆమె ముఖాన్ని కొంచెం పైకి యెత్తాడు. ఆమె కళ్లు అప్పుడు విస్ఫారితాలయ్యాయి. మనిషిలో వుండే సర్వోత్కృష్టమమైంది అంతా వాటిలో వుంది.

"మా నాన్నని మనతో తీసికెడుతున్నామా?" అందామె.

"ఆఁ" అతను యీ నిశ్చయమైన "ఆఁ" అని అన్నతర్వాత యెంత కాంక్షాయుతంగా ఆమెని చుంబించాడంటే ఆమె ఆహ్లాదంగా నవ్వింది.

వాళ్లు ఒంటరిగా వున్నారు. ప్రపంచంలోని భాషల్లో, మాండలికాల్లో యెన్నో మాటలు వున్నాయి. కాని వాటిలో ఒక్కటీ ఆరోజున వాళ్లిద్దరూ ఒకళ్లకొకళ్లు యేం చెప్పుకున్నదీ ఛాయామాత్రంగా నేనా తెలియజెయ్యలేవు.

యీ లోపున డెక్కుమీద ముఖ్యమైన తెరచాప కంబం దగ్గర సిబ్బంది చెదలు తిన్న పీపాదగ్గర చేరారు. దాని మూత తీసివేసివుంది: వంద సంవత్సరాల నాటి శ్యామల వైభవాన్ని వెల్లడి చేస్తోంది. ఆట్‌వుడ్ పక్కన నుంచున్నాడు. పాంటెన్ ముద్దుగా ఉల్లాసంగా అప్పుడే పుట్టిన శిశువులాగా వున్నాడు. గ్రే డెక్కుమీదకి వచ్చి వాయిద్య బృందానికి సైగ చేశాడు. టోపీ తీసేసి బంగారు శృంగాల సంగీతం వినవస్తూవుంటే ఆ పవిత్ర ద్రాక్ష సారాయిలోకి చషకం మొదటగా ముంచాడు.

"అయ్..." అన్నాడతను తాగాక, చషకాన్ని అలా విసిరేసి. "యిప్పుడు తాగండి. తాగని వాడెవడేనా వుంటే వాడు నా శత్రువు."

అతను తన మాటల్ని రెట్టించాల్సిన పని లేకపోయింది. తెరచాపలు అన్నీ విప్పి కపెర్నానుంచి "స్క్రెకెట్" వేగంగా వెళ్లిపోతూవుంటే, ఆ గ్రామం ఎన్నటికీ నిశ్చేష్టితమైపోయి వుండగా, ఆ పీపాదగ్గర సందోహం యెంతలా వుందంటే బ్రహ్మాండమైన విందుల్లో యింతకంటే అధిక రీతిలో జరగదు.

"ఇది ఎలా వుంది?" అని గ్రే లెతికాని అడిగాడు.

"కేప్టెన్" అన్నాడు అతను సరి అయిన మాటలకోసం తడుముకుంటూ. "దీనికి నేను నచ్చానో లేదో నాకు తెలీదు, కాని నా అనుభూతులని గురించి నేను ఆలోచించుకోవాలి. తేనెపట్టు, ఫలాలతోట!"

"ఏమిటి?"

"అంటే తేనెపట్టునీ, ఫలాలతోటనీ నా నోట్లో పెట్టినట్టుగా వుంది. ఆనందంగా వుండండి కేప్టెన్.

'బ్రహ్మాండమైన రవాణా' అని నేను పిలిచే ఆమె, 'సీక్రెట్' నౌక అత్యుత్తమ పురస్కారం, కూడా ఆనందంగా వుండాలి!''

మర్నాడు తూరుపు రేకలు విచ్చుకునే వేళకి ఓడ కోపేర్నానుంచి చాలా దూరం వచ్చేసింది. గ్రే ద్రాక్ష సారాయి ప్రభావం వల్ల సిబ్బందిలోని సగభాగం ఎక్కడి వాళ్లక్కడ చాచుకుని పడిపోయారు. చుక్కానీవాడు, పహారావాడు, ఓడ వెనక తట్టు దగ్గర కూర్చుని సెల్లో మీటలమీద గడ్డం ఆన్చుకుని ధ్యానమగ్నంగా, మత్తుగా వున్న జిమ్మర్ మాత్రమే లేచారు. అతను అక్కడే తన కమానుని తీగలమీద మెల్లిగా ఆడిస్తూ, మంత్ర మోహనంగా, స్వర్గస్వరంతో వాటిని మాట్లాడేటట్టు చేస్తూ కూర్చుండిపోయాడు. ఆనందాన్ని గురించి ఆలోచిస్తూ వున్నాడు.

1920–1921

# పాము

''రెడ్ గార్లాన్ వారసులు'' అని తమ మిత్రులు వేళాకోళంగా ముద్దు పేరు పెట్టిన వాళ్లు యేడుమంది విద్యార్థి బృందం. వాళ్లందరికీ ఉమ్మడిగా ఒక మోటారు బోటు వుంది. దాన్ని వాళ్లకి స్విట్జర్లేండ్‌లో క్షయరోగంతో చనిపోయిన గార్లాన్ యిచ్చాడు.

జూలై మధ్యలో యీ బృందం వాళ్లు తమ మొదటి విహారయాత్ర చేశారు. స్నార్క్ సరస్సు తీరం దగ్గరికి ''వనాంతరంలో వుండాలని'' బయల్దేరారు.

యింకో ఎనిమిదో అతన్ని కూడా ఆహ్వానించారు. అతను కోల్‌బర్ట్. ఆ బృందంలో వున్న ముగ్గురు అమ్మాయిల్లోనూ ఒకామే జాయ్ తవిన్. ఆమె పట్ల అతని విఫల ప్రేమ విశ్వవిద్యాలయంలో ఒక యేడాది కితమే బాగా తెలిసిపోయింది, విమర్శలకి, చెవులు కొరుక్కోడానికీ కూడా దారి తీసింది.

పదహారవ యేటనుంచీ జాయ్ తవిన్ గాయం తర్వాత గాయం కలిగిస్తూనే వుంది. వాటిని యెలా నయం చెయ్యాలో ఆమెకి తెలియకపోవడం వల్లా, నయం చెయ్యాలనే యిచ్ఛలేకపోవడం వల్లా అవి వాటంతట అవే త్వరగా యే వైద్య సహాయమూ అవసరం లేకుండా మానిపోయాయి. కోల్‌బర్ట్‌కి మిగతా వాళ్లకంటే యెక్కువ గాఢంగా గాయం అయింది, అతను దాన్ని కప్పిపుచ్చుకోలేదు.

అతను జాయ్‌కి మూడు సార్లు అభ్యర్థనలు చేశాడు: మొదటిసారి ఆమెలో నవ్వుని తెప్పిస్తూ, రెండవ సారి ''స్నేహితులుగా'' వుండిపోదాం అన్న సూచనను ప్రేరేపిస్తూ, మూడవ సారి దాపరికంలేని చిరాకుని తెప్పిస్తూ. ఆమె అతనంటే యిష్టపడలేదు. తన కేసి నిశ్చలంగా చూస్తూ దిక్కుమాలి, విరహంలో పడి పోయే పొడుగాటి గంభీరులంటే ఆమెకి భయం. అలాంటి నిగ్రహపరుడు తన భర్త అవుతాడనే వూహకే ఆమెకి కోపం వచ్చేది. తనని అలాంటి పరిస్థితిలోకి నెట్టే యే అదృశ్య నిర్బంధానికైనా వ్యతిరేకంగా ఆమె తీవ్రమైన పగతో కూడిన భయంకర ఆగ్రహంతో నిండిపోయేది.

కాని కోల్‌బర్ట్ తనుగా పీడించలేదు. ఆమె అతన్ని తప్పించుకోలేదు, మొదటగా తనని యెంత మాత్రమూ అభ్యర్థించవద్దని వాగ్దానం చేయించుకుంటూ. అతను శిరసా వహించి, తను యెన్నడూ ఆమెని ''నన్ను పెళ్లి చేసుకో, జాయ్!'' అనే సాదా మాటలతో కలతబెట్టనట్టుగానే ప్రవర్తించడం మొదలుపెట్టాడు.

''వనాంతరంలో వున్న'' మూడో రోజున అడివిలోకి వెళ్లాలి అనే కోరిక జాయ్‌కి కలిగింది. ఆమె కోల్‌బర్ట్‌ని తనకి సాయం రమ్మనమని అడిగింది. తనని యిక యెంత మాత్రమూ అభ్యర్థించను అనే అతని కరకురాతి వాగ్దానాన్ని యేదో పొగొట్టేటట్టు చేస్తుందని అస్పష్టంగా అనుకొంది. అప్పటికి మూణ్నెల్లుగా ఆమెకి యెవరూ వివాహ అభ్యర్థనలు చెయ్యలేదు. క్షణికంగా, పూర్తిగా వినాశకరంగా ప్రేమని స్ఫురణకు తెచ్చే మానసిక స్థితిని జాగృతం చేసే చిన్న సంఘటనకోసం ఆమె తహతహలాడింది. కోల్‌బర్ట్ వెనక్కాల నడుస్తూ వుంటే, బెరుగ్గా, పడిపోవడం కోసం ఆతృతపడే గోడ ఒకటి తన వెనక నడుస్తున్నట్టుగా ఆమె భావించుకుంది. ఆమె ఒక పక్కకి కదిలే సరియైన క్షణంకోసం చూడాలంతే గోడ ఫెళఫెళా విరుచుకుని నేలమీద పడిపోతుంది.

ఎత్తైన గడ్డి వున్న ఖాళీ ప్రదేశంలోకి వాళ్ళు వచ్చారు. అక్కడ రాళ్ళు చెల్లాచెదురుగా పడిపోయి వున్నాయి. ఎవళ్ల ఆలోచనల్లో వాళ్ళుండి వాటిమీద కూర్చున్నారు.

విశ్రాంతి అయ్యాక వెనక్కి వెళ్లిపోవాలని కోల్‌బర్ట్ అన్నాడు.

''మన మధ్య గొడవలు సాఫీగా వున్నందుకు నీకు సంతోషంగా వుందా?'' అని అడిగింది జాయ్ కాసేపాగి.

''ఆ విషయం సంపూర్తిగా యెప్పుడో చర్చించేశాం కదా'' అన్నాడు కోల్‌బర్ట్ పదిలంగా, ఉచ్చు వుండబోతోందని తగినంత కారణాన్ని అనుమానిస్తూనే. ''నేను నీకు మాట యిచ్చాను. కాని అయితే....''

''వుహూఁ'' జాయ్ అడ్డం వచ్చింది. ''నేనిది వరకే అభ్యంతర పెట్టాను గనక నువ్వు మాట యిచ్చావు. వాగ్దానభంగం చెయ్యాలనుకోవడం లేదా?''

''చావనేనా చస్తాను వాగ్దానభంగం చెయ్యడంకంటే. నువ్వేం భయపడవద్దు'' అన్నాడు కోల్‌బర్ట్ గంభీరంగా.

విసుగెత్తి జాయ్ అతనికేసి చూసింది. అతను యెంత అణకువగా, విచారంగా నవ్వుతూ కూర్చున్నాడంటే ఆమె చిరాకు కోపంగా మారిపోయింది. తన పథకం విఫలమయ్యింది.

యింకా ముందుకుపోవడం అంటే తను మరీ నవ్వుల పాలుకావడమే. కోల్‌బర్ట్ నిగ్రహం పోగొట్టుకుని యేదో వెళ్లగక్కేస్తాడని ఆమె కొంచెం సేపు ఆశించింది కాని అతను వూరికే ఓ గడ్డిపోచని పట్టుకుని యేదో ధ్యాసతో అరచేతుల మధ్య తిప్పుతూ కూచున్నాడు. తన వాలకంతోటీ, నిర్ణయంతోటీ, దృఢత్వంతోటీ యీ మనిషి తనకి ఒక గుణపాఠం నేర్పుతున్నాడని జాయ్‌కి హఠాత్తుగా అనిపించింది. అతని పట్ల ఆమె యెంతటి శత్రుత్వ భావంతో నిండిపోయిందంటే ఒంటికి కారం రాస్తున్నట్లు మాట్లాడకుండా వుండలేకపోయింది.

''నువ్వేదో పిరికితనం వల్ల మాట యిచ్చావు. కూర్చుని నిబ్బరంగా వుండటం మేలు, యేమంటావ్?''

''జాయ్'' అన్నాడు కోల్‌బర్ట్, భయపడి. ''నీకు యీ ఉక్కకి బుర్ర చెడివుంటుంది. వెనక్కి పోదాం పద, అక్కడ నీడలో కూచుందు వుగాని!''

జాయ్ నుంచుంది. అతని కావిరంగు జుట్టుని పట్టుకుని, యీ ఆటలోని అర్థాన్ని గ్రహించలేని ఆ పెద్ద బుర్రని ఒక్క సారి కుదిపెయ్యాలని ఆమెకి హఠాత్తుగా గట్టి కోరిక పుట్టింది. ఆమె తిక్క మానసిక స్థితికి అతను బదులు యివ్వాలనుకోలేదు. గాయపడి, గాఢంగా ఆందోళనపడి, ఆమె స్థిరంగా నేలకేసే పెదాలు కొరుక్కుంటూ చూసింది. గరగరలాడే గడ్డిలో మెరిసేదేదో ఆమె కంటికి కనిపించింది. ''చూడు, బల్లి!'' అంది.

కోల్‌బర్ట్ తోసిన తోపు ఆమెని దాదాపు కింద పడేసింది. గిర్రున తిరిగిపోతూ ఆమె కష్టంమీద కాలు ఆన్చుకుంది. చేతులు వూపుతూ కోల్‌బర్ట్ గడ్డిలో దేన్నో తొక్కుతున్నాడు. అప్పుడు కూర్చుని, తలా తోకా అంచులు రెండూ చెరోవేపూ వేలాడుతూ వుంటే వేళ్లతో నడుం మధ్యలో పట్టుకుని చిన్న పాముని యెత్తాడు.

''చూశావా? దీన్ని?'' అన్నాడతను భయపడుతూ జాయ్ కోప వదనం కేసి చూస్తూ. ''నిన్ను తోసింది గట్టిగా అయితే యేమీ అనుకోకు. యిది కంచు పాము! చాలా ప్రమాదకరమైన రకంది! ఆడాళ్లెప్పుడూ పాములని బల్లులంటారు. యీలాంటి పాము కరిచిందంటే, మూడు నిముషాల్లో చచ్చిపోతావు.''

జాయ్ దగ్గరికి వచ్చింది.

''చచ్చిపోయిందా?''

''ఆఁ'' అన్నాడు కోల్‌బర్ట్ ఆ పాముని నేలమీదకి విసిరేసి మళ్లీ ఎత్తుతూ.

జాయ్ దృష్టిలో చచ్చిన పాముని పట్టుకోవడం ధైర్యమైంది. కోల్‌బర్ట్ తనని ఓడించెయ్యకూడదని ఆమె అనుకుంది. ఆ పాముని కోల్‌బర్ట్‌నుంచి తీసుకుని ఆమె తన మణికట్టుకి ఒక కంకణంలాగా చుట్టు

 కొంది. కోల్‌బర్ట్ మడమ కింద తొక్కెయ్యడం వల్ల కొన్ని చోట్ల నలిగిపోయిన ఆ పాము జాయ్ చామన ఛాయ చర్మంమీద బంగారు వన్నెలా ప్రకాశించింది.

"దాన్ని కిందపడెయ్యి! కిందపడెయ్యి!" అని కోల్‌బర్ట్ వున్నట్టుండి అరిచాడు.

ఆ నిర్జీవ కళేబరంమీద కనిపించీ కనిపించని కదలిక జీరాడిందని చెప్పే వ్యవధే అతనికి లేకపోయింది. ఆ పాము ఒక క్షణం పుంజుకుని, మానవ శరీరపు శతృత్వ వెచ్చదనం తగలగానే నోరు తెరిచి జాయ్ చేతిని కాటేసింది. యీ శ్రమ దాన్ని పూర్తిగా హతం చేసేసింది. ఆ పాము తలని పట్టుకుని, కోల్‌బర్ట్ దాన్ని ముక్కలు చేసేటంతగా నలిపేశాడు. అప్పుడు దాని శరీర అవశేషాలని జాయ్ మణికట్టునుంచి విసిరేసి, మణికట్టుమీద రెండు రక్తపు బొట్లని చూశాడు. ఎవరో అరిచి చెప్పినంతగా దాని అర్థం అతనికి తెలిసింది.

"ధైర్యంగా వుండు!" అన్నాడు, "మృత్యువు యిదిగో యిక్కడే వుంది!"

అతను అదుపులో పెట్టుకుందా మనుకునేటంతగా అతని వేళ్లు ఒణికిపోతోంది. జాయ్ నిస్సహాయంగా పాము కాటేసిన మణికట్టు కేసి చూసింది. ఆమెకి నొప్పీ, అసహ్యమూ కలిగాయి. కాని ఆమెకి కోల్‌బర్ట్‌కి తట్టినంత వేగంగా వూహ తట్టలేదు. అంతా సమాప్తం అయిపోతోంది అన్న గుర్తింపూ ఆమెని నిశ్చేష్టితం చెయ్యలేదు. కాని కోల్‌బర్ట్ ఆకస్మికత, అతని ఆజ్ఞలూ ఆమెని తన పూర్తి స్వాతంత్ర్య స్వాధీనంలో వుంచాయి. కోల్‌బర్ట్ చెయ్యబోయే మహత్తర సేవతోటి అది ప్రమాదంలో పడబోతోంది తనకి.

"వదిలెయ్యి" అందామె భారంగా నిశ్వసిస్తూ. "నేను చూసుకుంటాలే. ఆ చాకు యిలా యియ్యి."

అలాంటి క్షణాల్లో జీవితంకంటే కాలం విలువైంది. చాకుని తీసి కోల్‌బర్ట్ ఆమెని కిందకి తోశాడు ఆపరేషన్ చెయ్యడానికని. అదే సమయంలో అతను గబగబా తన నాలికతోటి చిగుళ్లూ, అంగుడూ తడుముకున్నాడు తన నోట్లో గాయాలేమన్నా వున్నాయేమోనని.

"విషాన్ని యివతలికి పీల్చెయ్యాలి నేను!" అని అరిచాడతను. "యింక వేరే మందులేదు! జాయ్, మరి మాట్లాడకు!" అని శాసించాడు.

నిశ్శబ్దంగా పళ్లు బిగబట్టి ఆమె అతనితో పెనుగులాడింది, తన వింత వెర్రి ఆవేశంలో అతని చేతుల మీదుగా బతకడం కంటే చచ్చిపోవడమే మంచిదని అనుకుంటూ. దాని వల్ల యేం సంభవించబోయేదీ ఆమెకి తెలుసు. యిప్పుడు కోల్‌బర్ట్ తనకి భర్త అయే అవకాశం వుంది. మాటలు, ఆలోచనలు, లేకుండా ఆమె సహజాతంగా దీన్ని గ్రహించింది. అతని చేతుల్లో తెగించి పెనుగులాడింది. కోపంగా కోల్‌బర్ట్ ఆమెని వంగచీలిన చెట్టుదగ్గరికి యీడ్చుకుపోయాడు. బలవంతంగా ఆమె చేతిని ఆ ఖాళీలో వుంచాడు. అలా వుంచుతూ చర్మాన్ని చీల్చి అవతలి వేపుకి వెళ్లాడు. అక్కడ జాయ్ చేతిని పట్టుకున్నాడు. ఆమె చెయ్యి యిప్పుడు యిరుకుదాగిలిలో పెట్టినట్టు వుంది.

తన మోచేత్తోటి బలంగా ఆ చేతిని, తనని అంతగా అసహ్యించుకున్న ఆ చేతిని, పిండాడు. జాయ్ గోళ్లని నీలంగా మార్చేటంత గట్టిగా శక్తితో పిండాడు. అలా పిండుతూ కోల్‌బర్ట్ చాకుతో లోపలికంటా గంటుచేసి, తన పెదాలని ఆ గాయంమీద వుంచి నోటి నిండా రక్తం పీల్చాడు. దాన్ని వుమ్మేస్తూ మళ్లీ అలాగే చేశాడు. తను ప్రేమించిన ఆ అమ్మాయి రక్తాన్ని మూడో సారి కూడా పీల్చాడు. జాయ్ తన చేతిని ఒకటి, రెండు సార్లు కుదుపుకుని, నెమ్మది పడి అవతలి వేపున చెట్టుని ఆనుకుంది. భయం, అవమానం, ఆగ్రహం ఆమె ముఖాన్ని కోపభూయిష్ఠ అశ్రువులతో నింపేశాయి. ఆమె మళ్లీ మళ్లీ అంటూనే వుంది:

"కోల్‌బర్ట్, అయినా గానీ నేను నిన్ను పెళ్లాడను. నన్ను పోనియ్యి!" అని.

కోల్‌బర్ట్ మాట్లాడలేదు. ఆఖరికి ఆమె చేతిని వదిలేసి, ఆమె యేం చెబుతున్నదీ గ్రహించి అతను అన్నాడు:

"నువ్వు మరొకర్ని పెళ్లాడతావు, అదీ ముఖ్యం. ఎవరి భార్యగా అవాలన్నా నువ్వు ముందు బతికి వుండాలి కదా."

అతని మీసం, చుబుకం రక్తసిక్తమైపోయాయి. చేత్తో తుడుచుకున్నాడు. చెయ్యీ రక్తంతోటే వుంది.

నాటువడి, గాయపడిన తన చేతిని మబ్బుగా చాస్తూ జాయ్ ఆ గంటుమీద జేబురుమాలు పెట్టింది. తామేదో చాలా దూరం పరిగెత్తిన వాళ్ల మాదిరి యిద్దరూ వగురుస్తున్నారు. ఆఖరికి జేబురుమాలుని చింపి జాయ్ తన చేతికి కట్టుకట్టుకుంది. కోల్‌బర్ట్ గడియారం చూశాడు.

"అయిదు నిముషాలైపోయింది. యిప్పుడిక ఫరవాలేదు."

వీపు అతనికేసి తిప్పి నుంచుని జాయ్ యేమీ మాట్లాడలేదు. ఆమె వెనక్కి తిరిగేటప్పటికి అతనక్కడలేడు.

ఆశ్చర్యపోయి ఆమె "కోల్‌బర్ట్!" అని అరిచింది. అతన్ని దేవికీ క్షమించలేదు. కోల్‌బర్ట్ కడకి విజయం సాధించిన, అతని అంతర్గత ప్రతిఘటనలో నలిగిపోతూనే ఆమె తొక్కేసిన ఆ గడ్డిదారిలో పాదల్లోకి చూస్తూ వెళ్లి, ఆగింది.

కోల్‌బర్ట్ గడ్డిలో బోర్లాపడిపోయి వున్నాడు. అతని ముఖం నల్లబడి ఉబ్బిపోయి వుంది. అతని రూపమే మారిపోయింది. అతని కళ్లు ఉబ్బివున్నాయి. అతని మీసమూ, నోరూ జాయ్ రక్తంతోటి పులుముకుపోయి, తనకి ప్రియమైన ఆ యువతి అతను యెంత భయంకరస్థితినుండి రక్షించిందీ వెల్లడి చేస్తున్నాయి. యీ వికారమైన, విషపూరిత వదనం ఆఖరికి జాయ్‌కి వణుకు పుట్టించింది. ఏమంటే అందులో ఆమె యిప్పుడు తప్పిపోయిన తన అంతాన్నే మరిచిపోలేని భీకరత్వంతోటి చూసింది. ఆమె ఒక్క ఉదుట్న "రక్షించండి, నేను చచ్చిపోతున్నాను!" అని అరుస్తూ పరిగెత్తింది.

కాని చాలా మించిపోయింది. యేమంటే ఆమెని రక్షించడం జరిగిపోయింది.

1926

# అతని తండ్రి ఆగ్రహం

సుదీర్ఘ ప్రయాణం తర్వాత బేరింగ్ తిరిగివచ్చేటప్పటికి అతని కొడుకు చిన్న టామ్ బేరింగ్, అతని మేనత్త కార్నీలియా ఆమె భర్త కారల్ మామల భీకరదాడికి బలై వున్నాడు.

లైబ్రరీ గదిలో టామ్ సబ్బు బుడగలు వూదుతున్నాడు. అతను అంతకంటే అధ్వాన్నమైన నేరాలు చేశాడు: మాటకి, భూతద్దంతోటి పసుప్పచ్చ తెరని చిల్లు పడేటట్టు కాల్చడం, ''డికామెరాన్'' బొమ్మలకేసి తొంగి చూడడం, పొరుగువాళ్ల పిల్లాడితో దెబ్బ లాడ్డం లాంటివి. కాని ముఖ్యంగా సబ్బు బుడగలు కార్నీలియాని కలత పెట్టేశాయి. విశాలమైన, సొగసైన ఆ యింటిలో అలాంటి చిల్లర పనులు కూడవు. కారల్ మామ సబ్బు చెంబుని లాగేసుకొంటే, కార్నీలియా అత్త గాజుగొట్టాన్ని లాగేసింది.

అల్లరి పిల్లలకి యేం మూడబోతోందో దాన్ని గురించి టామ్‌ని హెచ్చరిస్తూ కార్నీలియా చాలా సేపు దుమ్మెత్తిపోసింది: అలాంటి వాళ్లు దుష్టులూ దుర్మార్గులూ అవుతారు. తన ఉపన్యాసాన్ని ముగిస్తూ ఆమె అంది.

''మీ నాన్న ఆగ్రహం వుంది జాగ్రత్త! మా అన్నయ్య రాగానే నీ వ్యవహారం అంతా అతనికి చెబుతాను. అతని ఆగ్రహం యెంతలా నీమీద విరుచుకు పడిపోతుందో చూడు.''

కారల్ మామ నడుంమీద చేతులు పెట్టుకుని ఆమె అన్నదానికి జోడించాడు: ''అబ్బో, అతని ఆగ్రహం భయంకరమైంది.''

వాళ్లు వెళ్లిపోయిం తర్వాత టామ్ పెద్ద పడక్కుర్చీలో దాంకుని తనకి యేం జరగబోతోందా అని వూహించు కున్నాడు. కారల్, కార్నీలియాలు యెప్పుడూ పెద్ద పెద్ద మాటలనే వాడతారు. కాని తన తండ్రి ''ఆగ్రహా''న్ని గురించి రెట్టించి రెట్టించి అనడం టామ్‌ని చాలా యిబ్బంది పెట్టేసింది. అత్తనీ, మామనీ ఆగ్రహం అంటే యేమిటీ అని అడిగితే తన పిరికితనాన్ని బయట పెట్టుకున్నట్టవుతుంది. టామ్ వాళ్లకా సంతృప్తిని కలిగించదలచుకోలేదు.

దీన్ని గురించి కొంచెం సేపు ఆలోచించిన తర్వాత టామ్ పడక్కుర్చీలోనుంచి దిగి, హుందాగా తోటలోకి వెళ్లాడు. దీనికి వివరణ యివ్వడానికి అక్కడ ఎవరేనా దొరుకుతారేమోనని ఆశించాడు.

కార్నీలియాకి బంధువూ, రచయితా అయిన ఆస్కార్ మూంక్ ఒక ఓక్ చెట్టు నీడలో పడుకుని పత్రిక చదువుకుంటున్నాడు.

టామ్ దొంగచాటుగా, నిశ్శబ్దమైన రెడ్ ఇండియన్ రీతిలో అతని దగ్గరికి వెళ్లి అరిచాడు:

''ఓహోయ్!''

మూంక్ పత్రిక పక్కని పెట్టి ఆ చిన్న కుర్రాణ్ణి మోకాళ్ల చుట్టూ పట్టుకుని దగ్గరికి లాక్కున్నాడు.

"ఓరినోకో*మీద అంతా ప్రశాంతంగా వుంది. హురాన్లు** ప్రెయిరీమీదకి పోయారు" అన్నాడతను. కాని టామ్ దిగులుగా వుండిపోయి ఆ క్రీడలో చేరలేదు.

"ఆగ్రహం అంటే యేమిట్లైందీ నీకు తెలీదు, తెలుసా?" అన్నాడతను కుంగిపోయి. "నేనీ విషయం గురించి నీతో మాట్లాడినట్టు యెవళ్లకీ చెప్పకు."

"ఆగ్రహం?"

"ఆఁ. నాన్న ఆగ్రహం. ఆయన రేపు తిరిగివస్తున్నాడు. వస్తూ ఆగ్రహాన్ని కూడా తెస్తున్నాడు. సబ్బు బుడగలు వూత్తున్నట్టూ, తెరని చిరుగుపడేలా కాల్చినట్టూ అత్త నామీద చాడీలు చెపుతుంది. చిరుగు చిన్నదే కాని నేను.... కాని ఆగ్రహానికిది తెలియాలని నేను అనుకోవడం లేదు."

"హ్హాహ్హా, అదా సంగతి!" అన్నాడు మూంక్ పగలబడి నవ్వుతూ. అది టామ్‌కి అర్థం కాలేదు. అది అతన్ని మూడడుగులు వెనక్కి పోయేటట్టు చేసింది. "అవును, మీ నాన్న ఆగ్రహం సరసమైంది కాదు. అది దారుణమైంది. ఎవ్వడోగాని రాదు. నాలుగు చేతులూ, నాలుగు కాళ్లు వున్నాయి. వేగంగా పరిగెడుతుంది. వక్ర చూపు. దుష్ట స్వభావం. భూతం."

టామ్‌కి విచారం కలిగి, మూంక్ అంత ఉల్లాసంగా భయంకరమైన ఆ జంతువుని గురించి వర్ణించగలుగుతూ వుంటే అతనికేసి చిత్తర పోయి చూస్తూ వెనక్కి తగ్గాడు. యిక ఎవర్ని అడగాలన్న యిచ్ఛ పోయింది అతనికి. కాసేపు వీధుల్లో అలా తిరిగాడు. ఆఖరికి పొరుగింటి చిన్న పిల్ల ఎనిమిదేళ్ల మాలీని చూశాడు. తన కష్టాలని ఆమెతో చెప్పుకుందామని ఆమె దగ్గరికి పరిగెత్తాడు, కాని అతన్ని చూడగానే ఆమె పారిపోయింది. వాళ్లిద్దరూ కలిసి గ్రీన్ హౌస్ కేసి బాణాలని వేసిన నాటినుంచీ ఆ పిల్లని అతనితో ఆడుకో నివ్వారు కాదు. మాలీయే అతన్ని "ఓ పట్టుపడదా"మని ఎక్కేసి కిటికీ అద్దాన్ని కొట్టినా గానీ అలాంటి సందర్భాలలో, అస్త మానూ అనుమానించినట్టుగా ముందుండే మొనగాడు టామే.

బక్కపల్చగా, ఉంగరాల జుట్టుతో వున్న ఆ చిన్న పిల్ల పట్ల అనుబంధం ఆరాధనాలాంటి భావాలతో స్పందించిపోయి టామ్ తిన్నగా పొదలగుండా దూసుకుపోయాడు. అతని ముఖం గీసుకుపోయింది కూడాను. కాని ఆ పిల్లని అందుకోలేకపోయాడు. దుఃఖంతో ఉబికిన కన్నీళ్లని తుడుచుకుంటూ తిరిగి యింటికి వెళ్లిపోయాడు.

నాస్తాకోసం అన్నీ సిద్ధంచేసి పనిపిల్ల అవతలికి వెళ్లింది. టామ్ నిండుగా బంగారు ద్రాక్ష సారాయం వున్న బుడ్డిని చూశాడు. నిర్జన ద్వీపంమీద, ఎవ్వరూ లేకుండా దారుణమైన ఏకాంతంలో వున్నప్పుడు కేప్టెన్ కిడ్ ("తీరపు సముద్ర దొంగలు" అనే పుస్తకంలో) రమ్ తాగాల్సివచ్చిందని గుర్తుకు వచ్చింది.

టామ్‌కి కిడ్ అంటే చాలా యిష్టం. అంచేత బల్లమీదకి యెక్కి గ్లాసులో ద్రాక్ష సారాయి పోసుకున్నాడు గొణుగుతూ:

"నీ ఆరోగ్యంకోసం కేప్టెన్. నిన్ను రక్షించడానికి స్టీమర్‌మీద వచ్చాను. ఏం భయపడద్దు, మీ అమ్మాయిని వెతికి పట్టుకుందాం."

టామ్ యింకా ఒక గుక్క తాగాడోలేదో కార్నీలియా లోపలికి వచ్చి, ఆ తాగుబోతుని కుర్చీలోనుంచి లాగేసి మెల్లిగానే, కానీ సరసంగానే, మూడు దెబ్బలు తగలనిచ్చింది. కోపంతో నిండిపోయిన ఆ ముసలావిడ ఓ సారి

---

* ఓరినోకో — దక్షిణ అమెరికాలోని ఉత్తర భాగంలోని నది. వెనిజులాలో ఉత్తరంనుంచి తూర్పుగా అట్లాంటిక్‌లోకి ప్రవహిస్తుంది. యీ ప్రాంతంలో రెడ్ ఇండియన్లు వుంటారు. — సం.

** హురాన్లు — హురాన్, ఎయిరీ, ఒంటారియో సరస్సుల ప్రాంతంలోని ఇరాక్వాతెగల వాళ్లు. — సం.

గట్టిగా అరిచింది. ఆ నేరస్థుడు ఆమె పట్టు విడిపించుకుని తోటలోకి పారిపోయి వేసవి విడిది యింటిలో చెక్క నేలమీద ఆశ్రయం పొందాడు.

తన పని అయిపోయిందని అతను గ్రహించాడు. అతని ఆశలన్నీ ఆగ్రహంతో తండ్రి జోక్యంమీదనే తగులుకుని వున్నాయి.

తండ్రిని గురించి టామ్‌కి వున్న జ్ఞాపకమల్లా అతనికి నల్లటి మీసాలున్నాయనీ, ఆప్యాయమైన పెద్ద చెయ్యి వుందనీ అందులో టామ్ తన మొహాన్నంతనీ దాచుకోవచ్చనీనీ. అతనికి తల్లి గుర్తులేదు.

ఆగ్రహాన్ని బోనులోనుంచి వదిలేస్తే యేమవుతుందా అని వూహిస్తూ, నిట్టూరుస్తూ కూర్చున్నాడు.

టామ్ దృష్టిలో క్రూరజంతువుకి బోను కావాలి. తనే తయారు చేసిన బాణాన్ని రెండు అమ్ములనీ మూలనుంచి తీశాడు. కాని వున్నట్టుండి అలాంటి ఆయుధపు శక్తిమీద అనుమానం కలిగింది. వేసవి యింట్లోంచి పాక్కుంటూ యివతలికి వచ్చి మిద్దెమీదుగా కారల్ మామ చదువుకునే గదిలోకి రహస్యంగా వెళ్లాడు. అక్కడ గోడలకి పిస్టళ్లూ, తుపాకులూ తగిలించి వున్నాయి.

వాటిల్లో గుళ్లు లేవని టామ్‌కి తెలుసు. అలా అని అనుకోవడం ఎన్నో సార్లు విన్నాడు. కాని తోటమాలి కొడుకు దగ్గర్నుంచి కొంత మందుగుండు కొట్టెయ్యొచ్చని ఆశించాడు. ఓ గులక రాయి చాలు తుపాకీ గుండులా పనికొస్తుంది. చేతుల సోఫా వెనక్కి పాక్కుంటూ యెక్కి రాగి గొట్టం వున్న పెద్ద తుపాకీని సరిగ్గా తియ్య బోతున్నాడంతే, కారల్ మామ లోపలికి వచ్చి, ఆశ్చర్యకరంగా యీలవేసి, కుర్రవాణ్ణి బిరుసు వేళ్లతో వెనక కాలరు వేపునుంచి పట్టుకున్నాడు. టామ్ గింజుకుని యివతలపడి సోఫామీదనుంచి కింద పడి మోకాటి చిప్పకి దెబ్బ తగిలించుకున్నాడు.

తూలుతూ లేచి, తల వేలాడేసి, విచారంగా మామ పెద్ద బూట్లకేసి చూస్తూ వున్నాడు.

"ఏయ్, టామ్, చెప్పరా" అని మొదలెట్టాడు మామ. "నీకు, హేరల్డ్ బేరింగ్ కొడుకైన నీకు, యింతకు ముందెన్నడూ అవమానకరమైనదేదీ యెరగని యీ గదిలోకి రహస్యంగా రాజద్రోహంగా చొచ్చుకుని రావడం అనేది తగునా? నువ్వేం చేస్తున్నదీ గుర్తించావా?"

"ఆఁ, మామా. నాకు పిస్టల్ కావాలి. పోరాటం చెయ్యకుండా లొంగిపోవాలని నేను అనుకోవడంలేదు. నాన్నతో కలిసి వచ్చే మీ ఆగ్రహం నన్ను చంపేస్తుంది. బతికుండగా దానికి లొంగను."

కారల్ మామ ఓ క్షణం నిశ్శబ్దంగా వున్నాడు. అణిచేసుకున్న గురక లాగా చిన్న శబ్దం చేశాడు. అప్పుడు కిటికీ దగ్గరికి వెళ్లి అక్కడనుంచుని పైపులో పొగాకు కూరుకోవడం మొదలుపెట్టాడు. అప్పుడు వెనక్కి తిరిగాడు. అతని ముఖకవళిక అంతకు ముందు టామ్ మూాంక్ ముఖంమీద చూసిన లాంటిదే.

"నిన్నిక్కడ తాళం పెట్టేసి నాస్తా లేకుండా చేస్తాను" అన్నాడు నిబ్బరంగా కారల్ మామ ఆ గది గుమ్మంలో ఆగుతూ. "వున్న చోటనే వుండి తాళం లటుక్కున పడ్డం విను. ఆగ్రహం అలాగే వళ్లు కొరుకుతుంది. ఏమీ ముట్టుకోవద్దు, జాగ్రత్త."

అలా అంటూ ఆయన బయటికి వెళ్లిపోయాడు. తాళం చెవిని రెండు సార్లు టిక్కుటిక్కు మనేట్టుగా తిప్పి జేబులో వేసుకుని వెళ్లిపోయాడు.

టామ్ తక్షణం తాళం బెజ్జంలోనుంచి చూశాడు. మామ మలుపు తిరగ్గానే కిటికీ తెరిచి, షెడ్డు నరంబీ దాకా పాకి అక్కడ్నుంచి పూల మొక్కలున్న చోట దూకాడు. కనకాంబరం, నీలాంబరం మొక్కలు అప్పళం అయిపోయాయి. అవసానం ఆసన్నమైన వాడి తెగింపుతో ప్రవర్తించాడతను. అడవిలోకి పారిపోయి, దాంకొనే బొరియ తవ్వుకుని, కందమూలాలు, పుష్పాలు తింటూ తనకి నిక్షేపిత నిధులూ ఆయుధాలూ దొరికే దాకా అలానే బతకాలని అనుకున్నాడు.

అలా అనుకుంటూ టామ్ కంచెమ్మటే నక్కుతూ వున్నాడు. కారల్ మామ యింటి కేసే రోడ్డుమీద ఒక కారు వస్తూ వుండటం అతనికి కనిపించింది. నల్ల జుట్టున్న ఒక పెద్దాయన పక్కన అందమైన రాగిరంగు జుట్టున్న ఆడావిడ కూర్చుంది. యీ కారు వెనక్కాల యింకో కారు వచ్చింది. దాన్నిండా పెట్టెలూ ట్రంకులూ వున్నాయి.

టామ్ దీన్ని గ్రహించే లోపునే ఆ కార్లు గేటులోకి తిరిగాయి. ఇంజన్ల మోత ఆగింది.

మొత్తం తన ముఖాన్ని దాచుకునేటంత పెద్ద చెయ్యి తాలూకు అస్పష్ట జ్ఞాపకం ఆ కుర్రవాణ్ణి ఆగేటట్టు, చేసింది. తర్వాత యెంత వేగంగా తన కాళ్లు పరిగెత్తగలవో అంత వేగంగానూ పరిగెత్తి అతను యింటికి చేరాడు. తను గదిలోనుంచి పారిపోయిన సంగతి మర్చిపోయి, పూరటపీ, సానుభూతినీ కాంక్షిస్తూ తిన్నగా పూలమొక్కలమీదనుంచి పరిగెత్తుకుంటూ పోతూ "నిజంగా మా నాన్నే?" అనుకున్నాడతను.

టామ్ దొడ్డి వేపు గుమ్మం గుండా యింట్లోకి వెళ్లి అన్ని గదుల్లోనుంచీ నడుచుకుంటూ హాల్లోకి వచ్చాడు. అతని సందేహాలు మాయమైపోయాయి. కార్నీలియా, కారల్, మూంక్, పనివాడూ, పనిపిల్ల అందరూ అక్కడ్నే వుండి నల్లటి మీసం వున్న పొడుగాటి ఆయనతో, కూడా ఆడమనిషి వున్న ఆయనతో, హడావుడి పడిపోతున్నారు.

"అవును" అంటున్నాడు బేరింగ్. "ఆ కుర్రవెధవని తొందరగా చూద్దామని ఓ రోజు ముందే వచ్చాను. ఏడీవాడు? కనిపించడేం?"

"నేను వాణ్ణి తీసుకొస్తా" అన్నాడు కారల్.

"నేనే వచ్చేశాను" అన్నాడు టామ్ కార్నీలియాకీ బొండాం పనిపిల్లకీ మధ్యనుంచి దూరుకుంటూ వస్తూ.

బేరింగ్ కనుబొమలు ముడిచి, కొంచెం నిట్టూర్చి, కొడుకుని పైకెత్తి, గీసుకుపోయిన బుగ్గమీద ముద్దు పెట్టుకున్నాడు.

కారల్ మామ గుడ్లప్పగించి చూశాడు.

"కాని నువ్వు దండనలో వున్నావు! తలుపు తాళం పెట్టేసి వుంది!"

"కాని యివాళ వాణ్ణి క్షమించడం జరిగింది" అన్నాడు బేరింగ్, కుర్రాణ్ణి ఆ పడుచావిడ దగ్గరికి తీసుకెడుతూ.

"యిదేనా ఆగ్రహం?" అనుకున్నాడు టామ్. "యెంత మాత్రం కాదు. అలా కనిపించడం లేదు."

"యీమె మీ అమ్మ" అన్నాడు బేరింగ్. "యీ కుంకని నీ కొడుకులా చూసుకో, కేట్."

"మనిద్దరం ఆటలాడుకుందాం" అని ఆర్ద్రపూరితమైన స్త్రీ కంఠం అతని చెవిదగ్గరగా గిలిగింతలు పెట్టినట్టు అంది.

అతను ఆమె చేతిని పట్టుకుని, తండ్రి మాటమీద, ఆమె పెద్ద వీలంకళ్లల్లోకి చూశాడు. కారల్‌నిగాని కార్నీలియానిగాని గుర్తుకు తెచ్చేది అక్కడ యేమీ లేదు. అమ్మయ్య నాస్తా దక్కుతుంది.

అతన్ని ముస్తాబు చెయ్యడానికి తీసుకుపోయారు. అయినా టామ్‌కి మనసు కుదురుగా లేదు. యేమంటే కారల్, కార్నీలియాలు అతనికి బాగా తెలుసు. వాళ్లు యేదేనా అన్నారూ అంటే అది జరిగిందీ అన్నమాటే. యీ పాటికి వాళ్లు ఆగ్రహంతోటి లాలూచీ పడుతూనే వుంటారు. తువ్వాలు మార్చడానికని వెళ్లింది పని మనిషి. ఆ అదును చూసుకుని అతను తండ్రికోసం సిద్ధం చేసిన గదిలోకి వెళ్లాడు.

ఆగ్రహం అక్కడ వుందని అతనికి తెలుసు. అక్కడ అది తాళం పెట్టి వుంది, యెప్పుడు బయటికి వదుల్తారా అని నిరీక్షిస్తూ.

టామ్ తాళం బెజ్జంలోనుంచి చూశాడు, కాని యేమీ కనిపించలేదు. నేలమీదంతా తివాసిలూ, ఫర్లూ, అల్లిన తత చాపల్లో చుట్టిన పేకేజీ పెట్టెలూ వున్నాయి. ప్రశాంతంగా మారకుండా వుండే జీవితానికి నప్పే భారమైన మూటలాగా అమర్చిన పెద్ద గదిలో మూతలు తెరిచి వున్న వాటితో సహా కొన్ని పెట్టెలు ఒక వింత దృశ్యంగా వున్నాయి.

తన సాహస ప్రయత్నంతోటి భయపడి, కాని తన గుండెలమీద భారంగా వున్న యీ కోరికని వదిలించేసుకోవాలని, టామ్ తలుపు తీసి లోపలికి వెళ్ళాడు. ఒక నిజమైన పిస్టల్ మంచంమీద పడివుంది. అతనికి వూపిరి పీల్చుకున్నట్టైంది. అతనికి జీవితంలో యీ ఆయుధాల్ని గురించి యేమీ తెలీదు. మంట పుట్టించడానికి వాటిని నొక్కాలని పుస్తకాలనుంచి మాత్రమే తెలుసు. టామ్ ఆ చిన్న బ్రౌనింగ్ పిస్టల్ని పట్టుకుని చేతులు చాచి ధైర్యం పుంజుకుని తెరిచివున్న ట్రంక్ దగ్గరకి వెళ్ళాడు.

అప్పుడు అతనికి ఆగ్రహం కనిపించింది.

తెల్లగా, నాలుగు చేతుల జంతువు ట్రంకు లోపలినుంచి భయంకరమైన ఓర చూపులు చూస్తూ వుంది.

టామ్ గీమని అరిచి పట్టుకోవాల్సిన దాన్ని పట్టుకున్నాడు.

ట్రంక్ పేలిపోయినట్టైంది. పింగాణీ సామాను ముక్కలు కిటికీనీ బల్లలనీ కొట్టుకుంటూ ట్రంకులో నుంచి ఎగిరి పడుతున్నాయి. టామ్ నేలమీద కూర్చున్నాడు పిస్టల్ని పట్టుకుని. అది యింకా పేలుతూనే వుంది. అతను దాన్ని విసిరేసి, నగురుస్తూ, అప్పుడే గదిలోకి కారల్‌తోటీ కార్నీలియాతోటీ కలిసి పరిగెత్తుకొచ్చిన పాలిపోయిన బేరింగ్ చేతుల్లో వాలిపోయాడు.

"ఏ ఆగ్రహాన్ని చంపేశాను!" అన్నాడతను సంతోషంతోటీ, అదిరిపాటుతోటీనీ. "పేల్చేశాను! యిప్పుడిక అది యెవర్నీ యేమీ చెయ్యలేదు! నేనేం తప్పు చెయ్యలేదు. తెరని చిల్లు పడేటట్టు కాల్చాను కిడ్డ్‌తో కలిసి రమ్ తాగాను కాని నాకు ఆగ్రహం అక్కర్లేదు!"

"ఓయ్, ఓరి, టామ్" అన్నాడు బేరింగ్, వణికిపోతూ వున్న కొడుకుని కౌగలించుకుంటూ, ఒక్కసారి నిట్టూరుస్తూ. "నాకంతా తెలుసు, బాబూ టామ్.... పిచ్చినాన్నా!"

1928

# పోర్ట్ కమాండెంట్

## 1

కమాండంట్ సరుకుల ఓడ ''రికార్డ్'' నిచ్చెనమీద యెక్కేటప్పటికే చీకటిపడింది. ఆ నిచ్చెన దీపాల వెలుతురులో దేదీప్యమానంగా వుంది. కమాండెంట్ నిటారుగా సామాన్యమైన విగ్రహం వున్న డెబ్బై రెండేళ్ల మునలాయన. ఎండు ఖర్జూరం పండులాగా ముడతలు పడిపోయిన ఆయన ముఖం క్షవరం చేసుకుని అతి మన్నగా వుంది. చేప రెక్కల్లాగా వెరిసిన చెంపలు పొడుచుకుని వున్నాయి. కనుబొమల నెరిసిన చూరు కిందనుంచి ఉల్లాసంగా వుండే చిరునవ్వుతో చిన్న నీలం కళ్లు మెరుస్తున్నాయి. విద్యుద్దీపాల ధగధగలో కమాండెంట్‌గారి టోపీ, గోధుమరంగు పొట్టి ఉన్నికోటు, తెల్లని పంట్లాం, నీలం టై, చవక బెత్తం వాటి దుస్థితి వెల్లడి చేస్తున్నాయి. ఆ దుస్థితిని యెంత శ్రద్ధగా సరిచేద్దామన్నా సాధ్యం కాదు. కమాండెంట్‌గారి పసుప్పచ్చ బూట్లు యిరవై రెండు సార్లు చిరిగిపోయాయి. అన్ని సార్లూ వాటిని దారంతో కుట్టడమో, మందం అయిన తీగముక్కలతో గట్టిచేయడమో జరిగింది. బిగిగా కుట్టిన రంగు సిల్కు ముక్క కోటు ఛాతీ జేబునుంచి తొంగిచూసింది.

కాలరుని సవరించుకుని, చెప్పిన మాట వినకుండా వుండే పట్టీలని సరిచెయ్యడానికన్నట్టు ఆయన భుజాలని గుంజుకున్నాడు. అప్పుడు కావలా అధికారిదగ్గర ఆగి, తల ఓ పక్కకి ఒరగేసి, వున్నట్టుండి చేతులు చాచాడు.

''టామ్ లాస్టన్!'' ఉల్లాసపూరితంగా, కంపించే స్వరంతో అన్నాడు కమాండెంట్. ''యీ మాంఛి ఓడమీద నీ బెట్సీ కోసం కలగంటూ వుండే నిన్ను చూస్తానని నాకు తెలుసు. నీ బెట్సీ.... అక్కడెక్కడో దూరంగా వుంది. ఉరుములు మెరుములు! ప్రయాణం బాగా సాగుతోంది కదా?''

''కట్లే!'' లాస్టన్ యెక్కడికో కేకేశాడు. ''కమాండెంట్ వచ్చాడు. యేమిటి మరి?''

''ఛవ్, అవతలికి పొమ్మను!'' అని బింకంగా సమాధానం వచ్చింది.

ఆ మునలాయన చూపు అర్థిస్తున్నట్టుగా, ఆశ్చర్యంగా బెదురుగా వుంది. యజమాని దృష్టిని ఆకట్టుకోవాలని చూసే కుక్కతోక లాగా ఆయన బెత్తం పైకీ కిందికీ వూగుతోంది.

''ఏయ్, యెందుకంత నిష్ఠురంగా వుండటం అతని మీదా?'' అన్నాడు లాస్టన్ సౌమ్యంగా, ముసలతని భుజం తడుతూ. ముడవడానికి వీలైనట్టుగా వున్న మునలాయన్ని ఆ చరుపు కూర్చునేటట్టు చేసింది. ''కట్లే, నువ్వు అతన్ని పలకరిస్తావనుకున్నాను. మరేం భయపడకు కమాండెంట్, కట్లే వేళాకోళం ఆడుతున్నాడు.''

''ఎవరు వేళాకోళం ఆడేది?'' అన్నాడు ముఖ్య స్టోకర్* కట్లే వాళ్లకేసి వస్తూ. అతను విశాలమైన భుజాలూ యెముక పుష్టీ వున్న మనిషి. ''నువ్వెప్పుడు గెర్టన్‌కి వచ్చినా కమాండెంట్ సిద్ధం. చిరాకేస్తోంది. మునలాయనా, పడుకో పోయి.''

---

* పొగయంత్రంలో నిప్పు ఆరకుండా చూసేవాడు. — అను.

''నేనిప్పుడే 'అబ్రహాం రెప్స్'నుంచి వస్తున్నాను'' అని ఆ ముసలతను స్టోకర్ అవే మాటలు వినపోట్టే అన్నాడు. ''అంతా బాగుందక్కడ. ప్రయాణం బాగా సాగింది. ఉదయం 'రెప్స్' వెళ్లిపోతోంది. తండేలు టోర్బీతోటి కాఫీ తాగి ఛెక్కర్స్ ఆడాను. భలేవాడ్లే! బాగున్నావా కట్స్లే? అంతా సరిగ్గానే వుందనుకుంటాను. మీ పిల్లా పాపా అంతా?''

''యిదిగో చుట్టకాల్చు'' అన్నాడు కట్స్లే, ఆ ముసలతనికి ఓ నల్లని చుట్టని పడేస్తూ. ''గట్టిగా పట్టుకో, లేకపోతే జార విడుచుకుంటావు.''

''ఓహో, కేప్టెన్‌గారు యిక్కడున్నారే!'' అని అరిచాడు కమాండెంట్, కోటు సవరించుకుంటూ, కేప్టెన్ కేసి హుషారుగా పరిగెడుతూ. కేప్టెన్ భార్యతోటి థియేటర్‌కి వెళ్లాలి. ''నమస్తే, కేప్టెన్. చాలా నమస్కారాలు... ఉమ్.... యీ సాయంత్రం బాగా వుంది. అలా షికారుగా పోతూ సంగీతం వినాలనిపిస్తుంది యెవళ్లకేనా. బాగున్నారా? అంతా సక్రమంగా వుందనుకుంటాను. తుఫాన్ దెబ్బ తగల్లేదు కదా యెక్కడా. మీ ఆరోగ్యం.... చాలా బాగుందా?''

''ఓ, నువ్వా టిల్స్'' అన్నాడు కేప్టెన్ హెన్రీ హాల్టన్, ఆగి. అతను పొడగరి. ముప్పై అయిదేళ్లుంటాయి. ముఖం గాలి తాకిడి తగిలినట్టుగానే వుంది. ''యింకా తిరుగుతున్నావన్న మాట — బాగుంది! సంతోషం. కాని కొంచెం హడావుడిలో వున్నాం. యిదిగో యీ డాలరు తీసుకుని ఓడ వంట గదిలోకి బట్లరు దగ్గరికి వెళ్లి దీనికి తగ్గా వాగు. మంచిది. మేరీ, యితనే కమాండెంట్.''

''మీరేనా కమాండెండంటే?'' అని ఒక పడుచావిడ చిరునవ్వు నవ్వింది. ''పోర్టు కమాండెంట్? మిమ్మల్ని గురించి విన్నాను.''

''నేను వాళ్లందరికీ తెలుసు!'' అన్నాడు టిల్స్ ముసలాడిలా గట్టిగా కిలకిలలాడుతూ. ఓ చేతిలో చుట్ట, యింకో చేత్తో డాలరూ, బెత్తం పట్టుకున్నాడు. ''నావికులు గొప్పవాళ్లు. మా అభిరుచులు పరస్పరంగా వుంటాయి, నాకు నావికులంటే వల్లమాలిన ప్రేమ. నేను ఓడ డెక్కుమీదకి యెలా వస్తానంటే.... యెలా.... యోలా....''

యింక మిగిలింది వినడానికి ఆగకుండా కేప్టెన్ పెళ్లాన్ని తీసుకుని ఒడ్డుకి వెళ్లిపోయాడు. టిల్స్ మర్యాదగా అతని వెనక్కాల టోపీ యెత్తి, అప్పుడు లాస్టన్ కేసి తిరిగాడు.

''భలే మనిషి మీ కేప్టెన్! తిమింగిలం లాంటివాడు. అపాదమస్తకం.''

కమాండెంట్ (అది అతనికి వేళాకోళంగా పెట్టిన పేరు) ఓడ రేవులో వుండే పరమ కవాడీ కాకా హోటల్ దగ్గర్నుంచి కస్టమ్స్ బ్యూరోదాకా ప్రతి ఒక్కళ్లకీ భాగా తెలుసు. ఒక ప్రైవేట్ సంస్థ కొట్టు గదిలో గుమాస్తాగా టిల్స్ తన యావజ్జీవితమూ గడిపాడు. పూజ్యనీయమైన వయస్సు ఫలితంగా ఆఖరికి ఆయన్ని తొలగించవలసి వచ్చింది. అప్పటినుంచీ అతన్ని అతని విధవ సోదరి పోషిస్తూవుండింది. నిస్సంతు అయిన యాభై యేళ్ల రెబెకా బార్టెల్స్ అనే చెల్లెలితోనే అతను వుంటున్నాడు.

టిల్స్ నావికుడు కాకుండా మూర్ఛరోగం అడ్డంకొట్టింది. పెద్దవాడయ్యాక రోగం తగ్గినాగానీ అతను వూహల్లోనే నావికుడుగా మిగిలిపోయాడు. పొద్దున్న అతని చెల్లెలు అతని జేబులో పెద్ద రొట్టెముక్కని పడేసి చిల్లర ఖర్చుల కోసమని పది సెంట్లు యిచ్చేది. బెత్తం వూపుకుంటూ కమాండెంట్ పోర్టులో పర్యటించడం మొదలుపెట్టేవాడు. అతను డబ్బుని ఆశించే పనులేమీ చెయ్యలేదు. ఓడలన్నా నావికులన్నా చిన్నప్పుడే ఆకర్షితుడయాడు — అప్పటినుంచీ, యింకా తల్లి చేతుల్లో వున్నప్పుడే, అతను తన చేతుల్ని సముద్రపు నీలి కుడ్యంమీద వాలే తెరచాపల దృశ్యం కేసే చాచాడు.

శుష్కించిపోయిన చేత్తోటి వణుకుతూ సిగరెట్ ముట్టించుకుని కమాండెంట్ లయబద్ధంగా నడుస్తూ ఓడ వంటగదిలోకి వెళ్లాడు. అక్కడ వంటవాడు అతని కనుబొమల్నీ చెంపల్నీ చూడగానే పగలబడి నవ్వాడు.

''నువ్వు తయారవుతావని నేననుకున్నాను, టిల్స్'' అన్నాడతను అతని కేసి ఓ స్టూల్‌ని జరిపి, మగ్గులో కాఫీ నింపుతూ. ''ఏమిటి యెక్కడికెళ్లావ్? 'స్టెల్లా'ని చూసి వుండవు. నావె దింపే రేవులో కూర్చుంది, ఫాక్టరీ యెదురుగుండా. సరిగ్గా యీ క్షణంలో వాళ్లు పేకాడుతూ తాగుతూ వున్నారు.''

''అహహా, అంత వేగంగా వద్దు, వేగంగా వద్దు, గౌరవనీయుడైన పీటర్ బట్లర్'' అన్నాడు టిల్స్ ఒక నిట్టూర్పుతోటి. తన స్టూల్‌ని బల్ల దగ్గరకంటా జరుపుకుని, చేతుల్ని బెత్తం వంపుమీద ఆన్చుకుంటూ, కూర్చున్నాడు. ''తమరి ఆరోగ్యం ఎలా వుంది? బాగానే సాగుతోందా? నీ ధర్మపత్ని నీ రాక కోసం యెదురు చూస్తూ వుంటుందేం? హుమ్.... నేను 'స్టెల్లా' మీదకి వెళ్లే వచ్చాను. అప్పటికింకా వాళ్లు ఆట మొదలెట్ట లేదు. అప్పుడే ఓడ కరణాన్ని పేకలు కొనుక్కు రావడానికి పంపారు. ఆఁ. కాని నేను యెక్కువ సేపుండ కుండానే వచ్చాను, తెలుసా, యేమంటే అక్కడ యిద్దరు వ్యక్తులు వున్నారు నన్ను వాళ్లు.... వూఁ.... సరిగ్గా చూడరు. నేను పీడించే ముసలి బికారినట, వాళ్లంటారు.... మరి నాకు యిబ్బంది అనిపించి వాళ్ల తోటి ప్రతిదాని పట్లా.... వీరులైన నావికుల పట్లా, ఓడ పట్లా.... నా ప్రేమని గురించి చెప్పలేకపోయాను.... కాని నాకు యెప్పటికీ ఆ ప్రేమ వుంది తెలుసు కదా....''

టిల్స్‌కి విచారం కలిగి, ఒక సారి వెక్కాడు. బట్లర్ ఒక అల్మారాని అందుకుని తటక్కున అనాస మద్యపు సీసాని బల్లమీద వుంచాడు.

''పీలాంటి తలపండిన సరంగు మరి గ్లాసు నిండుగా పోసెయ్యాలి'' అన్నాడు బట్లర్. ''ఏమంటావ్? మనం తాగుదాం పట్టు, ఆ వెధవల్ని గురించి మరిచిపోదాం. నీ ఆరోగ్యం కోసం! నా ఆరోగ్యం కోసం! ఐసల బొజ్జ! హురావ్!''

బట్లరు అరగ్లాసుడు మద్యాన్ని బలిసివున్న గొంతులోకి దొర్లించుకున్నాడు. బొటన వేలితోటి కింది పెదవిని తుడుచుకున్నాడు. తదేకంగా టిల్స్‌కేసి గుడ్లప్పగించి చూశాడు. టిల్స్ గ్లాసులోనుంచి మెల్లిగా పీల్చి, తను ''అంమ్'' అని అనదలచుకున్నట్టు పెదాలని కదిపాడు. నీళ్లుకారే కళ్లని తుడుచుకుని, ముక్కు చీదుకున్నాక, ఆరిపోయిన సిగరెట్టుని అందుకున్నాడు.

''యింకో పట్టు?''

''వుహుఁ, చాలు. అవసరమైతే తర్వాత చూద్దాం. ఉరుములు మెరుపులు! 'స్టెల్లా' మంచి ఓడ, చాలా మంచిది'' అన్నాడు టిల్స్. ప్రతీ మాటకీ తల నీరసంగా కదులుతూనే వుంది. ''ఆ ఓడని 1901లో ప్రారంభించారు. చెర్లీ 'సైరన్' మీద పనిచెయ్యడం లేదు. నిన్న అతన్ని మార్లే హోటల్ దగ్గర చూశాను. 'విశ్రాంతి తీసుకుంటాను' అన్నాడు. 'అసలు సంగతేమిటంటే' అంటాడు చెర్లీ. 'నాకు సంస్థతోటి తగూ పడింది. నాకు వాళ్లు పూర్తిగా సొమ్మివ్వలేదు.' యివాళ నేను 'బ్లాక్ బుల్' దగ్గరకి వెళ్లాను. యేమిటి యేమిటో చూద్దామని ఆగాను. ప్రతీదీ బాగుంది. రంపర్ తన సారాకొట్టుని మూలకి మార్చేశాడు, వాళ్లా భవనాన్ని యేదో స్టోరుకి అమ్మేస్తార్ట. వాట్సన్‌కి పెన్షనే రాలేదు; యెంత దారుణం! అతను తాగుతాడు, నా మాట పడిపోనీ! అయినా అతను అద్భుతంగా తాగుతాడనే అంటాను, ఒంటెలాగా, చేపలాగా. చూడ్డానికే సరదాగా వుంటుంది. ఓ మగ్గుని తీసుకుని దానికేసి చూస్తాడు. 'ఫిలిప్పీన్స్‌లోనేం' అని మొదలెడతాడు వాట్సన్. 'హుషారుగా వుండేది, నిజం' అంటాడు. 'జమైకాలో భలే బాగుంది' అంటాడు. 'రాయల్ స్టార్' మునిగి పోయింది. తుఫానులో చిక్కుకుందట. రాలిన చుక్కలు! సైమన్ లెగ్రీ తెలుసా? సముద్రపుదొంగ? సైమన్ లెగ్రీ సముద్రపు దొంగ. ఓ సారి ఓ.... ఓ వ్యవహారం తర్వాత నన్ను సరదా పరిచాడు. అతను అన్నాడు: 'వాళ్లు

 'నాచ్'ని ముంచి వుండేవాళ్ళు కాదు, శనిగాడు వాళ్ళకి సాయం రాకపోతే' అన్నాడతను. అప్పుడతను తిట్టిపోశాడు, అందరూ ఆలోచనలో పడిపోయారు. వాడు భలేవాడ్లే, గ్రెగ్. వాడిని అనుకోవాలి ఉరుములు మెరుపులు! అప్పుడు నేను అనేవాణ్ణి: 'గ్రెగ్ తెలుసు కదా నన్ను తీసుకెళ్ళు! ఓడలమీదకి! హోయ్‌హోయ్ హుర్రే, చావుకీ బతుక్కీ!' కాని అతగాడు దేంతోటో వేరే పనిలో వుండిపోయి నేను చెప్పింది వినలేదు. ఆ 'నాచ్' పోయి వుండేది కాదప్పుడు. నేనున్నా నంటే దెయ్యం కూడా...."

"అవున్లే, కమాండెంటూ" అన్నాడు లాన్టన్ వంటగది గుమ్మం దగ్గర కొచ్చి, "నువ్వు వాటిని సరి చేసేస్తావు."

"అవును మరి" అని గట్టిగా అన్నాడు టిల్స్. "మరి అలాగే జరిగేది నిజంగామా."

యింకో గ్లాసు తాగేటప్పటికి టిల్స్‌కి హుషారు హెచ్చింది. త్వరగా వెళ్ళిపోయేటట్టేం కనబడలేదు. తన సుదీర్ఘ జీవితంలో తను విన్నవీ, కన్నవీ తను అనుకున్నవాటితో కలబోసి నానారకాల సమావేశాలవీ వర్ణించడం మొదలుపెట్టాడు. అతను బాగా మత్తెక్కేటట్టేం తాగలేదు, వాగుడుకాయలా తయారయాడంతే. భూమి అంచులకంటా ఓడమీద ప్రయాణం అయే దారుఢ్యమైన యువకుడిలా భావించుకున్నాడు. యేమైనా వంట మనిషి శ్రీ రిబేరాని "గ్రెవెల్" ఓడమీద వుండే ప్రధాన మెకానిక్ అనుకుని రెండు సార్లు పిలిచాడు, లాన్టన్‌ని శ్రీ బౌమన్ అనీ ఆరకంగా అతన్ని "బొలీవియా" నౌకమీది తండెల్ అనుకునీ గజిబిజి పడ్డాడు. అప్పుడు కమాండెంట్‌ని పంపించెయ్యాల్సిన వేళ అయిందని వంటమనిషి అనుకున్నాడు. అలా చెయ్యడానికి ఒక్క పద్ధతే వుంది. కాని కమాండెంట్ యేం బదులు చెప్పకుండా దానికి చిత్తం అంటాడు. వంటమనిషి కేసి కన్నుగీటి లాన్టన్ అన్నాడు:

"సరే, కమాండెంట్, వెళ్ళి 'పిల్‌గ్రిమ్'ని లంగరు వెయ్యడానికి మా కుర్రాళ్ళకి సాయంచెయ్యి. యింకో క్షణంలో మేము లంగరు దించేచోటుల్ని చేరుకుంటున్నాం."

టిల్స్ వెనక్కి వాలి, లాన్టన్ కేసి కనుబొమల కిందమంచి పారజూశాడు. తప్పుడు బెరుగ్గా కాలర్‌ని సరిచేసుకున్నాడు.

"నాకు పిల్‌గ్రిమ్ తెలుసు" టిల్స్ జాలిగొలిపే గొంతుకతో వదరడం మొదలెట్టాడు. "అది చాలా మంచి ఓడ. హంగర్ అగ్రం దగ్గర 1914లో తెరచాపమడతలో రెండు చిల్లులు.... పన్నెండు నాట్‌ల వేగం.... మామూలే."

"కానీ, టిల్స్, మా పిల్లాళ్ళకి కాస్త చెయ్యి అందియ్యి" అన్నాడు వంటమనిషి కుహనా గంభీరత్వంతోటి.

కమాండెంట్ మెల్లిగా టోపీ అంచు లాక్కుని కష్టంమీద స్టూలు మీదనుంచి బయటపడుతూ నుంచున్నాడు. పెద్ద మోకుల మందాన్ని స్పష్టంగా వూహించుకోవడంతోటే ఆ ముసలాడి చిరుమత్తు వదిలింది. అతను నీరసపడి అలిసిపోయాడు.

"నేను యింటికి పోతా" అన్నాడతను బట్లర్ కేసీ లాన్టన్ కేసీ గబగబా చిరునవ్వు నవ్వుతూ. వాళ్ళు ఛాతీలమీద చేతులు కట్టుకుని, కళ్ళు సగం మూసుకుని, అతని ముందు ఘనంగా కూర్చున్నారు. "ఆఁ, నేను వెళ్ళాలి. ఎనిమిది లోపునే వచ్చేస్తానని చెప్పాను. లంగరు తాళ్ళెయ్యండి అబ్బాయిలూ, అలల చాలులో 'పిల్‌గ్రిమ్'ని లాగండి. హో, హో! సరదాగా వుంది. నే పోతున్నా...."

"యిది వికార పరిస్థితి" అన్నాడు బట్లర్. "నువ్వు పోతున్నావ్! నిజంగా, కమాండెంట్! కుర్రాళ్ళూ, తండేలూ యింకో క్షణంలో వస్తున్నారు; రా మరి, మాకు సాయం చెయ్యి."

"వుహుఁ, హుఁ, హుఁ. నేను వెళ్ళిపోవాలి. వెళ్ళిపోవాలి" టిల్స్ త్వరపడ్డాడు. "నేను పెందరాళే యింటికి వస్తానని మాట యిచ్చాను, తెలిసిందా."

"ఎక్కడికి పోతున్నావ్?" అన్నాడు యువ నావికుడు స్క్రాంక్ లోపలికి వస్తూ.

"ఓయ్, కుర్రాడా! ప్రయాణం బాగుందా? ఆరోగ్యం గౌరవనీయమైన నీ...."

"అమ్మగారిది, పొరపాటు పడేవ్—ఆమెగారు అద్భుతంగా వున్నారు. సరే అసలు విషయం అది కాదు. కావలిస్తే పీ క్లబ్బు దగ్గరకి రండి. అక్కడ పెగ్గీ స్కాట్టర్ అనే అమ్మాయి కాంటీన్‌లో పనిచేస్తోంది."

"పెగ్గీ స్కాట్టర్?" టిల్స్ గొణిగాడు, కొంచెం పుంజుకుని, "రికార్డ్" లావుపాటి మోకులన్నా భయం లేకుండా. "ఆ పిల్ల నాకు తెలుసు లెండి. భలే పిల్ల, నన్ను కాల్చిపారేసినా ఆ మాటే అంటాను! ఆమెని నేను ఎరుగుదును, నే చెపుతున్నాగా."

"అయితే ఆ పిల్లతో చెప్పు దాని నేస్తం విల్లీ బ్రాంట్ హెయ్‌నాట్‌లో వెలకితం ప్లేగు వచ్చి చచ్చిపోయాడని. అక్కణ్ణుంచి వచ్చిన నావికుడొకడు 'హస్కారెకా'లో కనపడి మా స్నేహితులు కూర్చున్న చోటకి వచ్చి యీ సంగతి చెప్పాడు. ఆమెకి యీ విషయం యెవరు చెప్పాలి? ఎవరూ లేరు. ప్రతి వాడికీ భయమే. దీన్ని గురించి యెవరేవా ఆమెకి యెలా చెప్పగలరు? ఏడుపు లంకించుకుంటుంది. కాని నువ్వు చెప్పగలవు, టిల్స్. నువ్వు నిబ్బరమైన మనిషివి. ఇనక గడియారం లాంటి పాతవాడివి. పనులు యెలా చెయ్యాలో నీకు తెలుసు. ఏం, సరేనా?"

"సరిపోతుంది" అన్నాడు లాన్స్టన్, పట్టుగా, కాలు కదుపుతూ.

"సరిపోతుంది" కొంచెం సేపు నిశ్శబ్దంగా వున్నాక బట్లర్ అన్నాడు.

"తిన్నగా యీ పని చేసేయి, ఆమెని సందిగ్ధంలో పెట్టి చంపక. అనవసరంగా భయపడి తోక ముడిచేవు!" అని సూచన లిచ్చాడు స్క్రాంక్.

"అవును, సాగదీస్తే మరీ అధ్వాన్నమవుతుంది" వత్తాసు చెప్పేడు బట్లర్. "మరి కానీ, నేరుగా పో."

పెదాలు ముడుచుకుని ముసలాడు తల దించుకున్నాడు. లయబద్ధంగా, భారంగా, పనిలో వున్నట్టుగా వున్న నావికుల ఉచ్ఛ్వాస నిశ్వాసాలు మాత్రమే వినిపిస్తున్నాయి.

"సంగతేమిటంటే" స్క్రాంక్ మళ్లీ అందుకున్నాడు, "యిప్పుడు నువ్వు చెప్పావనుకో ఏదో చెట్టు వూగినట్టు, గడియారం టిక్కు మన్నట్టు చెప్పేస్తావ్. 'బ్రాంట్.... ప్లేగుతోటి.... హెయ్‌నాట్‌లో.... చ... చ్చి... పోయా... డు' అనేస్తావ్, వదిలిపోతుంది. నే వెళ్లాననుకో బాగోదు, ఏమంటావ్? అలాంటి పనికి నేను వెళ్లాలంటే ముందు బాగా తాగి వుండాలి."

"వూఁ, తిన్నగా పోతా" టిల్స్ బొంగురుగా అరిచి కాలితో నేలమీద తన్నాడు. "ధైర్యంగా సాహసంగా. ఆవిడ గుండె రాయి. సిసలైన సముద్రపు గిట్ట. యిదిగో మాట యిస్తున్నాను స్క్రాంక్, చూడు బట్లర్, నీకూనూ లాన్స్టన్. తక్షణం యీ పని చేస్తా."

## 2

పెగ్గీ స్కాట్టర్ టీ కాంటీన్ దగ్గర హడావుడిగా వుంది. ఆ కాంటీన్ క్లబ్బు కింద హాల్లో నడవకి కుడివేపున వుంది. ఆమె పొట్టిగా లావుగా వుంది కాని పొందికైన విగ్రహం, శరీరంమీద లేత గోధుమ రంగు మచ్చలు, చప్పిడి ముక్కు వున్న మనిషి ఆమె. ఆమె బూడిదరంగు కళ్లు గంభీరంగా, ప్రశ్నార్థక

 దృక్కులతో వుంటాయి. ఆమె ముదురు యెరుపు జుట్టు ఓ డజను. గట్టి పిన్నీసులతో మెడ వెనక కట్టేసి బాగా మెరుగు పెట్టిన కంచులాగా తళతళ మెరుస్తోంది.

లేసుతో అంచుకుట్టిన తన యజమానురాలి జాకెట్ వంపుని ఆమె సహాయకురాలు పదోసారి పరిశీలనగా చూశాక పెగ్గీ టిల్స్‌ని చూసింది. అతను కాంటీన్‌లోకి అర్ధవలయంలో ప్రవేశించాడు, తన తెలిసిన కాతాదార్లకి నమస్కారం పెట్టడానికి తరచుగా ఆగుతూ.

"చూడు మెల్లీ, కమాండెంట్ వచ్చాడు" అంది పెగ్గీ పెద్ద మూకుడుమీద బిస్కట్లు సద్దుతూ. "అతను యిక్కడికే వస్తున్నాడు. సరే, సరే, కానీ, ముసలి వాగుడు పిట్ట!"

కొంచెం దూరంలో వుండగానే పెగ్గీకి దణ్ణం పెడుతూ టిల్స్ తిన్నగా కౌంటర్ దగ్గరికి చేరాడు. పెగ్గీ కళ్లతోటే అతని వార్ధక్యాన్ని గురించీ, ఆ రోజు చేసిన పనుల గురించీ వాకబు చేస్తున్నట్టుగా చూసింది. భయం పుట్టించేట్టు నిగూఢంగా వున్న అతని ముఖం కేసి చూసి చిరునవ్వు నవ్వింది.

"హల్లో, మా గౌరవనీయమైన, ఎల్ల వేళలా శోభాయమానంగా... ఎలా అంటే...." అన్నాడు టిల్స్, కాని అప్పుడు కళ్లుమిటకరించి, మెల్లిగా పూర్తిచేశాడు: "ప్రయాణం బాగా సాగిందని ఆశిస్తాను.... క్షమించు అది కాదు. చాలా అద్భుతమైన సాయంత్రం, ఏమంటావ్? బాగున్నావా?"

"ఒకటి తీసుకో, కమాండెంట్" అంది పెగ్గీ ఓ బిస్కట్ అతనికి అందిస్తూ. "విల్లియం బ్రాంట్ ఆరోగ్యంకోసం తిను. అతన్ని గురించి యీ మధ్యనే అడిగావు. అతను త్వరలోనే వస్తున్నాడు. అలా అని రెండు వారాలకితం రాశాడు. అతను వచ్చాక బ్రహ్మాండమైన రమ్ము బుడ్డిని నీకోసం బల్లమీద పెట్టేస్తాను.... టీ లేకుండా. నేనే కూర్చుంటా అందివ్వడానికి, కాని ప్రస్తుతానికి మాత్రం వెనక్కి వుండు, యేమంటే సప్లయర్లు పళ్లేలు పుచ్చుకుని ఆదరాబాదరా వచ్చేటప్పుడు తోసేస్తారు నిన్ను."

"కృతజ్ఞుణ్ణి" అన్నాడు టిల్స్, నెమ్మదిగా బిస్కట్‌ని జేబులో పెట్టుకుంటూ. "అవును... బ్రాంట్ వచ్చినప్పుడు... పెగ్గీ! పెగ్గీ!" అతను ఒక్క సారి భోరుమన్నాడు.

కాని అంతకంటే యేమీ అతను చెప్పలేదు. ముడతలు పడిన అతని చెక్కిళ్లు వణికాయి. అతని చూపు చెమ్మగా, గజిబిజిగా వుంది.

పెగ్గీకి ఆశ్చర్యం కలిగింది. ఏమంటే కమాండెంట్ యెప్పుడూ అంత చనువుగా వుండలేదు. ఆమె అతని కేసి తదేక దృష్టితో చూసింది, బల్లమీదనుంచి వంగింది కూడానూ.

తను చెప్పాల్సింది చెప్పడానికి టిల్స్ ధైర్యం చిక్కబట్టుకోలేకపోయాడు. ఒక ఆడమనిషి దారుణ రోదనం ఉల్లాసంగా నవ్వే పువ్వులూ, అందమైన పింగాణీ సామానూ వున్న యీ హుషారైన హాలుని దద్దరింపచెయ్యడం అతను భరించలేడు. అతను భయంభయంగా గాలిని పీల్చాడు. శ్వాసని బయటికి గనక వదిలితే అది పెగ్గీని తన బ్రాంట్‌కి సంబంధించిన వార్తతోటి పడగొట్టేసేది. అతను పిరికిగా తచ్చాడాడు, దడదడలాడుతూ తిరిగే బొంగరంలాగా ముందునుంచి వెనక్కి మెలితిరిగి వంగుతూ.

రవికచేతి వంపుని గురించి పెగ్గీ మెల్లీతోటి యిక చర్చించలేదు. "పెగ్గీ! పెగ్గీ!" అనే టిల్స్ మాటల ఫలితంగా యేదో వింత అయింది ఆమె బుర్రలో వుండిపోయింది. బ్రాంట్‌ని గురించి ఒక గంట సేపు అనుకుంది, ఆరిన దీపంలాగా మబ్బుగా అయిపోయింది. ఆఖరికి పిడికిలితోటి కౌంటరు పాలరాతి పలకమీద కొట్టింది.

"అతన్ని ఆపకపోవడం యెంత తెలివితక్కువ పని చేశాను!" గొణుక్కుంది పెగ్గీ. "యితను యెందుకో నన్ను కలవర పెట్టాడు."

''కమాండెంట్ తాగి వున్నాడు తెలీటంలా?'' అంది మెల్లీ. ''వాసన కొడుతోంది. నాకు వాసన తెలుస్తోంది.''

అప్పుడు పెగ్గీ కొంచెం స్థిమిత పడింది. కాని ఆ క్షణంనుంచీ ఆమె వూహల్లో ఒక నల్లని మచ్చ వుండి పోయింది. కొన్ని రోజుల తర్వాత టిల్స్ చెల్లెలి దగ్గర్నుంచి యీ విషాదకర వార్తని లేఖద్వారా అందుకున్నప్పుడు ఆమెకి యీ నల్లని మచ్చ, ఆ దారుణాఘాతాన్ని తట్టుకునేందుకు మెత్తలా, పనికివచ్చింది.

''వచ్చేశానమ్మా'' అన్నాడు టిల్స్ చెల్లెలితోటి యెలాగైతేనేం యింటికి చేరి. ఆమె గదిలో ఓ మూల కుట్టుమిషన్ దగ్గర కూర్చుని వుంది. ''నేను బాగా అలిసిపోయాను. అంతా బాగున్నట్టే వుంది. అందరూ మంచి ఆరోగ్యంగా వున్నారు. ప్రయాణం బాగా సాగింది. నేను 'లా ట్రవీతా,' 'స్టెల్లా,' 'అబ్రహాం రెవ్స్,' 'రికార్డ్'లమీదకి వెళ్లాను. కేప్టెన్ హోల్టన్‌ని కలిశాను. 'హల్లో' అన్నాడు కేప్టెన్. 'బాగుంది' అంటాడతను. 'పెద్దాయనా, టిల్స్. నువ్వింకా లాక్కొస్తూనే రాగలవు.' నన్ను థియేటర్‌కి రమ్మన్నాడు. యేమైనా నాకు పెద్దపెద్ద వాళ్ల దగ్గర బెరుకు. మేం యిద్దరం తాగాం. అతను నాకో బిస్కట్ యిచ్చాడు, ఒక డాలర్, మరి యిదీ... వుహూఁ, పొరపాటు, పెగ్గీ స్కాట్టర్ యిచ్చింది బిస్కట్. ఆవిడ ప్రియుడు చచ్చిపోయాడు. చాలా బాధకలిగించే వార్తని చెరెయ్యడం. అయినా చేశాను. అబ్బ, ఆ కన్నీళ్లు, అరుపులు నువ్వు వూహించుకోలేవు.... నేను వచ్చేశాను.''

''నువ్వు పెగ్గీకి యేం చెప్పలేదులే, అన్నయ్యా'' అంది రెబెకా. ''నీ సంగతి నాకు బాగా తెలుసు. వెళ్లిపడుకో. నీకు ఆకలికనక వేస్తే అల్మారా అరలో వున్న గిన్నెలో మాంసం వుండలున్నాయి తిను.''

ఒక సంవత్సరం గడిచింది. ''రికార్డ్'' మళ్లీ వచ్చింది. కాని కమాండెంట్ రాలేదు. అతను పులుసు తాగుతూ వుంటే ఉక్కిరిబిక్కిరి అయిపోయి దగ్గువల్ల చచ్చిపోయాడు. టిల్స్ చాలా సేపు దగ్గి ఒగర్చేటప్పటికి గొంతుకలోని రక్తనాళం ఒకటి చిట్లిపోయింది. ముసలాడికి నీరసం వొచ్చేసి, పడిపోయాడు. రెండు రోజుల తర్వాత చచ్చిపోయాడు.

సాయంత్రం అయేటప్పటికి లాస్టన్ బట్లర్‌తోటి అన్నాడు. ''ఏదో పోయినట్టుంది. రకరకాల వార్తలూ, సమాచారం మనకి యెవరు అందిస్తారు?''

అతను యింకా పూర్తిగా యీ మాటలు అనలేదు. పొడుగ్గా, బండగా సిగ్గు లేకుండా, ఎర్రటి ముఖం వున్న ఒకతను వెర్రిచూపులు చూస్తూ, కాళ్లకి చెప్పుల్లేకుండా హడావుడిగా డెక్కుమీదకి యెక్కి సిబ్బంది బసదగ్గరికి వచ్చాడు.

''హల్లో!'' అని అతను అరిచాడు, వికారంగా వుండే తన టోపీని ఆడిస్తూ. ''ప్రయాణం యెలా సాగింది నావికులూ? యాత్ర బాగా వుందా? మీ కుటుంబం అంతా క్షేమమేనా? వూ, కానివ్వండి నాకో గ్లాసు పొయ్యండి.''

''ఎవరు నువ్వు?'' అని అడిగాడు బట్లర్.

''పోర్ట్ కమాండెంట్‌ని! టిల్స్ టపాకట్టేశాడు; సరే... మరి అతని స్థానంలోకి నేను వచ్చాను.''

లాస్టన్ భయంకరంగా చిరునవ్వు నవ్వి, నిశ్శబ్దంగా నుంచుని, అతగాణ్ణి మోచేత్తో పట్టుకుని, కట్టరోడ్డు దాకా యీడ్చుకుపోయాడు.

"యిదీ నువ్వు పోవాల్సిన దారి. మళ్లీ ముఖం చూపించకు" అన్నాడు.

"చిత్రం!" అన్నాడతను, ఫరవాలేదు అనుకున్నంత దూరం పోయి. "మాటకి యెవరేనా మీ బూట్లని కొట్టేస్తే మీరు కొత్త బూట్లని కొనుక్కోరూ? మీకేదో ఉపకారం చేద్దా మనుకున్నాను — దొంగలు, తుంతలు, వెధవలు, పింజారీగాళ్లు!"

"లేదు, లేదు" అన్నాడు లాప్టన్ ఆ మూఢుడి మాటలకి కష్టపెట్టుకోకుండా. "శుద్ధ దగా. 'ప్రయాణం బాగా సాగిందా' అని అడగాల్సినట్టుగా మీ నోరు యెన్నటికీ అడగలేదు."

1929

పాఠకులకు మనవి

ఈ పుస్తకాన్ని గురించీ, దీని అనువాదాన్ని గురించీ మీ అభిప్రాయాలనూ, మీ సలహాలనూ మా భావిప్రచురణల సహాయార్థం మాకు పంపండి.

మా చిరునామా:

Raduga Publishers
17, Zubovsky Boulevard
Moscow, USSR

మా ప్రచురణలు దొరికే చోట్లు:

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
చంద్రం బిల్డింగ్స్
విజయవాడ — 520004

విశాలాంధ్ర బుక్ హౌస్
ఏలూరు రోడ్డు
విజయవాడ — 520002

విశాలాంధ్ర బుక్ హౌస్
బాంక్ రోడ్డు
హైదరాబాదు — 500001

విశాలాంధ్ర బుక్ హౌస్
కాలేజి రోడ్డు
అనంతపురం —515004

విశాలాంధ్ర బుక్ హౌస్
11–1–37 గాంధీ రోడ్డు
తిరుపతి — 517501

